

హైద్రాబాదులోని హిందీ ఆర్ట్సు కళాశాల క్రొత్త భవనానికి 1962 జులై 17వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పునాదిరాయి వేశారు.

కేంద్రసమాచార, ప్రసారశాఖామంత్రి డాక్టరు బి. గోపాలరెడ్డి 1962 జులై 27వ తేదీన, హైద్రాబాదులోని పంచవర్ష ప్రణాళికా ప్రచార కార్యాలయంలోని ప్రదర్శనా వస్తువులను తిలకించినప్పటి చిత్రం

సంపుటి: 6

సంచిక: 11

# ఆంధ్రప్రదేశ్

సచిత్ర మాసపత్రిక

సెప్టెంబరు, 1962

భాద్రపద-ఆశ్వియుజ 1884 శకం

సంవత్సరం చందా:
3 రూపాయలు

విడిప్రతి వెల
25 నయాపైసలు

# విషయసూచిక


| | | | |
|---|---|---|---|
| "భవిష్యత్తుకోసం పరిశ్రమిద్దాం" | ... | డాక్టర్ నీలం సంజీవరెడ్డి | |
| పదండిరా | ... | శ్రీ సోమ సుందర్ | 1 |
| వెలుగు బాటలు | ... | "ఉదయభాను" | 2 |
| బాలగంగాధర తిలక్ | ... | శ్రీ అరవింద (తెలుగు: శ్రీ బి.ఎస్. రాఘవ) | 6 |
| విశేషాలు | ... | | 10 |
| కమ్యూనిటీ రేడియో సెట్లు | ... | | 11 |
| తెలుపు నలుపు | ... | పద్మశ్రీ శ్రీ సి. నరసింహం | 13 |
| పానకంలో పుడకలు | ... | శ్రీ ద్వివేదుల సోమనాధశాస్త్రి | 16 |
| విద్యుచ్ఛక్తి సరఫరా | ... | | 23 |
| ప్రశ్నలు—సమాధానాలు | ... | | 24 |
| మహాకావ్యము—ప్రబంధము | ... | "సుప్రసన్న" | 27 |
| సంగ్రహ ప్రకటనలు | ... | | 35 |
| చీకటిలో వెలుగు | ... | శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు | 38 |
| పంచాయతీరాజ్య పురోగమనం | ... | | 45 |
| విశేషాలు | ... | | 46 |
| హాసలీల–ఆత్మకథ | ... | శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు | 47 |
| నిర్విరామమైన కృషిచేద్దాం | ... | శ్రీ బి. వి. సుబ్బారెడ్డి | 53 |
| "అభివృద్ధికి చిహ్నం" | ... | శ్రీ పి. వి. నరసింహారావు | 56 |
| పారిశ్రామిక విశేషాలు | ... | | 58 |
| రాష్ట్రాభ్యుదయం అంటే!! | ... | శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య | 59 |
| ప్రగతిపథంలో | ... | | 62 |
| ముఖ్యవార్తలు | ... | | 66 |
| సహకార పద్ధతిని సంపూర్ణ ధన సహాయ పథకం | ... | శ్రీ సయ్యద్ ఆబిద్‌హుస్సేన్ రజ్వీ | 67 |
| "గొప్ప ఉపాధ్యాయుడు" | ... | | 72 |
| ఉపాధ్యాయుడు: జాతినిర్మాత | ... | "స్క్రిప్టేటర్" | 74 |
| అభివృద్ధి పథకాలు | ... | | 76 |
| పార్లమెంటు సభ్యులకు రాష్ట్రావసరాలగురించి నివేదన | ... | | 83 |
| గ్రంథసమీక్ష | ... | | 86 |


ముఖచిత్రం:— మెదక్ జిల్లా, సంగారెడ్డిలోని మహిళా సంక్షేమ కేంద్రంలోని బాలలు.

వెనుకఅట్టమీది చిత్రం:— 1962 ఆగస్టు 2వ తేదీన హైద్రాబాదులోని రవీంద్రభారతిలో నిర్వహింపబడిన కూచిపూడి నృత్యంలో ఒక దృశ్యం.

# "భవిష్యత్తుకోసం పరిశ్రమిద్దాం"



ముఖ్యమంత్రి

## డాక్టర్ నీలం సంజీవరెడ్డి

ప్రసంగం

పదహారవ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి డాక్టర్ నీలం సంజీవరెడ్డి ఆగస్టు 15 వ తేదీ రాత్రి ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసంగిస్తూ ఇలా అన్నారు :—

"ఆగస్టు 15 వ తేదీ మనకు పర్వ దినం. ''మాకొద్దీ తెల్ల దొరతనమూ," అంటూ, వీరావేశంతో పాటలు పాడు కుంటూ, ప్రజలలో చెలరేగిన చైతన్య కాంతులే అండ దండలుగా, అరవై సంవత్సరాలు తీవ్ర సమరంచేసి, సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించుకున్న రోజు యిది. మన సర్వస్వం ఒడ్డి పని చేశాం. లోకపూజ్యుడైన గాంధీజీ చెప్పినట్లు నడుచుకున్నాం. మన రాజకీయ లక్ష్యమైన స్వరాజ్యం సాధించుకున్నాం. అట్టి గొప్ప రోజున ఉత్సవాలు చేసుకోవడం, ఊరేగింపులు, సభలు, సమావేశాలు జరుపుకోవడం, గతాన్ని స్మరించుకొని, భావి కర్తవ్య పథాన్ని నిర్ణయించుకోవడం సహజమే.

అయితే ఒక హెచ్చరిక. ఆనంద తన్మయత్వంలో మనల్ని మనం మరచిపోకూడదు. అంతా సాధించుకున్నామనే భ్రాంతిలో పడకూడదు. స్వాతంత్ర్యం వచ్చి నేటికి పదిహేనేండ్లు నిండింది. "ఏమిటి మనం సాధించింది. ఎంత వరకు దేశం ముందుకు పోయింది", అని ఒక్కసారి వెనుతిరిగి చూచుకోవలసిన అవసరం ఉంది. ఎందుకంటే 'ఏదో పూర్వకాలంలో మేం అట్లా చేశాం, ఇట్లా చేశాం, జైళ్లకు వెళ్లాం, లాఠీ దెబ్బలు తిన్నాం, ఎన్నో త్యాగాలు చేశాం' అంటూ చెప్పుకుంటే ఇప్పుడు సరిపోదు. ఆదశ ఎప్పుడో గడిచి పోయింది. స్వరాజ్య సాధన తర్వాత, అభ్యుదయ పథంలో దేశాన్ని నడపడానికి, నెహ్రూజీ వంటి జనప్రియుడైన నాయకుడు లభించడం, నిజంగా భారతీయుల అదృష్టం. ఆయన నాయకత్వాన, జాతీయ పునర్నిర్మాణ కార్యక్రమంలో ఎవరెన్ని ఘన కార్యాలు సాధించారన్నదే, నేటి ప్రశ్న. జాతీయ భావ ప్రేరణకూ, దేశభక్తికి నేడు అదే గీటు రాయి.

నినాదాల యుగం గడిచి పోయింది. ఇప్పుడు నిర్మాణ కార్య క్రమాల దశ నడుస్తున్నది. "ఇదుగో ఫలానా పల్లెటూరికి విద్యుద్దీపాలు అమర్చుకోగలిగాం. ఇక్కడ కొత్తగా రోడ్డు వేసుకున్నాం. ఆ నదిమీద ప్రాజెక్టు నిర్మించుకున్నాం. కొత్తగా యిన్ని వేల యెకరాలు సాగులోకి తెచ్చుకున్నాం," అని చెప్పుకోవలసిన సమయం ఇది. ప్రజాళికా బద్ధంగా దేశ పురోగతిని సత్వరం సాధించటానికీ, మన ఆశయమైన సోషలిస్టు సమాజ

స్థాపనకు మార్గాల్ని సుగమం చేసుకోవడానికీ, ఆబాల గోపాలం భారతీయులం నేడు కృషి చేస్తున్నాం. రెండు పంచవర్ష ప్రణాళికలు విజయవంతంగా అమలుపరుచుకున్నాం. దేశంలో ముఖ్యమైన భారీ పరిశ్రమలు అభివృద్ధి చేసుకోడానికి అవసరమైనట్టి గట్టి పునాదులు నిర్మించుకున్నాం. భిలాయ్, రూర్కెలా, దుర్గాపూరులలో ఉక్కు కర్మాగారాలు ఏర్పాటైనాయి. నూనె పరిశ్రమ విషయంలో గూడ చాలావరకు అభివృద్ధి సాధించాం. మన దేశంలోనే రైలింజన్లు, విమాన భాగాలు మొదలైన వివిధ యంత్రాలను తయారు చేసుకోడానికి రకరకాల పథకాలను అమలు పరచుకుంటున్నాము. అలాగే అనేక నదులమీద, దేశంలో వివిధ ప్రాంతాలలో పెద్ద పెద్ద ప్రాజెక్టులు నిర్మించుకుంటున్నాం. నాగార్జున సాగరు వంటి చాలా పెద్ద నిర్మాణాలను చేపట్టి మన రాష్ట్రంకూడా మన దేశ భాగ్యోన్నతికి దోహదం చేయబోతున్నది. కృష్ణా, గోదావరి జలాలను సాధ్యమైనంత వరకు వినియోగించుకుని, మన రాష్ట్రాన్ని సస్యశ్యామలం చేసుకునే రోజు ఎంతో దూరంలేదు. స్వరాజ్యం వచ్చినప్పటి నుండి నేటి దాకా, మనలను ఎదుర్కొంటున్న ఆహార సమస్యకు, మన రాష్ట్రమే యేనాటికైనా పూర్తి పరిష్కారం చూపగలుగుతుంది. మనం యింత తినడానికి, ఇతరులకు పెట్టడానికి, శక్తి సామర్థ్యాలు సాధించడంకంటే కావలసిన దేముంది ?. అంతకంటె సార్థక్యమేముంటుంది ?

ఆర్థికాభ్యుదయ రంగంలో, పట్టుదలతో కృషిచేసి, అనేక భౌతిక విజయాలు సాధించుకుంటున్న మాట నిజమే. ప్రణాళికల సహాయంతో పది మందికి మేలుజరిగే ఎన్నో పనులు చేసుకుంటున్నాం. కాని ఇంతటితో సరిపోదు. భారతీయ సంస్కృతీ నాగరికత మన రక్తనాళాలలో జీర్ణించి ఉన్నంతకాలం, మనం ఏ విషయమైనా నిశితంగా విమర్శించుకోకుండా, లోతుగా ఆలోచించుకోకుండా ఉండలేము. పైపై వ్యామోహాలకు ప్రలోభపడే తత్వం కాదు మనది. రోడ్లు వేసుకోవడం, చెరువులు త్రవ్వించుకోవడమే ప్రధానం కాదు. అసలు దీనికంతకూ మూలతత్వమేమిటి ? "స్వరాజ్యం వచ్చిందిగదా, దీని నిజమైన అర్థమేమిటి ? ఏ మార్గాలలో నడిస్తే, మనం చేసిన పోరాటం సాఫల్యము చెందుతుంది", అని మనం లోతుగా ఆలోచించాలి. భౌతికావసరాలు తీరడమేకాక, వ్యక్తిలో మానసిక వికాసం పరిపుల్లం కావాలి. అతనిలోని కార్యోత్సాహం, దీక్షాశక్తులు ప్రబుద్ధం కావాలి. అప్పుడే నిజమైన సమాజ వికాసం సాధ్యం. మనస్సు వికసించి, ఒక విశిష్ట వ్యక్తిత్వం సాధించుకున్నవాడు, సంఘాన్ని ఉద్ధరించగలుగుతాడు. గతకాలపు అనుభవాల దృష్టితో, ఇప్పుడు జాగ్రత్తగా కృషి చేసుకుంటూ, భవిష్యత్తుకు సరియైన రూపురేఖలు దిద్దుకో గలుగుతాడు. అందుకే మనం ఏ పథకం వేసినా, ఏ కార్యక్రమం అమలు పరచినా, వ్యక్తి స్వాతంత్ర్యం, వ్యక్తి వికాసం అనే మూల సిద్ధాంతాలను విస్మరించం. సమాజ వికాసోద్యమంలో జరుగుతున్న కృషి అంతా దీనిమీదే ఆధారపడి ఉంది. తాముచేసే పనివల్ల తమకూ, తమ సంతతికీ మేలు కలుగుతుందనే వికాసభావన ఉంటేనే ప్రజలు ఉత్సాహంతో ముందుకు వచ్చి పనిచేస్తారు. ఒక చిన్న ఉదాహరణ చూడండి. సమాజాభివృద్ధి కార్యక్రమాలలో శ్రమదానమనే ఒక మహోన్నతమైన సమైక్య భావన ఆవిర్భవించింది. చూడటానికి ఏ మంత విశేషం ఇది అనిపిస్తుంది. కాని దానితో ఒక పరిపక్వమైన సామూహిక కృషి చైతన్యము, సమాజ శ్రేయస్సు, జాతీయ సమైక్యత అనే అభ్యుదయ లక్ష్యాలు అల్లుకుని ఉన్నాయి. అటువంటి వికాస చైతన్యం ఉంటేనే, దేశంలో ప్రణాళికా కార్యక్రమాలు, నూటికి నూరుపాళ్లు విజయవంతమవుతాయి. అసలు దేశం మొత్తానికి ఒక ప్రణాళిక అనే విధానమే జాతీయ సమైక్యతకు దోహదకారి. వివిధ ప్రాంతాల అవసరాల కనుగుణంగా ప్రణాళిక రూపొందుతుంది. ప్రతి ప్రాంతం వారికి కొద్దో గొప్పో స్వార్థం ఉంటుంది. కాని యితర ప్రాంతాల శ్రేయస్సు దృష్ట్యా, దేశమంతటిలోను సక్రమంగా అభివృద్ధి సాధించుకోవలసిన ఆవశ్యకతదృష్ట్యా, కొంత త్యాగం చేయవలసిన అవసరం కూడా ఉంటుంది. ఈ త్యాగబుద్ధి జాతీయ సమైక్యతకు ఎంతో ఉపకరిస్తుంది.

జాతీయ సమైక్యతను గురించి ఇటీవల విరివిగా ప్రచారం జరుగుచున్నది. ఐక్యత ఎంత అవసరమో మనకు ప్రత్యేకంగా ఎవరూ చెప్పవలసిన పనిలేదు. భారతదేశ చరిత్రే చెప్తుంది. అనైక్యతవల్లనే గదా, దేశం భిన్నాభిన్నమై పరదేశముల హస్తగతమయింది. మళ్లీ పుంజుకుని స్వతంత్రులమైనా, మనలో మనకు ఇంకా ఉండే విభేదాలు దురూహలు, అనుమానాలవల్ల జాతీయ అభివృద్ధి నిశ్చయంగా కుంటుపడుతుంది. అందుకే మన నెహ్రూజీ రాధాకృష్ణ పండితులు జాతీయ సమైక్యతా భావం అలవరచుకోవాలని పదే పదే హెచ్చరికలు చేస్తున్నారు. మనది కులమత ప్రసక్తి లేని ప్రజాస్వామ్య రాజ్యం. కులభేదాలు, మతభేదాలు ఇప్పటికే జాతి జీవనాన్ని అనేక మార్లు కళంకితం చేశాయి. ఇంకా వీటి

(మిగతా 51 వ పేజీలో)

# పదండిరా

శ్రీ సోమసుందర్

పదండిరా ప్రణాళికల
జయంబు కూర్చగా..
రయమ్ముగా జనాశయాలు
రాణకెక్కగా! ...పదండిరా...

ఇదే జనత జీవనాడి
ఇదే అదను రా,
ఒకేమాట, ఒకేబాట
ఒకే పాట గా! ...పదండిరా...

జాతి మతము కులము గిలము
తలపబోకు రా-
ఒకే కులము ఒకే బలము
సఖామనదిరా! ...పదండిరా...

నవరసమయ కావ్యమతుల
నవ భారత యువక కులము
నడుం బిగించాలి మనము
కదం త్రొక్కగా! ...పదండిరా...

స్వార్థ పరత పిశాచమ్ము
నిర్ధనులను పీల్చెరా-
ధన రాక్షసి పేదల నిం
ధనము సేసెరా! ...పదండిరా...

పల్లె టూళ్ళ చీకటిళ్లు
మెరుగు దిద్దగా...
నాటు బండి నాగరికత
రూపు మార్చగా! ...పదండిరా...

ఇళ్లకు వాకిళ్లకు
కళ్లములకు శుభముల్...
తల్లుల కిల్లాళ్లకు
చెల్లెళ్లకు సుఖముల్! ...పదండిరా...

పంచుకునే రాచబాట
మంచి మనసు రా...
ప్రపంచమంత సం
తోషోత్సవమ్మగునురా! ...పదండిరా...

అన్నదమ్ము లాలుమగలు
అందరేకమై...
జనాశయాల కుప్పకూర్చి
నూర్చుకొండిరా! ...పదండిరా...

చెట్లు గట్లు నరకి ఇలా
తలము పెంచరా...
పోళ్లు బీళ్లు నరకి జలా
శయము కూర్చరా! ...పదండిరా...

ఇదే ఇదే కాంతి పథము,
సదాశయస్ఫురితనదము
ఎదలేకము కావలె, సం
పదకూర్పుటకై ! ...పదండిరా...

పదండిరా ప్రణాళికల
జయమ్ము కూర్చ గా!
రయమ్ముగా జనాశయాలు
రాణకెక్క గా! ...పదండిరా...

# వెలుగు బాటలు

"ఉదయభాను"

ప్రభుత్వ శాఖలన్నిటిలోనూ ప్రజా సంక్షేమం దృష్ట్యా వైద్య ఆరోగ్య శాఖలు ప్రధానమైనవి. దేశం సర్వతోముఖంగా అభివృద్ధి చెందటానికి ఆరోగ్యం అతి ముఖ్యం. ఆరోగ్యం అభివృద్ధి చెందటంతో మానవుని శారీరక, మానసిక శక్తులు వికసిస్తాయి. అప్పుడు అభివృద్ధి కార్యకలాపాలలో మరింతగా అతడు పాల్గొన గలుగుతాడు. అందువలన ప్రజారోగ్యమే దేశసౌభాగ్యం.

ప్రజా జీవనంలో ఇంతటి కీలక స్థానంలో ఉన్న ఆరోగ్యం పట్ల మనదేశం లోగడకంటె ఎంతో ఎక్కువ శ్రద్ధ తీసుకొంటున్నది. ఫలితంగా మరణ శాతం ఎంతగానో తగ్గిపోయింది. ఈ పరిస్థితులలో జనాభా మామూలు పద్ధతిలో పెరుగుతుంటే మరో క్లిష్ట సమస్య ఎదురవుతుంది అందుకే ప్రభుత్వ పరంగా కుటుంబ నియంత్రణ కార్యక్రమం అమలు జరుగుతున్నది.

అయితే కొన్ని ఇతర దేశాలతో పోల్చితే మన దేశంలో ఆరోగ్యం పట్ల తీసుకునే శ్రద్ధ అనల్పం. కొన్ని పశ్చిమ దేశాలు, జపాన్‌లలో ఆదాయంలో అత్యధిక శాతం ఆరోగ్యానికి ఖర్చు చేయడం జరుగుతున్నది. ఫలితంగా మశూచివంటి అనేక సంక్రామిక వ్యాధులు ఆదేశాలలో లేకుండా పోయినవి. ఈ వ్యాధులన్నీ సూక్ష్మక్రిముల వలన వస్తాయి గనుక అసలు దేశంలో ఆ క్రిములన్నీ నాశనంచేస్తే యిక ఆ వ్యాధులేరావు. ఆయా దేశాలలో డాక్టర్ల సంఖ్యకూడ అత్యధికం, మన దేశంలో అల్పం.

కాని యిటీవల పంచవర్ష ప్రణాళికల ద్వారా ఆరోగ్యాభివృద్ధి కార్యకలాపాలకు అధిక ప్రాధాన్యం యివ్వబడుతున్నది. ఆంధ్రప్రదేశ్ వైద్యరంగంలో దేశంలో అన్ని రాష్ట్రాల కంటె పురోగమిస్తున్నది. ఎనిమిది వైద్య కళాశాలలున్నవి. భారత దేశం మొత్తం ఆదాయంలో ఆరోగ్యానికి 6 శాతం ఖర్చుచేస్తుంటే ఆంధ్రప్రదేశ్ 9 శాతం ఖర్చుచేస్తున్నది. ఇందులో చికిత్సా విభాగానికి చేసే ఖర్చుకంటె నివారణ (ప్రివెంటివ్) కార్యక్రమానికి చేసే ఖర్చు అతి ప్రధానమైనది.

## వైద్యశాఖ

వైద్య శాఖకు 1956_57 సంవత్సరం ఖర్చు రు. 187.17 లక్షలే అయితే 1962_63 సంవత్సరానికి అది రు. 578.62 లక్షలకు హెచ్చించబడింది. గత సంవత్సరం (5.10 కోట్ల రూపాయలు) కంటె కూడ రు. 68 లక్షలకు పైగా హెచ్చించబడింది. ఈ డబ్బుతో వైద్య కళాశాలలు, ఆసుపత్రుల నిర్వహణ, విస్తరణ, పరిశోధనా కార్యక్రమాలు కొనసాగించబడుతున్నవి.

## వైద్యవిద్య

ఆంధ్రప్రదేశ్‌లో హైద్రాబాద్‌లో రెండు, విశాఖపట్నం, గుంటూరు, తిరుపతి, కర్నూలులలో ఒక్కొక్కటి, మొత్తం ఆరు ప్రభుత్వ వైద్య కళాశాలలు, కాకినాడ, వరంగల్‌లలో ప్రయివేటు వైద్య కళాశాలలు పనిచేస్తున్నవి. ఈ 8 వైద్య కళాశాలలలో మొత్తం ఏటా చేర్చుకొనే విద్యార్థుల సంఖ్య 845. తృతీయ ప్రణాళికా కాలంలో యీ కళాశాలలలో విద్యార్థుల సంఖ్యను వీలును బట్టి మరింతగా పెంచటం జరుగుతుంది.

విశాఖపట్నంలోని ఆంధ్ర వైద్య కళాశాల, హైద్రాబాద్ ఉస్మానియా వైద్య కళాశాల, కర్నూలులో ఆమధ్యనెలకొల్పబడిన వైద్యకళాశాల, గుంటూరు వైద్య కళాశాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులున్నవి. మద్రాసు, బొంబాయి, కలకత్తా మున్నగు చోట్ల స్థాపించే కేంద్రాలతోబాటు పోస్టు గ్రాడ్యుయేట్ వైద్య కేంద్రాన్ని భారత ప్రభుత్వ ఖర్చుతో హైద్రాబాద్‌లో నెలకొల్పాలని ఆరోగ్య పరిశీలన, ప్రణాళికా సంఘం సిఫార్సు చేసింది.

## నర్సింగ్ కళాశాల

బి. ఎస్. సి. డిగ్రీ యిచ్చే నర్సింగు కోర్సుకు 1959 లో ఒక కళాశాల హైద్రాబాద్‌లో నెలకొల్పబడింది. ఇందులో ఏటా 20 మంది విద్యార్థినులు చేర్చుకోబడుతారు. టి. సి. ఎం. నిపుణుల సహకారంతో యీ కళాశాల నిర్వహించబడుతున్నది. ఇలాంటి కళాశాలలు దేశంలో మరో రెండున్నవి.

## ఆసుపత్రులు

వైద్యసౌకర్యాల అవసరం అధికం కావడంతోబాటు జిల్లా కేంద్ర ఆసుపత్రులు, తాలూకా ఆసుపత్రుల్ని అభివృద్ధి పరిచే కార్యక్రమం అమలు జరుగుతున్నది. తాలూకా కేంద్రాలలో ఉన్న

43 లోకల్ ఫండ్ ఆసుపత్రుల్ని లోగడనే ప్రభుత్వం స్వాధీన పరచుకొన్నది. తాలూకా కేంద్రాలలో గాక యితరత్రా ఉన్న మరో ఐదు లోకల్ ఫండ్ ఆసుపత్రులు కూడా గత సంవత్సరం స్వాధీనపరచుకోబడినవి.

గ్రామ ప్రజలకు వైద్యసౌకర్యాన్ని కల్గించేందుకు గ్రామాలలో 237 సబ్సిడీ పద్ధతి గ్రామీణ వైద్యశాలలు నెలకొల్పబడినవి.

తృతీయ ప్రణాళికా కాలంలో వైద్య, ప్రజారోగ్య కార్యక్రమాలకు రూ. 19 కోట్లు కేటాయించబడినవి. ప్రణాళికా లక్ష్యాలలో ముఖ్యమైనవి; వసతి లభ్యమయిన జిల్లా కేంద్ర ఆసుపత్రులలో పడకల సంఖ్య 250 కి, తాలూకా ఆసుపత్రులలో 30కి పెంచడం, తిరుపతిలో వైద్యకళాశాల ఉపయోగార్థం కొత్తగా ఆసుపత్రిని స్థాపించడం, కాకినాడ, వరంగల్‌లలోని ప్రయివేటు వైద్య కళాశాలలకు గాను బోధన ఆసుపత్రులుగా అక్కడి జనరల్ ఆసుపత్రుల్ని పెంపొందించడం, విజయవాడలో కొత్త ఆసుపత్రిని నెలకొల్పడం. రాష్ట్రంలో బోధనా సౌకర్యాలున్న ఆసుపత్రులు 15 ఉన్నాయి.

జిల్లా కేంద్ర ఆసుపత్రులన్నింటిలోనూ, మరికొన్ని ముఖ్యమైన ఆసుపత్రులలోనూ శస్త్రచికిత్స, ప్రసూతి, పిల్లలవ్యాధులు, చెవి, ముక్కు, గొంతు వ్యాధులు, కంటి వ్యాధులు, దంతవ్యాధులు, చర్మవ్యాధులు, సుఖవ్యాధులు, స్త్రీల వ్యాధుల వంటి ప్రత్యేక వ్యాధుల చికిత్సకు నిపుణుల్ని నియమించడానికి సంకల్పించబడింది.

## ప్రాథమిక ఆరోగ్యకేంద్రాలు

పంచాయతీరాజ్ పథకం క్రింద ప్రతి పంచాయతీ సమితి బ్లాకులోనూ ఒక ప్రాథమిక ఆరోగ్యకేంద్రం ఉంటుంది. ద్వితీయ ప్రణాళికలో రాష్ట్రంలో 193 కేంద్రాలు నెలకొల్పబడినవి.

## ప్రత్యేక ఆసుపత్రులు

క్షయ, కుష్ఠు, కాన్సర్ లాటి సాంక్రమిక వ్యాధులకు ప్రత్యేక చికిత్సాలయాలున్నవి. క్షయ వ్యాధి పీడితులు రాష్ట్రంలో సుమారు లక్షమంది ఉన్నారు. ఈ వ్యాధి నివారణకు అన్ని జిల్లా కేంద్ర ఆసుపత్రులలోనూ, కొన్ని ముఖ్యమైన తాలూకా ఆసుపత్రుల లోనూ 25 క్షయ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడినవి. ఇవిగాక రోగుల్ని ఆసుపత్రులలోనే ఉంచి చికిత్స చేసేందుకు రెండు ప్రభుత్వ ఆసుపత్రులు, రెండు శానిటోరియంలు, ఆసుపత్రులలో క్షయ విభాగాలు ఉన్నాయి. తృతీయ ప్రణాళికా కాలంలో మరో 12 క్షయ చికిత్సా కేంద్రాలను ప్రారంభించడం జరుగుతుంది. దబీర్‌పూరలోని క్షయ కేంద్రాన్ని ఎర్రగడ్డలో కొత్తగా నిర్మించిన భవనాలలోనికి మార్చడం జరిగింది. రాష్ట్రంలోని క్షయ నివారణ కార్యక్రమానికి యీ సంస్థ ప్రధాన కార్యస్థానంగా ఉంటుంది. క్షయవ్యాధి పీడితులైన రోగుల పునరావాసానికి హైద్రాబాద్‌లో ఉద్దేశించబడిన భవన నిర్మాణం పూర్తయింది. ఇది త్వరలోనే నెలకొల్పబడుతుంది. విశాఖపట్నంలో జిల్లా క్షయ నివారణ శిక్షణ కేంద్రంకూడా నెలకొల్పబడుతుంది.

కుష్ఠువ్యాధికూడా ఆంధ్రప్రదేశ్‌లో ప్రబలంగా ఉంది. లెప్రసీ కంట్రోల్ ఆఫీసర్‌ను కూడ నియమించడం జరిగింది. తెలంగాణలో మహబూబ్‌నగరం, నిజామాబాద్, మెదక్, నల్లగొండజిల్లాలలో నాలుగు, ఆంధ్రప్రాంతంలోని రామచంద్రపురం, తిరుపతిలలో రెండు కుష్ఠువ్యాధి సహాయ కేంద్రాలున్నవి. ఇవి గాక యిటీవలగా రాష్ట్రంలో వివిధ ప్రదేశాలలో 9 కుష్ఠువ్యాధి కేంద్రాలు నెలకొల్పబడినవి. తృతీయ ప్రణాళిక కాలంలో 14 సహాయ కేంద్రాలు నెలకొల్పబడుతాయి.

సుఖవ్యాధి నివారణకు 13 చికిత్సా కేంద్రాలు ద్వితీయ ప్రణాళికా కాలంలో నెలకొల్పబడినవి. తృతీయ ప్రణాళికా కాలంలో 14 కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ కేంద్రాల తనిఖీకి ఒక కంట్రోలు ఆఫీసర్ నియమించబడినారు.

కాన్సర్ వ్యాధికి అధునాతన పద్ధతిలో చికిత్స చేసేందుకు హైద్రాబాదులోని కాన్సర్ ఆసుపత్రిలో కోబాల్ట్ థెరపీ యూనిట్‌ను—కెనడా అణుశక్తి సంస్థ సహాయంతో—నెలకొల్పడం జరిగింది. తృతీయ ప్రణాళికా కాలంలో యీ ఆసుపత్రిలోని 125 పడకల్ని రెట్టింపు చేయడానికి ఉద్దేశించబడింది. రేడియం సంస్థ కూడ నెలకొల్పబడి పనిచేస్తున్నది.

దంత చికిత్సా కేంద్రాలు 13 ద్వితీయ ప్రణాళికా కాలంలో వివిధ జిల్లా ఆసుపత్రులలో నెలకొల్పబడినవి. గతసంవత్సరం మరో నాలుగు కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. ఉస్మానియా జనరల్ ఆసుపత్రిలో ఒక దంత చికిత్సావిభాగం కూడ నెలకొల్పబడింది.

మానసిక వ్యాధుల చికిత్సకు హైద్రాబాద్, వాల్తేరులలోని ఆసుపత్రుల్ని అభివృద్ధి పరచడం జరిగింది.

కలరా, ప్లేగు, ఇన్‌ఫ్లూయంజావంటి వ్యాధుల చికిత్సకు హైద్రాబాద్, విశాఖపట్నం వంటి చోట్ల ప్రత్యేక ఆసుపత్రులు పని చేస్తున్నవి.

## శిక్షణ కార్యక్రమాలు

వైద్య సౌకర్యాల విస్తరణతోబాటు లెబొరేటరీ టెక్నీషియన్లు, లెబొరేటరీ అటెండెంట్లు, రేడియో గ్రాఫర్లు, ఆప్టీషియన్లు, రిఫ్రాక్షనిస్టులు, మెడికో-సోషల్‌వర్కర్లు, కాంపౌండర్లు, నర్సులు, సహాయక నర్సు-మంత్రసానులు, మెటర్నిటీ అసిస్టెంట్లు, దాయీల శిక్షణకు వివిధ కేంద్రాలలో శిక్షణ సౌకర్యాలు కల్పించబడినవి. ఇవిగాక భారత సేవా సంఘం అధ్వర్యంలో సాంఘిక సేవా పాఠశాలను విశాఖపట్నంలో నెలకొల్పి సంఘ సేవకులకు శిక్షణ గరపడానికి సంకల్పించబడింది.

## పరిశోధనలు

వైద్య శాఖలో పరిశోధనలు మరే యితర శాఖలో కంటె ప్రధానమైనవి. అనేక రకాల టీకాలమందు మొ॥వాటి విషయంలో రాష్ట్రాన్ని స్వయం సమృద్ధి చేసే ఆశయంతో హైద్రాబాద్‌లోని నారాయణ గూడలో ఉన్న ప్రజారోగ్యశాఖ లెబొరేటరీని ప్రివెంటివ్ మెడిసిన్ సంస్థగా మార్చడం జరిగింది. రు. 6 లక్షల ఖర్చుతో కొత్త భవనాలుకూడ నిర్మించబడతాయి. గుంటూరు, కర్నూలు, వరంగల్ పట్టణాలలో ప్రాంతీయ లెబొరేటరీలు నెలకొల్పబడ్డాయి. ఆయా జిల్లా కేంద్ర ఆసుపత్రులలో నెలకొల్పబడిన 9 జిల్లా లెబొరేటరీలకు అదనంగా మరో ప్రాంతీయ లెబొరేటరీని, ఆరు జిల్లా లెబొరేటరీలను తృతీయ ప్రణాళికా కాలంలో నెలకొల్పడానికి ఉద్దేశించబడింది.

విశాఖపట్నంలోని కె. జి. ఆసుపత్రిలో కెమికల్ రేడియో ఐసొటోప్ లెబొరేటరీని కూడా నెలకొల్పేందుకు ఉద్దేశించబడింది. ఈ ఆసుపత్రిలో ఒకటి, హైద్రాబాద్‌లోని ఉస్మానియా ఆసుపత్రిలో ఒకటి-మొత్తం రెండు-ఫార్మసీలను కూడ నెలకొల్పడానికి సంకల్పించబడింది. ఫార్మసీలో డిప్లొమా యిచ్చే ఒక నమూనా సంస్థకూడ విశాఖ పట్నంలో ఏర్పాటు చేయబడుతుంది.

## మందుల పెట్టెలు

గ్రామ ప్రజల ఉపయోగార్థం 2000 గ్రామీణ మందుల పెట్టెలు యీ సంవత్సరం సరఫరా చేయబడుతున్నవి.

## బ్లడ్ బ్యాంక్‌లు

రాష్ట్రంలోని పెద్ద ఆసుపత్రులలో విరివిగా బ్లడ్‌బ్యాంక్‌లు నెలకొల్పబడుతున్నాయి. అక్కడ ఆరోగ్యవంతుల రక్తంతీసి నిల్వచేసి రోగులకు అవసరమైనప్పుడు వినియోగిస్తారు.

కుటుంబ నియంత్రణ కేంద్రాలు కూడా వైద్యశాఖ క్రింద కొన్ని పనిచేసినా అవన్నీముఖ్యంగా ప్రజారోగ్యశాఖ పరిధిలోకి వస్తాయి. సాంక్రమిక వ్యాధుల నివారణ, ప్రసూతి శిశుసంక్షేమం, గ్రామీణ శానిటేషన్, కుటుంబ ఆరోగ్యకేంద్రాలవంటి అనేక ముఖ్యమైన కార్యక్రమాలు ప్రజారోగ్యశాఖచే నిర్వహించబడుతాయి. కొన్ని సందర్భాలలో రెండుశాఖల పనికీ వ్యత్యాసం కనిపించదు.

## దేశీయవైద్యం

పై కార్యక్రమాలన్నీ ఆధునిక వైద్యశాస్త్రం (అల్లోపతి)కి సంబంధించినవి. ఆయుర్వేదం, యునానీ, హోమియోపతి, ప్రకృతి వైద్యం లాటి దేశీయవైద్య విధానాల్ని కూడా ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది. ఆయుర్వేదాన్ని శాస్త్రీయ పద్ధతిలో అభివృద్ధి పరిచేందుకు హైద్రాబాదులో ఒక మూలికా నిలయం నెలకొల్పబడింది. ఆయుర్వేద, యునానీ ఆసుపత్రులలో పరిశోధనా సౌకర్యాలు కల్పించబడ్డాయి. హైద్రాబాదులో ఆయుర్వేద కళాశాల, యునానీ కళాశాల ప్రభుత్వ అధ్వర్యంలో నిర్వహించబడుతున్నవి. నగరంలోని ఇండియన్ మెడిసిన్ ఫార్మసీ అభివృద్ధికీ, ఆయుర్వేద కళాశాల, ఆసుపత్రికి కొత్త భవనాల నిర్మాణానికీ ప్రభుత్వం సంకల్పించింది. నగరంలోని యునానీ ఆసుపత్రి, గ్రంథాలయ సౌకర్యాల దృష్ట్యా యిక్కడొక యునానీ వైద్య పరిశోధనా కేంద్రాన్ని, పోస్టు గ్రాడ్యుయేట్ కళాశాలను ప్రారంభించవలసిందిగా భారతప్రభుత్వాన్ని రాష్ట్రప్రభుత్వం అభ్యర్థించింది.

ఆయుర్వేద, యునానీ, హోమియోపతి, ప్రకృతి వైద్యాలకు రాష్ట్రంలోని మరికొన్ని ప్రదేశాలలో కూడ డిస్పెన్సరీలు ఆశ్రమాలు ప్రభుత్వపరంగా గాని, ప్రభుత్వ సహాయంతోగాని నిర్వహించబడుతున్నవి. దేశీయ వైద్యానికి ఒక స్పెషల్ ఆఫీసరు ఉన్నారు.

## మంత్రి వివరణ

వైద్యశాఖ కార్యక్రమంలో అంత స్పష్టంగా లేకపోయినా కల్తీ మందుల సమస్య చాల తీవ్రమైనదని వైద్య, ప్రజారోగ్య శాఖల మంత్రి శ్రీ యార్లగడ్డ శివరామ ప్రసాద్ అంగీకరించారు.

ఆయన యిలా అన్నారు: "కల్తీమందులు ప్రజానీకానికి అత్యంత ప్రమాదకరమైనవి. ఎలాగైనా యీ వైపరీత్యాన్ని అదుపులో పెట్టాలి. పెద్దపెద్ద ఆసుపత్రులలో ప్రభుత్వమే మందుల షాపుల్ని నెలకొల్పడం వలన ప్రయోజనం ఉండవచ్చును. ఈ సూచనను పరిశీలించడం జరుగుతుంది."

వైద్య, ప్రజారోగ్య శాఖల్ని విలీనం చేయడంగాని, దేశీయ వైద్యాలకు ప్రత్యేకంగా డైరక్టరును నెలకొల్పడం గాని చాలా ఆలోచించి గాని నిర్ణయించలేమన్నారు. దేశీయ వైద్య శాఖకు నాన్‌టెక్నికల్ వ్యక్తి ప్రస్తుతం స్పెషల్ ఆఫీసరుగా ఉన్నారు. టెక్నికల్ మనిషిని డైరక్టరుగా వేసినప్పుడు అతడు ఆయుర్వేద వైద్యుడైతే యునానీ, హోమియోపతివారు వ్యతిరేకించవచ్చునన్నారు.

అయితే ప్రస్తుత ప్రభుత్వ ఆయుర్వేద విద్యార్థుల సమస్య శాశ్వతంగా పరిష్కరించ బడటం చాలా అవసరమని మంత్రి అన్నారు. శుద్ధ ఆయుర్వేద కోర్సు అని తెలిసి కళాశాలలో ప్రవేశించి, యిప్పుడు జి. సి. ఐ. ఎం. కావాలని విద్యార్థులు కోరడం వలన సమస్య తలెత్తినదన్నారు. అయినా శాశ్వతమైన పరిష్కార మార్గం కనుగొనబడుతుందనే ఆశాభావాన్ని శ్రీ శివరామ ప్రసాద్ వ్యక్తం చేశారు.



దేశమంటే మట్టికాదోయ్
దేశమంటే మనుషులోయ్
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్!

గురజాడ

# బాల గంగాధర తిలక్

శ్రీ అరవింద

ఆనాటి భారత రాజకీయ పరిస్థితులనదుపులోపెట్టి జాతీయోద్యమంలో ముందంజవేసి, కడదాకా పోరాటం జరిపి, గణుతికెక్కిన యోధులుగా, భగవదంశ సంభూతులుగా గణన నొందిన వారిలో తిలక్ ఒకరు. ఆయన జీవితం, గుణశీలాలు, కార్యదక్షత, భారతీయ జీవన్మరణ సమస్యలైన స్వదేశ, స్వరాజ్య, స్వాతంత్ర్య, స్వపరిపాలనపై ప్రసంగాలకన్న ప్రజానీకంతో పెన వేసుకున్న ఆయన వ్యక్తిత్వం ఆయనకే సాటి.

సాటిలేని కార్యదీక్షా దక్షతలు తిలక్ జీవితానికొక మెరుగు. అవే ప్రజానీకంలో ఆయనకు పలుకుబడిని చేకూర్చినవి. ధనం, సంఘంలో అత్యున్నతస్థానం, అధికారంలో ప్రాపు, ప్రభుత్వంలో పలుకుబడి, నిశిత వాగ్ధార-ఇవేవీ ఆయనకు రాజకీయ నాయకత్వపు పట్టం కట్టలేదు. హృదయపూర్వకంగా స్వీకరించిన కార్యాన్ని చిత్త సంకల్పంతో పూర్తి చేయటం అతని జీవిత లక్ష్యం. ఈ లక్ష్యం వినా ఇతర విషయాలాయనకు లెక్కలేదు. సర్వస్వం దేశం కోసం పరిత్యజించే భావం ఆయనకుగ్గులో పెట్టిన విద్య.

అనన్య సామాన్యమైన చాతుర్యంవల్ల జీవితంలో పలు రంగాలలో పలుకుబడిని, చరిత్రలో చెరుగని కీర్తికాంతను చేపట్టారు. న్యాయవాది కాకపోయినా, ఆయన న్యాయదృష్టి ఆయన లెక్కడి యుంటే బంగారు భవనాలని, ప్రాపంచిక సుఖాలని తెచ్చిపెట్టేది. సంస్కృత పండితుడు, మానవనైజాన్ని క్షుణ్ణంగా అవగాహన చేసుకున్న మనస్తత్వ శాస్త్రవేత్త, ప్రజాకర్షను పొందినరచయిత. ఆసియా ఖండాన పేరెన్నికైన పండితులతో తులతూగేవాడు. "ఓరియన్, ఆర్కిటిక్ హోమ్" అన్న ఆయన ఉద్గ్రంథాలు, ప్రాచ్య పరిశోధనలకే గీటురాళ్ళు. ఉపజ్ఞతో కూడుకున్న విమర్శ, వ్యాఖ్యాన గ్రంథంగాను ఆయన "గీత" మరాఠీకి వన్నెలు దిద్ది, పరమోన్నతమైన సత్యాన్ని అందించిన మహాదర్శనం. అతిసూక్ష్మగ్రాహియైన తన మేధను, ఆలోచనాశక్తిని, భావనా నైపుణిని, వాక్చాతుర్యాన్ని, రచనా కౌశలాన్ని ఆయన కావ్యరంగంలో ప్రవేశపెట్టియుంటే మహారాష్ట్ర సాహిత్య చరిత్రలో అగ్రస్థానాన్ని నిస్సందేహంగా అలంకరించియుండే వాడనడానికి ఈ గ్రంథమే నిరూపణ. ఆమార్గాన్ని అనుసరించటానికాయన మనసంగీకరించ లేదు. ఏ కార్యసాధనకై ఆయన అవతారమెత్తాడో ఆలక్ష్యం తప్ప ఇంకే కార్యానికియ్యకొనటానికి ఆయన అంగీకరింపలేదు. ఇంతటి బుద్ధిబలాన్ని పత్రికాలోకాని కంకితమొనర్చియుంటే రాజకీయ, ఆర్థిక, సాంఘిక విజ్ఞానాన్నందించి ఇతరుల కొరవడి అయ్యేవాడేమో। ఈ పాండితీ గరిమ నాయన వినోద క్రీడగా విని యోగించాడు. రాజకీయ నాయకుడుగా గాక, దేశభక్తుడుగా కీర్తి కాంత వరణ కవకాశం కలిగించిన ఈ గ్రంథాలను కటకటాల మధ్య జీవనయాత్ర సాగిస్తూ, లభించిన విరామాన్ని, శ్రమనెరుగని ఆ దేశభక్తుడు దేశానికి రూపొన సమర్పించాడంటే నిజంగా హర్షదాయకమే। ప్రతిభను పుణికిపుచ్చుకొనిన ఈ గ్రంథాలు, ప్రాచీన భారత సంస్కృతిని, తత్పునరుద్ధరణను, భవిష్యమున్నతిని ఆయన మనోభావంగా చిత్రించాయి. చరిత్రకందని యుగానికి సంబంధించిన విషయాన్ని, ప్రాచ్యభారతీయ సందేశాన్ని, జీవితపు విలువల్ని, మనోవాక్కాయకర్మల్ని, అర్వాచీనుల భావుకతకు తోడుగా, ఆధ్యాత్మిక చింతనని సూక్ష్మంగాను, శక్తివంతంగాను చిత్రించినదీగీతా రహస్యమే.

తిలక్ జీవితంలోని ప్రధాన సంఘటనలు, ఆయన రాష్ట్ర, దేశచరిత్రలలోను ప్రాముఖ్యం వహించాయి. విద్యా రంగంలో విప్లవం రేకెత్తించిన ఫలితమే "ఫెర్గొసన్" కళాశాల. మహారాష్ట్రుల మనోభావదర్పణమై, వారి అభిప్రాయాలకు వేదికయైన "కేసరి" మరోవైపు ఆయన నిస్వార్థోదార బుద్ధికి తార్కాణమైంది. విప్లవ వీరుడైన తిలక్ జీవితం మూడు తెగలుగ విభజింపవచ్చు. విప్లవాలవల్లే ఆయనకు బందీఖానా ప్రాప్తించేది. తొలిసారిగా స్వజాతి,

స్వదేశాభివృద్ధులకోసం క్రొంగ్రొత్త భావాలను, మార్గాలనన్వేషించడంలో శ్రీకృష్ణ జన్మస్థానం ఆయనకు ప్రాప్తమైంది.

సువిశాల ఆశయ సిద్ధికోసం ధృఢసంకల్పంతో కృషిసాగించటంతో రెండవసారి బందీ అయ్యాడాయన. శివాజీ జన్మదినోత్సవం, వినాయకచవితి యిత్యాది ఉత్సవాలవల్ల రాజకీయంగానే కాక, ఆధ్యాత్మికంగా ప్రాచీన, అర్వాచీన భావాలకు లంకెవేసి విప్లవశంఖం పూరించారు. సాంఘిక సంస్కర్త "అగార్కర్"తో తెగతెంపుల తరువాత ఆయన ప్రాచీన మత సాంప్రదాయ బద్ధ ప్రజాస్వామ్య నినాదం ఆరంభించాడు. రాజకీయ నాయకుల దృష్టి ప్రాచీన, మత సాంఘిక సంప్రదాయాలకు కాణాచియైన పండుగలకు ముడిపెట్టేవాడు. చాలాకాలంనుండి కాంగ్రేసు ఉద్యమం పాశ్చాత్య దృక్పథం, భావాలతో, పాశ్చాత్య చరిత్ర, ఆశయాలు, రాజకీయపుటెత్తుగడలలో పాశ్చాత్య విద్యాభ్యాసులైన కొలది మందికే సన్నిహితంగా వుండేది. ప్రాచ్య సంస్కృతి పూర్వపు టౌన్నత్యంగాని, జాతీయ జీవనంకాని, ప్రతిబింబించే పోకడలా ఉద్యమంలో కనుపింపవాయె. తిలక్ మహాశయుడీ సాంప్రదాయాలను ఖండించి, పూర్వాపరాలకు సేతువై నిలిచి, జాతికి రాజకీయ జీవితంతో సంబంధం తెగకుండా చేశాడు. భావంలోనూ. భాషలోనూ. పద్ధతులలోనూ భారతీయతను జొప్పించినాడు. ఈయన నడిచిన మార్గంలోనే కట్టుదిట్టాలైన ఉద్యమాలు మహారాష్ట్రంలో పలుమార్లు తలెత్త సాగాయి. ప్రజాభిమానాన్ని చూరగొనే విధంగా వారి అవసరాలకాకృతిగా ఉద్యమాలను రచించటంలో ఆయన ఉపజ్ఞ, రాజకీయ చతురత గోచరిస్తుంది. క్రొంగ్రొత్త మార్గాన్ననుసరించి, పునర్నిర్మాణ కార్యక్రమం చేపట్ట వలసిన తరుణంలో తానే నియంతయైనాడు. మహారాష్ట్రంలో తిలక్ మార్గం భారతావనిలో స్వదేశీ ఉద్యమ సందర్భంలో భారీ ఎత్తున ప్రదర్శింపబడింది. రాజకీయంగా నిద్రాముద్రితులైన జనులకు జాగృతి కల్పించి ప్రజాహిత కార్యక్రమాలని చేపట్టటం, భావిభారత భాగ్యోదయం పూర్వపుటౌన్నత్యముపై పడిందని గ్రహించి, రాజకీయాలకు, మత సంప్రదాయాలకు పొత్తుకలిపి తిలక్ చరితార్థుడైనాడు. రచయితలు, ఆధ్యాత్మిక చింతనపరులీ పరమ సత్యాన్ని కాదనలేరు. కాని రాజకీయ రంగములో వాటికి ఆవిష్కరణ జరిపింది తిలక్. రెండవ మారు జరిపిన ఈ ప్రయత్నమే కఠినతర కారాగారవాస ప్రాప్తికి కారణమైంది. లక్ష్యం కోసం, పోరాడటంకన్న పరమాత్మునికి ప్రీతి పాత్రమయ్యేదేది ఈ లోకంలో?

మూడవ దశలో స్వదేశీ ఉద్యమం ఆయనకు దేశనాయకత్వం కట్టబెట్టింది. మహారాష్ట్రంలోనే గాక, దేశమంతటా పరివ్యాప్తమయిన రంగాన్ని చేపట్టి. నూతనోత్సాహంతో జీవిత లక్ష్యాన్ని ఒక కొలిక్కి తేవటానికి తిలక్‌కు అవకాశం లభించింది. ఆనాటి సంఘటనలు మధురస్మృతులు, విదేశీవస్తు బహిష్కరణం మొదటి సూరత్ సంఘటన, కారాగారవాసం వెంటవెంట తిలక్ భారత చరిత్రలో "ధృవతార"గా వాసికెక్కటానికి తోడ్పడ్డాయి. కష్టాల్ని సహనంతో ఎదుర్కొనే నైజం, నైతిక శక్తికి ఈ కారాగార ప్రాప్తి అగ్నిపరీక్ష. ప్రజలకు తగ్గనాయకుడని తొలి కారాగార వాసంలోనే తేటతెల్లమైంది. మహారాష్ట్రుల భావాలను పెల్లుబికించి దేశంపైని అధికారం వ్యక్తంచేసి, దక్షిణాపథపు మకుటంలేని మహారాజవటానికి రెండవ సంఘటన ఉపకరించింది. భారతావనిలో సర్వపక్ష ప్రతినిధియై, జాతీయ భావాన్ని రగుల్కొల్పటానికి కడపటిది చేయూతనిచ్చింది. భారతదేశం పూజిస్తున్న ఇద్దరు, ముగ్గురు మహనీయులలో ఈయన ఒక్కడని నిరూపణ అయింది. దేశ స్వాతంత్ర్య సంగ్రామంలో జీవితసంధ్య నందుకున్న ఘట్టం తరువాయి. ఆశారేఖ లల్లంతదూరాన అగుపిస్తూ, త్వరలో సాఫల్యం కానున్న కాంక్షదృష్టి గోచరమవుతున్న కాలమది. ఒకప్పుడిది శతాబ్దాల నిర్విరామకృషి, నిరంతర పోరాటం, అతిక్రమల అనంతరమే సుఖాంతమవుతుందని తలపోసేవాళ్ళం కదా!

తన జన్మభూమియయిన భారతావని కాయన ఏకైక ప్రతినిధి. భిన్నత్వంలో ఏకత్వంగల దేశం భారతావని మాత్రమే. దాని మనుగడలు ఆ భిన్నత్వంలోనే గోచర మవుతాయి. జాతీయ జీవనమంతా ప్రాంతీయ జీవనంపైనే ఆధారపడింది. పలురంగాల వలే రాజకీయాల్లోను నాయకుడు తన జీవితలక్ష్యాన్ని ముమ్మందుగా తను నివసించే ప్రాంతంలో విడమర్చి, వివరించి పలుకుబడిని సంపాదించుకోవాలి. ఈ విషయంలో తిలక్ కంటే చతురుడు మరొకడు లేడు. మహారాష్ట్ర ప్రతిబింబం. మహారాష్ట్రుల నైజగుణం, వారి ఆచార వ్యవహారాల కాయన రూపకల్పన. వజ్ర సంకల్పంతో, మేధతో ఆయన ప్రజాప్రతినిధి కాగలిగాడు. మహారాష్ట్ర జాతి స్వభావశీలాలా దేశప్రకృతికి, చరిత్రకు నిలయమయ్యాయి. ప్రజలు దృఢకాయులు. మోటు జీవనమున కలవాటు పడ్డవారు. అణువణువునా ప్రజాస్వామ్యంవారి రక్తంలో చిందుతుంది. ప్రతికార్యాన్ని బహుదీక్షతో సాగించే తత్వం వారి మతం. ప్రజాస్వామ్య సూత్రాలు వారి భావంలోను. కార్యక్రమంలోను, మత సాంప్రదాయాలలోను, జీవితలక్ష్యంలోను గోచరమవుతాయి. భారతీయులందరివలె హృదయ పూర్వకంగా

లక్ష్య సాధనకు ప్రయత్నించటం వారి అభిమతం. ఉద్రేక మనస్కులై ఊహాలోకంలో విహరించటం వారి స్వభావానికి సరిపడని సంగతి. సామాన్య జీవితం గడుపుతూ, ధైర్య సాహసాలతో లక్ష్యానికడ్డువచ్చే ఆటంకాలని త్రోసిరాజని, జన్మతః రాజకీయ చతురులని వారు నిరూపిస్తారు. తిలక్ మహాశయుడు వీటికి రూపు కల్పన: వీటికితోడు ఆయన ఏకాగ్రత, దృఢసంకల్పం, ప్రజాకర్షణకు కిటుకేమో. తళతళలాడుతూ, శత్రువుల కుత్తుకల నాహరంగా కోరుతున్న కరవాలాన్నొరనుండి లాగితే వీరుల కెంత ఆనందమో, భారతీయులకు తిలక్ నామస్మరణ అందఉత్తేజం: తమ భావాలను క్షుణ్ణంగా జీర్ణించుకున్న మహనీయుడు తమకు ప్రతినిధి యవటం తమ అదృష్టమని వారనుకున్నారు. మారిన పరిస్థితుల కనుగుణంగా, క్రొంగ్రొత్త రూపాన కనుపించి, తమ పక్షాన పోరాటం జరుపటానికవతరించిన అవతార పురుషుడని భారతీయులు ఆయనకు భక్తి భరితమైన నివాళులు అర్పించుకుంటారు. మహారాష్ట్ర లక్షణాలని మరొకసారి ఒక మహాత్మునిలో దాగినట్టువారు గుర్తించారు. భారత చరిత్రలో ఆయనకు ఆయన రాష్ట్రంలోగల గౌరవంతో సరితూగగల గౌరవం మరెవ్వరికి మరే రాష్ట్రంలో లేకపోయింది.

దేశకాల పాత్రాభిమతంగా ఆయన అనన్య సామాన్య గుణాలను పుణికి పుచ్చుకున్నాడు. ప్రజాభిమానం చూరగొనటానికి సులభంగా లొంగినట్టు నటించి. కల్లి బొల్లి మాటలాడే స్వభావం ఆయనసొత్తుకాదు. ప్రతిపని, కూలంకషంగా ఆలోచించి ఆచరించే తత్వం ఆయనది. ఉపన్యాసాలన్ని ఇట్టి ఉపదేశ సుభాషితాలతోనే నిండుకొనేవి. ఉద్రేకంతో కరతాళధ్వనులు చేసే ప్రజలను కాని, వందిమాగధస్తుతులను మరిపించే అనుచరుల స్తోత్రపాఠాలను గాని, ప్రజోత్సాహపు వెల్లువనుకాని ఆయన లక్ష్యపెట్టేవాడు. ఒక మేరదాకా అవి ప్రజాభిమానానికి మానదండాలని సహించినా, ప్రజోత్సాహం నిర్మాణాత్మకంగా ఉపకరించకుండా భ్రష్ట మార్గాలను త్రొక్కిందని వాపోయేవాడు. ప్రజాఉత్సాహాని కూపిరిపోసి, ముందుకు నడపటమే కాక కొన్ని సమయాల్లో వారి అడుగుజాడల్లో సాగిపోయేవాడు. నాయకుడంటే ఆయన నిర్వచనం, ఇతరులను నడుపుతూ, అవసరసమయాల్లో వారి ననుసరించటమని. అనుచరులతో సన్నిహితత్వం. మొగమాటము నెరుగని ఉపదేశముల నివ్వగలగటం ఆయన ప్రత్యేకత. మితభాషి అయినప్పటికి, అవసర సమయాల్లో ఇతరుల సలహాలను పాటించటం ఆయన విశిష్టత. ప్రజానాయకుని కవసరమైన అనుచరులతో సాన్నిహిత్యం, నిష్కాపట్యం, పరులనర్థం చేసుకోవటం వంటి గుణాలు కాయనఖని. అందువలననే, విద్యావంతులకు, విద్యావిహీనులకు, వర్తకులకు, గ్రామీణులకు, ధనికచక్రవర్తులకు. దరిద్ర దామోదరుల కాయన ఏకైక ప్రతినిధి. ఆయన వ్రాసిన ప్రతి ముక్క మాట్లాడిన ప్రతిమాట, మహారాష్ట్రుల కర్థమయ్యేవి. ఆయన సాగించిన ప్రతి పోరాటానికి మహారాష్ట్రుల అండదండలు లభించేవి. స్వదేశీ ఉద్యమ కాలంలో ప్రజా నాయకునికి తప్పనిసరియైన సుగుణాలు, హోదా ఆయనలో మూర్తీభవించాయి.

తిలక్‌ను విప్లవకారుడనటం పొరపాటు. ఉద్రేక పూరితులై ఊహాపథంలో విహరించే రంగములకు తప్ప, తదితరులైన భారతీయులకు విప్లవాత్మక భావాలు తక్కువే. ప్రపంచంలోని ప్రజలకు వలే విప్లవ బీజాలు వీరిలో నాటడం సులభమే. అత్యున్నత ఆశయాలు, మహోన్నత భావాలుకల సుకుమారులలో విప్లవ బీజాంకురం జరపటం తేలిక. కాని వారు మత సాంప్రదాయాలలో మార్పులను సామాన్యంగా కోరరు. కార్యాచరణలో వారిది మందకొడి స్వభావం. తిలక్ సంకల్పసిద్ధికి, భారతీయ మనస్తత్వం తోడ్పడటంవలన అభ్యుదయభావాలను కూలంకషంగా పరీక్షించి, సాంప్రదాయ దోహదమైన మార్పులకు తలవొగ్గటం తటస్థించేది. స్వతంత్ర భారతావనిలో జాత్యాభివృద్ధి, ఔన్నత్యాల నాకాంక్షించే ఉదారచరితుడైన రాజకీయ నాయకుడుగానే కాక, ఆరంభించే కార్యక్రమాన్ని సఫలీకృత మొనర్చుకొనటానికుపక్రమించే ముందు సాంప్రదాయ బద్ధమొనరించేవాడుగాను ఆయన కీర్తి నార్జించాడు. ప్రజాభిప్రాయాలలోని భేదాభిప్రాయాలను పరిష్కరించే పరిష్కర్తగాను. జన్మతః రాజకీయ చతురుడుగాను ఆయన పేరు ప్రతిష్ఠలను సంపాదించుకున్నాడు. కాంగ్రేసు ప్రజాభిప్రాయానికి సాధనమని, దానికో రూపకల్పన చేసినాడు. సూరత్ కాంగ్రేసు సమావేశంలో దేశానికి రానున్న ఉపద్రవం గురించి ఈయనవలే వాపోయినవారు లేరు. అందువల్లే ఈయన కాంగ్రేసు నుండి యదేచ్ఛగా వైదొలగుతున్నాడని ప్రతిపక్షాలు కొన్ని సత్యదూరమైన ప్రచారాలొనరించాయి. జాతీయ భావాలు నచ్చినా, ఆచరణ సాధ్యంకాని సూచనలాయన సమ్మతిని పొందలేకపోయాయి. అందువలననే సంస్థ కార్యాచరణ కుపక్రమించాలని ఆయన హెచ్చరించారు. దినదిన ప్రవర్ధమానమౌతు, ఉపయోగకారియైన ఒక సంస్థను సమూలంగా నాశనమొనర్చటం ఆయన

ఉదాత్తాశయాలకు వ్యతిరేకం. ఆశయపు ఇటుకలతో ఊహాసౌధాలు నిర్మించటం ఆయనకు నచ్చదు. లక్ష్యాన్ని నిర్ణయించుకొని, కార్యారంగంలోదూకి, అటంకాలని నేర్పుతో త్రోసి రాజని, శీఘ్రగతిని గమ్యస్థానంవైపు పురోగమించడం ఆయన ఆశయమైనా, లక్ష్యసాధనకు రాజీమార్గానికి ఆయత్తపడేవాడయన. ఆచరణయోగ్యం కాని కార్యాలను భుజస్కందాలపై వేసుకొని అందని పళ్ళకర్లులు చాచే తన అనుచరవర్గాన్ని సహితం మందలించేవాడాయన. నిబంధనలనవసరమైతే, సడలించుకొన్నా ఆయన అసమంజసంగా భావించేవాడుకాదు. ప్రవర్ధమానమౌతున్న సంస్థలను సమూలంగా నాశనమయ్యే విప్లవకారుని మనస్తత్వాన్ని చాటే విపరీత కార్యాల నొనర్చటం ఆయన కఠినమైన పాత్రంకాదు.

తిలక్ ఈ దృక్పథం ఆయన సంఘ సంస్కరణాభిలాషకు మచ్చుతునుక. మహారాష్ట్రులు సంఘంలో మార్పులు కోరని హేతువాదులుకారు. లేదా పూర్వ సంప్రదాయాలను విగ్రహారాధనను ప్రోత్సహించే తెగకు చెందినవారు కారు. సామాన్యంగా, ఈ మనస్తత్వాలు ఒకదానికొకటి ప్రతిరూపాలని భావన, సాంఘిక ప్రయోజనం కల సంస్థలు వారి కఠినమానపాత్రములు. పరిస్థితుల ప్రోద్బలంవల్ల మార్పులు కోరటమో. ఉన్నదానితో తృప్తిచెందటమో నిర్ణయించుకుంటారు వారు. తిలక్ ఈ దృక్పథానికి వ్యతిరేకి కాదు. రాజకీయోద్యమాలు సామాన్య ప్రజలనుండి వేరు పడజాలవని గుర్తించి. అనుభవశూన్యమైన సంస్థలవల్ల రాజకీయ సంస్కరణలు జరుగవని తన రాజకీయ పరిజ్ఞానంతో గ్రహించాడు. ఆ రాజకీయనాయకుని దృష్టిలో దేశంలో ప్రజాభిమానం చూరగొనే ప్రజాప్రతినిధిసభ లక్ష్యసాధనకవసరం. భారతదేశ ప్రజలకు దాస్యవిమోచనం అత్యవసరమని, రాజకీయాలతో ముడివేయబడ్డ సంస్కరణలు పేర్కొంటున్నంత అవసరం కాదని ఆయనభావం. ఆయన జీవిత పరమావధి అదే అయినందువల్ల జాతి లక్ష్యం అదే కావాలని ఆయన పట్టుదల, స్వాతంత్ర్య సంపాదనద్వారా మొదట ప్రజల నడుమలో పెట్టి తరువాత సాంఘిక సంస్కరణల గురించి ఆలోచిద్దామని ఆయన అనేవాడు. ప్రజానీకాన్ని, ప్రశాంతంగా ముందుకు నడిపిద్దామని ఆయన అనేవాడు. ఈ దృక్పథంలోని మంచి, చెడులతో ఆయనకు నిమిత్తంలేదు. తిలక్ స్వభావం, దేశకాల పరిస్థితులాయన్నీ కార్యానికి ప్రేరేపించాయి.

దేశ పరివ్యాప్తమై, నిర్మాణాత్మకమైన రాజకీయ భావాలకు తిలక్ మేధాసంపద, సంకల్పసిద్ధి రూపకల్పన చేస్తున్నాయి. పలువురు నాయకులవలె ఆయన వాఙ్మికాడు, కాని ఆయన భావగాంభీర్యం, వ్యక్తిత్వం ఆయనకు పేరుమోసిన వక్తగా కీర్తి తెచ్చిపెట్టాయి, అంగ్లంలో కన్న మహారాష్ట్రంలో ఆయన వక్తగా విశేష ఖ్యాతి నార్జించాడు. తలపెట్టిన కార్యంగురించి, హృదయపూర్వకంగా. దాపరికమెరుగక, సూటిగా, సూక్ష్మంగా హృదయానికి హత్తుకొనే రీతిగా వివరించేవాడు. ఉభయభాషల్లోను ఆయనకు సమానమైన ప్రజ్ఞ ఉండేది. ఆయన కాలపు సంఘాన్ని మనసులో వుంచుకొనే జీవిత లక్ష్యాన్ని గుణశీలాలనర్ధంచేసుకోవాలి. అందువల్లే ఈ విషయాలన్నీ మీరెరిగినప్పటికీ, సాకల్యంగా వివరించాను. ఈ పునరుక్తివల్ల దాని ప్రాధాన్యత మీకును బోధక మవుతుంది.

సంఘ శ్రేయస్సు దృష్ట్యా, ఆయన స్వభావంలోని ఒకటి రెండు విషయాలను మనవిచేస్తాను. ఆదేశభక్తుని అకుంఠిత దీక్ష, ఆ మహామహుని హృదయపూర్వక సేవానిరతి, ఆయన శీలానికే వన్నెతెచ్చేవి. ఈసుగుణాలే ఆయనలో లేకపోతే రాజకీయంగా నిద్రాణమైన ఈ దేశంలో విప్లవ జాగృతి కల్గేది కాదేమో. అపుడాశయాలు, ఉద్రేకం, ఉత్సాహం అడియాసలే, అడవిగాచిన వెన్నెలే, ఆశయానికి, ఆచరణకి ఆమెడ. ఆశయం దుర్బలమై పోరోత్సాహులైన మనల్నొక్కొక్కతరి లక్ష్యంనుండి వేరు పరుస్తుంది, తమదిత్యాగనిరతి అని, తాము కష్టాలను సహనంతో అధిగమిస్తామనే బడాయికోయలకది చెంపపెట్టు. నిజానికి, భారతావనిలో దేశంకోసం అధికంగా శ్రమించినవారు అరుదు. త్యాగధనులై కష్టాలను సహనంలో ఎదుర్కొన్నవారు పూజ్యం.

తిలక్ జీవిత లక్ష్యాల్లో మొదటిది చాలా భాగం ముగిసింది, రెండు సంఘటనలు మన కార్యసాఫల్యానికి కుపకరించాయి. వాటి నాయన పూర్తిగా వినియోగించుకున్నాడు. ఆరు శతాబ్దాల కార్య క్రమాన్ని స్వదేశీ ఉద్యమం ఆరు సంవత్సరాలలో సాధించింది. అసమాన ప్రజ్ఞతోను, శ్రమనెరుగని భక్తితోను. పెల్లుబికే ఉత్సాహంతోను, ప్రజాకర్షణ శక్తితోను, ఆధ్యాత్మిక చింతనతోను, ఆశయాలను ఆచరణలు పరివర్తింప చేయాలనే తలంపుతోను, సుడిగాలిలా ప్రవేశించిన అనిబిసెంటుసతి ఆయనకు తోడ్పడిన మరొక సంఘటన, ఇట్టి ఉద్యోగానికి తమ బుద్ధిబలాన్ని అంకితమొనర్చిన మూర్తిత్రయము-తిలక్, బిసెంటు, గాంధీజీలే ఈ దిగ్విజయానికి పూచీకర్తలు, తిలక్ ఉద్దేశాన్ని దేశం రాజకీయ లక్ష్యంగా గ్రహించింది. తోడ్పడటం తమ ఆశయమని భావించి సఫలీకృత మవటానికి దోహదమిచ్చింది. భారతప్రభుత్వం, బ్రిటిషువారు కూడా ప్రజాపాలనకంగీకరించారు. భవిష్యత్తును నడిపింపగల అధికారపక్షం ఆ లక్ష్యసాధనకవసరమని తీర్మానిం

చింది. ప్రస్తుతం అల్పతృప్తులైన కొందరు బ్రిటిషు పరిపాలనలో తృప్తి చెందినా, భారతావని యందలి వివిధ రాష్ట్రాలు, జాతులు యుక్తకంఠంతో తిలక్ అనుసరించిన మార్గం తమకు సమ్మతమని చాటుతున్నాయి. అతి ప్రయాసతో తిలక్ తీర్చిదిద్దిన సిద్ధాంతాలీనాడు రాజకీయాల్లో సర్వసామాన్యమయ్యాయి. అనివార్యమైన ఈ పరిణామం ఇంకా చురుకుగా సాగవలసిందేననా అన్న ప్రశ్న మన దృష్టి నాకర్షించవలసి వుంది. తిలక్ భారతావనికి నాయకుడైనాడంటే ఈ విశ్వాసంతోనే అని మనం వ్యాఖ్యానించుకోవాలి. ఆ కార్యం పూర్తి అయితేనే తప్ప ఆయన జీవిత లక్ష్యం నెరవేరదు. ఆ లక్ష్య సాధన జరిగితేనే తప్ప ఆయన జీవితంలో కునుకు నెలుగడు. వార్ధక్యం ఆయనను పీడిస్తున్నా, ఆయన ఆత్మ నిరంతరం నవయవ్వనంతో, వినూత్నచైతన్యంతో శోభిస్తుంది. జాతీయజీవనంలో తొలి అధ్యాయం ముగిసిన తరువాత, పునర్నిర్మాణమౌతున్న భారతావని, మానవసేవ కైంకర్యం చేయబోమే ఈ తరుణంలో తిలక్‌ను సంస్మరించుకుందాం. ఆయనపేరు చరిత్రలో నవభారత నిర్మాతగా, ప్రఖ్యాత రాజకీయనాయకుల్లో ఒకరుగా, అత్యంత క్లిష్టపరిస్థితుల్లో సారధ్యం నెఱపినవాడుగా చిరస్మరణీయమైంది. ఆయనపేరు భారత పూర్వపుటౌన్నత్యం తలపోసుకొని గర్వించేయంతకాలం, భవిష్యత్తులో మహత్తరకార్యాలని చేపట్టగలమన్న ధైర్యమున్నంతకాలం ఆ చంద్ర తారార్కమవుతుంది.

—తెలుగు: శ్రీ బి. యస్. రాఘవ.

# విశేషాలు

## హైదరాబాద్‌లో సమైక్యత

భారత రాష్ట్రపతి డాక్టర్ యస్. రాధాకృష్ణన్ ఆగస్టు ఒకటో తేదీన హైదరాబాద్‌లో పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ తను హైదరాబాద్‌లోవున్న 25 రోజులు ఎంతో సంతోషంగా, హాయిగా గడిపానని అన్నారు. హైదరాబాద్ నగరంలో "సమైక్యత" అనేది తనంతట తానే వర్ధిల్లుతున్నదని ఆయన తమ సంతోషం వ్యక్తం చేశారు.

ఒకచోట నివసిస్తున్న నాలుగు భాషలు మాట్లాడే ప్రజలను తాను చూడగలిగానని, తను హైదరాబాద్ రేడియో కేంద్రానికి ట్యూన్ చేసినప్పుడల్లా ముఖ్యమైన భారతీయ భాషలన్నీ వినవస్తుంటాయని రాష్ట్రపతి అభిభాషించారు. ఆంధ్రప్రదేశ్‌లోని పత్రికల పట్ల ఆయన తమ సంతృప్తిని వెల్లడించారు. మొత్తం మీద అతి ఉన్నత ప్రమాణాలను నెలకొల్పుతూ, ఉన్నతమైన కృషిని చేస్తున్నాయని అన్నారు.

## రాష్ట్ర స్కౌట్ దళ సభ్యులకు ఉత్తమ బహుమతి

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన 12 మంది స్కౌట్ దళంలోని వారికి స్కౌట్‌లో ఉన్నత యోగ్యతమైన "హిమాలయా వుడ్ బేడ్జి పార్చ్‌మెంట్స్"ను స్కౌట్ జాతీయ కేంద్ర కార్యాలయం బహూకరించింది. ఈ పతకం పొందిన అభ్యర్థులు: శ్రీయుతులు యస్. జె. విలియమ్, ఎ. హనుమంతరావు, జి. వి. రామారావు, టి. యస్. యన్. శర్మ, టి. రంగారావు, నాగన్న, యస్. వి. నరసింహరాజు, ఆర్. కె. వరదరాజన్, యస్. ఆనందం, కె. హనుమంతరావు, జి. విశ్వనాథం, బి. ఇ. యన్. స్వామి.

## జపాన్‌కు ఆంధ్రప్రదేశ్‌లోని మొక్కల ఎగుమతి

ఆంధ్రప్రదేశ్‌లో కడపజిల్లాలో మాత్రమే అభ్యమయ్యే రక్తచందనం మొక్కలను జపాన్‌కు ఎగుమతి చేయనున్నారు. **

# కమ్యూనిటీ రేడియో సెట్లు

1962 జూన్ నెలలో కమ్యూనిటీ రేడియో సెట్లు నెలకొల్పబడిన గ్రామాలు, సంస్థల పట్టిక

| వరుస క్రమం | జిల్లా పేరు | తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టును నెలకొల్పిన తేదీ. |
|---|---|---|---|---|
| 1. | హైదరాబాదు | ఇబ్రాహింపటం | కులుబులాపూర్ | 4_6_1962 |
| 2. | ,, | వికారాబాదు | మేకవనంపల్లి | 8_6_1962 |
| 3. | ,, | ,, | మొరంగపల్లి | 9_6_1962 |
| 4. | ,, | ,, | మోమిన్‌పేట సమాచార కేంద్రం | 9_6_1962 |
| 5. | , | ,, | కొత్తపల్లి | 10_6_1962 |
| 6. | ,, | ,, | యన్నారం | 10_6_1962 |
| 7. | ,, | ,, | నల్బతాపూర్ | 10_6_1962 |
| 8. | ,, | ,, | రోంపల్లి | 10_6_1962 |
| 9. | ,, | ,, | పంచలింగాల్ | 11_6_1962 |
| 10. | ,, | ,, | తుమ్మలపల్లి | 11_6_'962 |
| 11. | ,, | ,, | రావుళ్లపల్లి | 11_6_1962 |
| 12. | ,, | చేవెళ్ళ | శంకరపల్లి | 17_6_1962 |
| 13. | ,, | ఇబ్రాహింపటం | చిప్పలపల్లి | 28_6_1962 |
| 14. | ,, | ,, | కొందలపద్కల | 28_6_1962 |
| 15. | ,, | ,, | ధన్నారం | 28_6_1962 |
| 16. | ,, | ,, | లిల్లీపూర్ | 28_6_1662 |
| 17. | ,, | ,, | చింతుండల | 29_6_1962 |
| 18. | ,, | ,, | రంగాపూర్ | 29_6_1962 |
| 19. | ,, | ,, | చీదేడు | 29_6_1962 |
| 20. | నిజామాబాదు | నిజామాబాదు | నివిపేట | 21_6_1962 |
| | | | (కరెంటుతో నడిచే సెట్టు) | |
| 21. | మెదక్ | ఆందోల్ | చేవేళ్ళ | 29_6_1962 |
| 22. | ఆదిలాబాదు | ఉత్నూరు | ధన్నూర | 12_6_1962 |
| 23. | ,, | ఆదిలాబాదు | మంగ్రుల్ల | 15_6_1962 |

| వరుస క్రమం | జిల్లా పేరు | తాలూకా పేరు | గ్రామం లేక సంస్థ పేరు | కమ్యూనిటీ రేడియో సెట్టును నెలకొల్పబడిన తేది. |
|---|---|---|---|---|
| 24. | .. | చిన్నూరు | కేతనపల్లి | 21_6_1962 |
| 25. | .. | .. | చమనపల్లి | 23_6_1962 |
| 26. | .. | .. | నేన్నెల్ల | 23_6_1962 |
| 27. | .. | .. | కోటపల్లి | 26_6_1962 |
| 28. | నెల్లూరు | నెల్లూరు | పుదిపర్తి | 20_6_1962 |
| 29. | మహబూబ్‌నగర్ | నాగరకర్నూలు | పాలెం మాధ్యమికపాఠశాల | 19_6_1962 |
| | | | (కరెంటుతో నడిచే సెట్టు) | |
| 30. | .. | .. | గుదిబండపంచాయతీ | 23_6_1962 |
| 31. | .. | .. | తెలకపల్లిపంచాయతీ | 26_6_1962 |
| 32. | నల్లగొండ | — | పొట్లపహాడ్ | 19_6_ 962 |
| 33. | .. | — | తిరుగండ్లపల్లి | 22_6_1962 |
| 34. | కరీంనగరం | సిరిసిల్ల | రేపాక | 21_6_1962 |
| 35. | .. | కరీంనగరం | లింగాపూర్ | 29_6_1962 |
| 36. | .. | .. | చమన్‌పల్లి | 29_6_1962 |
| 37. | శ్రీకాకుళం | చీపురుపల్లి | మరువాడ | 19_6_1962 |
| 38. | విశాఖపట్నం | యలమంచిలి | శ్రీరాంపురం | 24_6_1962 |
| 39. | .. | .. | నాయకరావుపేట | 23_6_1962 |
| 40. | .. | విశాఖపట్నం | మాధవధార | 28_6_1962 |
| 41. | .. | .. | యినకకోట | 28_6_1962 |
| 42. | పశ్చిమగోదావరి | కొవ్వూరు | కొవ్వూరు II | 29_6_1962 |
| 43. | తూర్పుగోదావరి | రాజమండ్రి | ధవళేశ్వరం | 21_6_1962 |
| 44. | పశ్చిమగోదావరి | పోలవరం | రాజంపాలెం | 13_6_1962 |
| 45. | గుంటూరు | సత్తెనేపల్లి | మేడికొండూరు (జంగం గుంట పాలెం) | 7_6_1962 |
| 46. | .. | గుంటూరు | తురుకపాలెం | 7_6_1962 |
| 47. | .. | .. | పల్లపాడు | 15_6_1962 |
| 48. | .. | .. | కోర్నెపాడు | 30_6_1962 |
| 49. | .. | తెనాలి | చావవారిపాలెం | 21_6_1962 |
| 50. | .. | ఒంగోలు | బయటమంజులూరు | 15_6_1962 |

జులై నెల సంచికలో (44 పేజీ) ప్రకటించిన కమ్యూనిటీ రేడియోసెట్లు ఏప్రిల్ నెలలో నెలకొల్పబడినవని గుర్తించవలెను. అదే పుటలో "రామాయంపేట" (బ్లాక్) అనుటకు మారుగా తాలూకా క్రిందపడింది. ఆగస్టు సంచికలో (33వ పేజీలో) 9వ తాలూకా సామర్లకోటకు మారు శృంగవరపుకోట అని చదువుకొనవలెను.

# తైపు నపు

పద్మశ్రీ

శ్రీ సి. నరసింహం
ఐ. ఏ. యస్.

నలుగురు కలిస్తేచాలు, తమ కార్పొరేషన్ గురించో, లేక మ్యునిసిపాలిటీ గురించో ఏదో ముచ్చటిస్తూ ఉంటారు. విమర్శిస్తూ ఉంటారు. ఇందుకుగల కారాణాలను కనిపెట్టటం ఏమంత కష్టం కాదు ఒక కార్పొరేషన్ గాని, లేదా పురపాలక సంఘం గాని పనిచేసే ప్రాంతం పెద్ద విస్తారంగా ఉండదు. ఉన్న ప్రజలుకూడా ఆ చిన్న ప్రాంతంలోనే సమ్మర్దంగా ఉంటారు. కాబట్టి పరిపాలనలో ఏమైనా లోపాలుగాని, తప్పులుగాని ఉంటే, వాటిని గురించి ఇట్టే పదిమందికీ తెలిసిపోతుంది. అంతే కాదు, ఇతర సేవా సంస్థలకన్న, యీ పురపాలక సంస్థ తరచు ప్రజలకు సన్నిహితంగా పనిచేస్తూ, అనేక విశాల ఎక్కువ మంది దృష్టిని ఆకర్షిస్తూ ఉంటుంది. కాబట్టి పరిపాలనపట్ల ప్రజలు చికాకు పడటానికి యీ సంస్థ విషయంలో ఎక్కువ అవకాశాలు ఉన్నయ్. మిగతా సంస్థలకు యీ ఇబ్బంది లేదు. కాగా, మంచి నీటి సప్లయి, మురుగు పారుదల, దీపాలు వగైరా సౌకర్యాలను సమకూర్చే బాధ్యత పురపాలక సంస్థలదే గదా. ఇక యీ సౌకర్యాల విషయంలో ఏమైనా లోపం జరిగిందా, ఆ లోపం మీద అందరి కళ్లు పడుతయ్. జరిగిన అసౌకర్యానికి, వారెంత గానో చికాకు పడుతారు. మరి పురపాలక సంస్థ అంటే, నిజానికి ఒక సేవా సంస్థ. ప్రజల్లో యీ విషయం గాఢంగా నాటుకునే దాకా, వారిలో కొన్ని దురభిప్రాయాలు ఉండటం, వారికి సహన శక్తి లోపించటం సహజం. పోతే, ఇంతకీ యీ పురపాలక సంస్థ అనేది ఖర్చు పెట్టే సంస్థయేకాక, పన్నులు వసూలు చేసే సంస్థ కూడా గదా. ఇక పన్నులంటే ఎంత భయమో మీకు నేను చెప్పాల్సిందేముంది? ఏదైనా కొత్త పన్నును విధించినప్పుడు, లేదా పాత పన్నును హెచ్చించినప్పుడు, మరి పన్నులను కచ్చితంగా వసూలు చేసినప్పుడు, పురపాలక సంస్థ మీద ప్రజలకు అభిమానం సన్నగిలి పోతుంది కదా. దీనికంతకూ కారణం ఏమిటంటే, పురపాల సంఘపు బాధ్యతలను, కార్యక్రమాలను, నిర్వహణా విధానాన్ని పౌరులు సరిగా అర్థం చేసుకొని ప్రవర్తిస్తేనే, ఆ పురపాలక సంస్థ జయప్రదంగానూ, పటిష్టంగానూ పనిచేయగలుగుతుంది అనే సత్యాన్ని చాలా మంది పౌరులు తరచు విస్మరిస్తూ ఉంటారు. కార్పొరేషన్ సమకూర్చే వివిధ సౌకర్యాలగురించి, ఏవేవో చట్టాలు, నిబంధనలు, శాసనాలు ఉన్నమాట నిజమే. కాని పురపాలక సంస్థలు సరిగా పనిచేయాలంటే, అందుకు విజ్ఞానంతో కూడిన ప్రజాభిప్రాయం అవసరం. పౌరులకు పౌర బాధ్యతల పట్ల సరైన గ్రహింపు ఉండాలి. నగర పరిపాన ఆదర్శప్రాయంగా ఉండాలి, అని పౌరులు గ్రహిస్తేనే, పురపాలక సంస్థ సమర్థవంతంగా పనిచేయటం సాధ్యం అవుతుంది. పురపాలక సంస్థ ఎంతో అభ్యుదయకర దృష్టితో పనిచేయవచ్చు. కాని అంత మాత్రాన్నే పురోగమనం సిద్ధించదు. ఓటర్ల, అనగా పేరుల స్థాయినిమించి, ఆ సంస్థ పురోగమించ జాలదు.

ఇవ్వాళ ఏ పురపాలక సంస్థ వ్యవహారలయినా ఉండవలసినంత సజావుగా లేవని అనుకుంటే, అందుకు ముఖ్య కారణం—ప్రజల్లో చాలా మందికి ఆ సంస్థకు సంబంధించిన విషయాల గురించి సరిగా తెలియకపోవటం. సంస్థ కార్యకలాపాలపట్ల ప్రజలకు ఆసక్తి ఉండదు. పుర ప్రజల సంకల్పాన్ని పురపాలక సంస్థ ప్రతిబింబించుకొనే రీతిగా దానిని రూపొందించుకోరు. చాలమందికి ఆ సంస్థ సమకూర్చే సౌకర్యాల గురించి స్పష్టంగా తెలియదు. ఈ సౌకర్యాలు ఏవిధంగా సమకూరేదీ తెలియదు. సలహా సహాయాలు ఏవిధంగా లభించగలవో తెలియదు. పన్నుల రూపంలో, రుసుముల రూపంలో తామిచ్చే

తమ్మకు బదులుగా ఎలాంటి సౌకర్యాలు తమకు లభిస్తున్నయో, వాటి విలువ ఏలాంటిదో చాలామంది గ్రహించరు. అందుకనే విమర్శించటానికి, తప్పులెంచటానికి పూనుకుంటారు. పురజను లందరూ విషయాలను సరిగా అర్థం చేసుకొని, హృదయ పూర్వకంగా సహకరిస్తే, ప్రజల సంక్షేమం విషయంలో పురపాలక సంస్థ ఇంకెంతగానో పాటుపడగలదనే నిజాన్ని బహుకొద్దిమంది మాత్రమే గుర్తిస్తారు. పౌరుడు అతను ఎన్నుకునే ప్రతినిధి, పురపాలక సంస్థ తాలూకు ఉద్యోగులు, యీ ముగ్గురు మధ్య సహకారం, ఐకమత్యం సరిగా ఉంటేనే, సంస్థ బాగా పటిష్టంగా పని చేయగలుగుతుంది. ఈ ముగ్గురు ఒకరి ఇబ్బందులను, అవసరాలను, సంకల్పాలను ఒకరు తెలుసుకోవాలి. పరస్పర గ్రహింపు ఉండాలి. ప్రజల సంక్షేమంకోసం పనిచేయటమే సంస్థకు లక్ష్యం. ఐతే ప్రతి సందర్భంలోనూ ప్రజలతోడ్పాటు లభించి తీరాలనేది పురపాలనకు ప్రాథమిక సూత్రం. ఈ సూత్రాన్ని యీ ముగ్గురూ తప్పక పాలించాలి.

ఇక లోపంలేనట్టి, సామర్థ్యం ఉన్నట్టి, నిజాయితీ ఉన్నట్టి పరిపాలన లభించాలి అంటే పౌరుడు అందుకు ఏం చేయాలి అనే విషయానికి వద్దాం. పౌరుడు తనకు హక్కులతోపాటు, బాధ్యతలు కూడా ఉన్నట్టు గుర్తించాలి. కార్యక్రమాల్లో ఆసక్తిని చూపాలి. సహకరించాలి. నిర్మాణాత్మకంగా, ప్రయోజనం ఉండేట్టుగా విమర్శించాలి. ఏదో విమర్శకోసమే విమర్శ చేయకూడదు. మంచినీటి సప్లయి, దీపాలు, రోడ్లు, స్కూళ్ళు, ఆసుపత్రులు వగైరా సౌకర్యాల విషయంలో తనకుండే హక్కులను నిలబెట్టుకోవాలి. పౌరుడి బాధ్యతలను పరిశీలిస్తే, అవి మూడు విధాలుగా ఉంటయ్. ఒకటి ఆ పురపాలక సంస్థపట్ల బాధ్యతలు, సంఘంలోని తోటి పౌరులపట్ల ఉండే బాధ్యతలు, ఇక తనపట్ల తనకుండే బాధ్యతలు.

అన్నిటికన్న ముఖ్యబాధ్యత పురపాలక సంస్థపట్ల ఉండాలి. ఈ సంస్థపట్ల సరిగా బాధ్యతను వహించాలంటే, అందుకు ముందు తన పేటకు ఎన్నుకొనే ప్రతినిధి విషయంలో తగిన శ్రద్ధను చూపాలి. ఏదో వర్గం బట్టి, కులం బట్టి ఎంచుకోకూడదు. ఆ వ్యక్తికున్న ప్రజాసేవలోని తత్పరతబట్టి, నిజాయితీబట్టి అతన్ని ఎంచుకోవాలి. అలా ఆదర్శప్రాయమైన ప్రతినిధిని ఎన్నుకొన్నాక, పౌరుడు సాధ్యమైనంత వరకు పురపాలక సంస్థ శాసనాలను, నిబంధనలను అనుసరించాలి. క్రమబద్ధంగా పన్నులను చెల్లించాలి. బకాయిలు లేకుండా చూడాలి. పన్నులను ఎగకొట్టటంలో, లేదా నిబంధనలనుంచి తప్పుకొనటంలో తన ప్రతినిధి పలుకుబడిని వినియోగించాలనే దురుద్దేశ్యం ఉండకూడదు. సంస్థ యొక్క కార్యకలాపాలగురించిన విమర్శ ఉపయోగపడేవిధంగా ఉండాలి. పౌర సంఘాల ద్వారా తన అభిప్రాయాలను ప్రకటించాలి. మరి చట్టాలను పాటించని పౌరుల విషయంలో సంస్థకు అతను తోడ్పడి, వారిలో శాసనాలపట్ల గౌరవాన్ని కల్గించాలి. చట్టాలు కదా అని చెప్పి, పౌరుడు సాక్షీమాత్రంగా చూస్తూ ఊరుకోకూడదు. సంస్థ వాటిని అమలు జరుపటంలో, అతను తోడ్పడాలి.

ఇంక తోటి పౌరులపట్ల ఉండవలసిన బాధ్యత – ప్రజలకు అరిష్టం కలిగే పని ఏమీ చేయకూడదు. తోటివారి ఆరోగ్యానికి, నీతికి, భద్రతకు భంగం కల్గించే రీతిన ప్రవర్తించకూడదు. తోటివారికి అసౌకర్యంగాని, ప్రమాదంగాని, చికాకుగాని కలిగే పనులు చేయకూడదు. ఇది ప్రజల విషయానికి సంబంధించినది. ఇక వ్యక్తిగతంగా చేసే కొన్ని అనర్థాలు ఉన్నయ్. పౌరుగువారి హక్కులకు భంగం కల్గించకూడదు. భంగం కల్గించే విషయాలను ఎన్నైనా ఉదహరించ వచ్చు. రోడ్లు పాడుచేయటం, పౌరుగువారి ఆరోగ్యానికి భంగం కలిగే తీరున ప్రవర్తించటం, చుట్టుపక్కలవారు నిద్రపోతున్నారో, విశ్రాంతి తీసుకుంటున్నారో, ఏదైనా సుస్తీతో బాధపడుతున్నారో ఏ మాత్రం గమనించకుండా పండగలకు, పబ్బాలకు లౌడ్‌స్పీకర్లను పెట్టటం, నివాస గృహాల గోడలపై పోస్టర్లు, బిల్లులు అంటించటం, నీటిసప్లయి, టెలిఫోన్లు వగైరా సౌకర్యాలను చెడగొట్టడం, ఏదో ఇతరులను ఇబ్బంది పెట్టాలనే దుశ్చింత ... ఇవన్నీ అరిష్టాలే. ఇవన్నీ పురపాలక సంస్థ సక్రమ వ్యవహారాలకు భంగం కలిగించేవే.

ఇలాంటి పనులు చేయకూడదనే సంగతి ఇలా ఉండగా మరొక ముఖ్యవిషయం ఒకటి ఉంది. అదేమిటంటే, పుష్కలంగా లభించకుండా ఉన్న సౌకర్యాలను తగుమాత్రంగానే వినియోగించుకొనటం. ఉదాహరణకు ఒక నగరంలో నీటి ఎద్దడి ఉందనుకోండి. పౌరుడేంచేయాలి? పంపులో నీళ్లు ఉన్నయ్ గదా అని, ధారాపాతంగా నీళ్లు వాడేయకూడదు ... ఇతరులకు సహాయపడేట్టుగా, తాను తక్కువగానే వినియోగం చేయాలి. నీటిని గాని, విద్యుచ్ఛక్తినిగాని తాను తక్కువగా వినియోగిస్తే, ఇతరులకు ఉపకారం కల్గుతుందనే విషయాన్ని మరవకూడదు.

మరి సమాజం అన్నాక, దుర్బల వర్గాలవారు ఉంటారు.

దురదృష్టవంతులు ఉంటారు. దీనులు, దౌర్భాగ్యులు, నిరాధారులు ఉంటారు. అనాథులు ఉంటారు. అంగవైకల్యం ఉన్నవారు ఉంటారు. వీరికి సేవచేసే ప్రజాసంస్థలు ఉంటయ్. ఈ సంస్థలు అనాథాశ్రియాలను, తదితర సంస్థలను నడుపుతూ ఉంటై. పౌరుడు యీ దురదృష్ట ప్రజలపట్ల తనకున్న బాధ్యతను గుర్తించాలి. ఈ సంస్థలకు ఎంతగానో సహాయపడాలి. ఉత్కృష్టమైన సేవాసక్తిని చూపాలి. ఇతరులకు ఆదర్శప్రాయంగా ఉండేట్టు ప్రవర్తించాలి. అనేక విధాల పౌరుడు సహాయ పడవచ్చు.

తమ ఇంట్లోని చెత్తా చెదారాన్ని పొరుగువారి తోటలోకి, దొడ్లోకి విసరకూడదనే విషయాన్ని తరచు పౌరులు గుర్తించుకోరు. తన ఇల్లు చక్కగా, శుభ్రంగా ఉండాలంటే దానికర్థం—పొరుగువాడి ఆవరణలోకో, లేక రోడ్డుమీదికో వస్తువులను విసిరివేయాలని కాదు. ఇది పొరుగువారికేకాక తనకీకూడా ప్రమాదకరం. ఎందుకంటె వ్యాధులనేవి ఉన్నయే, వాటికి విచక్షణ లేదు. అవి సర్వత్ర వ్యాపిస్తయ్.

మరి ఇక, చివరి విషయం—నగరం సుందరంగా ఉండాలి. అంద చందాలతో కలకలలాడాలి. సుఖప్రాయంగా ఉండాలి. పౌరుడు యీ విషయంలోకూడా తన బాధ్యతను మరచి పోకూడదు. నగరాభివృద్ధి అంటె—మురికి పేటలను నిర్మూలించాలి. సమాజంలోని అందరికీ ఉపయోగపడే ప్రయోజనాలను సమకూర్చాలి. సాంఘికంగా ఐకమత్యం, ఇరుగు పొరుగు అనే సహకార భావం పెంపొందే విధంగా పౌరుడు ప్రవర్తించాలి. జీవన ప్రమాణం పెరిగినంత మాత్రానే చాలదు. ప్రజల్లో ఆత్మ విశ్వాసం ఉండాలి. సహకార ధోరణి ఉండాలి. వాతావరణం వ్యక్తుల సమగ్ర వికాసానికి, సాంఘిక పురోగమనానికి దోహదపడేట్టుగా ఉండాలి,

ఇక పోతే పౌరుడికి తనపట్లనేతనకు బాధ్యత ఉంది. ఉదాహరణకు, టీకాలు వగైరా విషయాలు—మొత్తం ప్రజలందరి సంక్షేమం దృష్ట్యా ఏర్పాటు చేయబడిన నివారణ చర్యలు ఇవి. నిజమే. కాని ప్రధానంగా వ్యక్తికి ఉపయోగపడటమే వీటి ఉద్దేశ్యం. కాబట్టి పౌరుడు తాను, తన సంతానం, తన కుటుంబం టీకాలు వేయించుకొనే విషయంలో శ్రద్ధవహించాలి. అలాగే ఇల్లు కట్టుకుంటే ఆ విషయంలో కొన్ని నిబంధనలను పాటించాలి. ఇది తన మంచికి, తన భద్రతకు కూడా.

ఇంగ్లండు వెళ్లి, అక్కడి పురపాలక వ్యవహారాలను చూసినప్పుడు, మూడు విషయాలు నాకు ప్రధానంగా గోచరించినై. ఆ దేశంలో స్థానిక పరిపాలన అంత సమర్థవంతంగా ఉండటానికి అవే కారణాలు, ఒకటి—పౌరులకున్న క్రమ శిక్షణ. ఏదైనా చిక్కు పరిస్థితి వస్తే, వెంటనే అంతా ఏకమవుతారు. జాతీయ అవసరాల సమయంలో చేయవలసిన త్యాగాలను హృదయపూర్వకంగా చేస్తారు. వారికున్న చారిత్రక దృక్పథం విశేషమైనట్టిది. సంప్రదాయంలోని మంచిని జార విడవరు. పాత కొత్తల మధ్య మేలుకలయికను వారు సాధిస్తారు. కొత్త విధానాలను, సంస్థలను సృష్టించటంలో పాతను మరువరు. వాళ్లలో చెప్పుకోవాల్సింది—క్లబ్ ధోరణి. అందుమూలంగా, చిన్న, పెద్ద విషయాల్లో వారిలో సహకార భావం, స్నేహ భావం పెంపొందుతయ్,

ఇక బాధ్యతగల పౌరుడి చివరి నిర్వచనం ఇది—అతనికి క్రమశిక్షణ ఉండాలి. జాతీయ భావం ఉండాలి. సాంఘిక దృక్పథం తనలోనూ, ఇతరుల్లోనూ వ్యాపింప జేసుకోవాలి తనపై తన సంక్షేమమే కాక, తోటివారి శ్రేయస్సు, నగర శ్రేయస్సు ఆధారపడివున్నయనే విషయాన్ని నిరంతరం దృష్టిలో ఉంచుకోవాలి. తనపట్ల, తోటి పౌరులపట్ల, పురపాలక సంస్థపట్ల తనకు ఉన్న బాధ్యతలను సరిగా నిర్వర్తించే విధంగా ప్రవర్తించాలి. పౌరులెప్పుడైతే ఉదాత్తంగా ప్రవర్తిస్తారో, అప్పుడే నగరాలు ఉత్తమంగా ఉంటై.



కథానిక :

# పానకంలో పుడకలు

శ్రీ ద్వివేదుల సోమనాథశాస్త్రి

ముచ్చటగా ఆ మూడు రోజులూ గడవక ముందే చెప్పా చెయ్యకండా అల్లుడుగారు వెళ్లిపోవడం అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించింది: గుసగుసలు బయలు దేరాయి. సారి పెళ్లివారందరూ ముక్కులమీద వేళ్లుంచు గున్నారు. ఒకళ్ల చెవులొకరు కొరుక్కుంటున్నారు. తలొక విధంగా వ్యాఖ్యానిస్తూ గింజుకు పోతున్నారు.

"అదేం చోద్యమమ్మా!" "ఇలా ఎక్కడా జరగలేద"ని కొందరన్నారు.

"ఇంటా వంటా లేనిది ఇదేమిటి ?" "నలుగురులో నగుబాటు కాదా" అని యింకొందరన్నారు.

"ఈ విడ్డూరం ఎక్కడా చూడలేదని" "మా కాలంలో మేం ఎరగం" అని మరికొందరన్నారు. వంశానికే ఏదో అపఖ్యాతి వచ్చేసిందని అందరూ యీ విధంగా అనుకుంటూ దవడలు సొట్లు పడేటట్లు నొక్కుకుంటున్నారు.

ఇంత మంది యిలా వేగిపోతున్నా ... ఎవరికీ అసలు కారణం మాత్రం అంతు దొరక లేదు. దానికి కారణం కోసం పరిశోధన ప్రారంభమయింది. ఆ పెళ్లి పందిరిలో.

గోప్యం కాస్తా గోలలోకి దిగింది, మూతల పడ్డ నోళ్లు చకచకా వాగే అవకాశం లభించింది ! బిరడాలు పడ్డ చెవులు సడలేయి, పనిలేని చేతులు అభినయ పూర్వకంగా విన్యాసం చేస్తున్నాయి.

ఎవరి నోటంట విన్నా —

"శుభమా అని శోభనం మూడు రోజులూ కాకండా పెళ్లికొడుకు ఎందుకు వెళ్లిపోయాడు?" అని ఒక అమ్మలక్కఅంటే.

"ముచ్చటగా మూడు రోజులూ గడపకండా ఎవడయినా వెళ్లి పోతాడ ? ఏదో విశేషం లేకపోతే ?" అని మరో చిగురుబోడి ప్రశ్నించింది.

"మర్యాద లేం తక్కువయ్యాయో ఏమో ? మాట దక్కనిచ్చాడు కాదు," అని యింకొక ప్రౌఢ సంశయం వెళిబుచ్చింది.

"అట్లాంటి వేమయినా వుంటే సర్దుకు పోవాలి గాని యిలా బజారున పెట్టుకుంటారా ? మనుషులన్న తర్వాత లోటుపాట్లు రావూ ?" అని యింకొకామె సమర్థించింది.

"ఏం జరిగిందో ఏమిటో అసలు సంగతులు మనకేం తెలుస్తాయి ?" అని ఒక యువతి అంది. "అవును వాళ్లకీ వాళ్లకీ ఏమున్నాయో ! కొంత త్రివ్వితే రాళ్లు," అని మరొకతె ప్రతిపాదించింది.

"వాడికి పుట్టిన బుద్ధికాదు, ఎవరు పెట్టేరో పెంట !" అని చిన్న అనుమానం లేవదీసింది ఒక మెల్లకంటి ముత్తయిదువ.

"ఎవరో పెట్టేదేంటే ఏదో జరిగే వుంటుంది," అని ఖచ్చితంగా, ఇంకొక ఆమె చెప్పింది.

"పోనీ, వెళ్లిపోయాడే అనుకో ! వెళ్లిపోతూంటె ఏదో బ్రతిమాలుకుని సముదాయించి ఆపుకోవాలి గాని వూరుకుంటారా" అని అంది ఒక పూర్వసువాసిని.

"బావుంది, బావుంది! యిహనదొక్కటే లేదనుకున్నావా ? అల్లుడు కారణం లేకుండా అలిగి వెళ్లిపోతుంటే ఎవరయినా చూస్తూ వూరుకుంటారా ? అందులో యిలాంటి సమయంలో, అవన్నీ జరిగాయట! ఎంత బ్రతిమాలుకున్నా అటువేసిన కాలు యిటు కదపలేదుట," అని ఒక వనిత ప్రత్యక్ష సాక్షిలా చూసి వచ్చినట్టు చెప్పింది.

"పోనీ ఏమయినా కావలిస్తే యిచ్చుగుంటాం అని కూడా అన్నారట ! కాని ఎంత చెప్పినా లాభం లేకపోతేనే వూరుకున్నారట !"

"పాపం ఆడపిల్ల గలవాళ్ల మనసులు ఎంత క్షోభిస్తాయి అన్న యిదేనా వాళ్లకి వుండదు కాబోలు!" అని అంది ఒక జాలిగుండెగల జలజాక్షి.

"బావుంది మొగపెళ్లివారికి పట్టుదలలూ పంతాలే గాని పై సంగతులన్నీ వాళ్లకెందుకు? యిలాటి పన్నిచోట్లా జరిగే ఆనవాయితీలే కదూ?"

"దేనికయినా, సమయమూ, సందర్భమూ వుండొద్దూ! ఎక్కడ జరగవలసింది అక్కడ జరిగితేనే ముద్దుగా వుంటుంది! యిటువంటప్పుడు అలిగితే ఎవరికి నష్టం?" అని అంది ఒక అనుభవజ్ఞురాలు.

ఈ విధంగా చర్చ జరుగుతుండగా అంతవరకూ వూరుకుని యింక వూరుకోలేక ఒకామె - రహస్యంగా అందరి మధ్యకీ జరిగి ___

"నా మొహం! అవేవీ కావటరాఁ! అసలు లాభం రుచి చూస్తేనేకదా! నష్టం సంగతి అనుభవంలోకి వస్తుంది! అసలు ఏఁవీ లేందే?" అని ఏదో దాగొన్న విషయాన్ని పైకిలాగ ప్రయత్నించింది!

"అదేఁవిటే! లాభనష్టాలు అంటున్నావు? అదేదో సరిగ్గా చెప్పి ఏడవరాదూ?" అని అడిగింది యింకొకామె ఆ అర్ధోక్తి బోధపడక.

"ఇంత సేపూ మీరేఁవంటారో అని వూరుకున్నాను గాని... యిదంతా చూస్తే ఆ సూరమ్మా ... బంగారమ్మా ... చెప్పింది నిజమేనని తోస్తోంది!" అని ఆమె మనసులో వున్నది దాచుకోలేక బయటపెట్టి దారిచేసుకొంటూంది.

"ఏం చెప్పారట!" అని ఆతృతగా అందరూ ఆమెమీద పడి అడిగారు!

"చెప్పడం ఏమిటి నా మొహం! వాళ్లు ప్రత్యక్షంగా చూసి అనుకుంటూ వుంటేను!. యింక నిజమా, అబద్ధమా అన్న సందేహం లేదు, ప్రత్యక్షంగా కనబడుతున్నదేట!- తొలినాడు వుదయాన్నే వెళ్లి చూసి అటువంటి సూచన లేవీ కనబడ లేదని- ఆ నరసమ్మ చెప్పింది ... అయినా వాళ్లన్నదే నేనంటున్నాను గాని. నేనన్నానని నామీద పెట్టేరు సుమా! నాకెందుకొకళ్ల గొడవలు!" అని తన మీదకి రాకుండా అడ్డు పెట్టుకుంది, అనవలసినదేదో అనేసి!

"అవును వాళ్ల మొహాలు చూస్తే తెలియడం లేదూ:" అని యింకొకర్తె అంత వరకూ ఏమీ తెలియని దానిలా వూరుకునే, అన్నీ తెలిసినట్టు అంది; ఒకళ్లు అసలు విషయం బయట పెట్టే సరికి మరి ఫరవాలేదు అన్నట్టు అందరూ అనడం మొదలెట్టేరు.-

"మొదటి రాత్రి ... కొత్తో...సిగ్గో ... అమాయకమో: తెలియకో-అనుకున్నాం కాని... రెండోనాడు కూడా..."

"ఆఁ...నిజమేనంటావా!... ఎంచేతో ఏమిటో!"

"తెల్లవార్లూ-ఆ భాగోతం అంతా అదుగో..ఆ వెంకమ్మా.. సుబ్బమ్మా...కూడా చూశారట!" అని అంత వరకూ మాటాడకండా వింటూ కూర్చున్న వాళ్లని కదిపింది, యింకొకామె.

"అదేమే వెంకూ! అలా ముంగిలా కూర్చున్నావు తెలిసి వుండేనా?... యివతల మేం తన్నుకు చస్తూంటేను?"

"మనకెందుకు లేవే! ఎప్పటికయినా వాళ్లూ వాళ్లూ ఒకటేను. ఎటొచ్చీ యిదుగో అన్నారు ఆడిపోసుకున్నారని మనని అంటారు!"

"లోక సహజం అనుకుంటాం! మనం మానేస్తే లోకం వూరుకుంటుందా? చెబూతూ...పిల్ల భయపడి వుంటుందంటావా?"

"సింగినాదం! యినాటికి సుకుమారి వెలిసింది మహా!... మొదట్లో కొంచం బితుగ్గావున్నా...మనమంతా ఎలా చెబితే అలా నడుచుకోలేదా?... అంతెందుకూ మన లక్ష్మికన్నా ఎక్కువా ఏమిటే!... అది మొదటి రోజున బెదిరి పోయి యివతలకే వచ్చేసింది... కూడదమ్మా అని నయాన్ని చెప్పేసరికి రెండో రోజు సర్దుకు పోలేదూ? యిలా అల్లరి పెట్టుగుంటారా?" అని వెంకమ్మ అనుభవజ్ఞురాలు, చెప్పింది.

"ఇది చాలా విడ్డూరంగా వుంది! దాని కయినా ఎవరూ చెప్పలేదటమ్మా!" "బావుంది నీ ప్రశ్న. యీ సంగతులు యీ కాలప్పిల్లలికి చెప్పేదేమిటి?...వాళ్లకి తెలియదనుకోడం మన తెలివి తక్కువ, తిరిగి మనకే. ఆ లక్షణాలన్నీ చెప్పకుండా వుంటే సరి, అయినా ఒకనాడు కాకపోతే ఒకనాడయినా నేర్చుకోవాలిగాని ఒకడు చెప్పేదేమిటి... చెప్పినా వింటారా?"

అలా "కొట్టి పారేయకూ. ముక్కు పచ్చ లారంది దానికేం తెలుస్తుంది ... అంతా మొగాడిలో వుంటుంది ... త్రిప్పుకోడం ఏమంటావు?"

"ఆ మాటంటేనేనొప్పుగోను; ... యింకెక్కడయినా ఏమోగాని... మేంచూస్తూనే వున్నాంగా . . పాపం, యీ పిల్లడు అలాటి వాడు కాదు. మొదటి నుండి ఎంతో నెమ్మదిగా-మంచిగా, ఓర్పుగా చెపుతూ వచ్చేడు ... కాని అదే ... అటు త్రిపిన మొహం యిటు త్రిప్పందే!"

"అయ్యో: దానికే సంకటమే!"

"సిగ్గు బిడియాలు అందరికీ వుంటాయి...ఎంతయినా అంతలా బిగుసుక్కూచో కూడదు. అది మొండి తనం కింద తయారవుతుంది!"

"తర్వాత ఏమిటయింది!"

"—కొంత సేపలాగే బెల్లంకోట్టిన రాయిలా కూర్చుంది! అతడెంతో చనువుగా ప్రేమతో పలకరించినా... ఒక్క మాట కూడా మాటాడలేదు... సరికదా అతని వేపయినా చూడ లేదు-అలా సగం రాత్రి గడచిపోయింది!"

"అయ్యయ్యో! దాని సిగ్గు బొగ్గులవా? .. బావుంది అయితే వూరుకున్నాడూ?" "అబ్బే! ఎంత నెమ్మది! ఎంత సహనం: అలాగే మంచి మాటలూ చెబుతూ ఎంతో లాలించేడు... ఆఖరి కెలాగయితేనేం ముక్కుకి ముక్క మాత్రం జవాబు చెప్పింది."

"మరేం బాగానేవుంది... మరి ఏ ఆడిది మాత్రం సిగ్గు విడిచి ముందు మాటాడేస్తుంది!"

"ఇంతవరకూ బాగానేవుంది"—

"అంత సేపూ యిద్దరు నిలబడే వున్నారు.... అతగాడు, దగ్గరగా వచ్చి చెయ్యి పట్టుగున్నాడు..అదేమీ అనలేదు!... ఆ తర్వాత ... మంచం మీద..."

"ఆఁ... అయ్యయ్యో:... మీకెంత సిగ్గులేదే! యింకా చూస్తూనే వున్నారూ?" అని ఒకామె అడిగేసరికి

"అబ్బా! వుందూ చెప్పనీ! మధ్యలో పానకంలో పుడకలా... వూరుకో!" అని మరొకామె చికాకుగా కసిరింది ఆతృతగా వింటూ—

"కూర్చో బెట్టేసరికి... వెంటనే లేచి నుంచుంది!"

"అయ్యో! దానికేం వచ్చిందే!"

"—మరెంత పలకరించినా నోరు కదప లేదు!"

"మహ యోగ్యంగా వుంది!"

"తర్వాత పలహారాలిచ్చాడు అది ముట్టుకోలేదు..."

"ఏం చెప్మా !... తర్వాత ..."

"ఇంకేముంది—ఏం జరగాలో అదే జరిగింది—"

"జరిగిందీ ?"...

"— నా బొంద ! అసలు మనిషిని దగ్గరకు రానివ్వందే!"

'ఇష్టం లేదో ఏమిటో !'—

'అబ్బే ! అలాటి దేఁవీ కాదు '

'ధనగర్వం అంటావా ? '

"ఆఁ మహాఁ లక్షాధికారి కూతురా ?— కోటీశ్వరుడి కూతురా ? అలా మాటాడుతావు ?... అయినా డబ్బుంటే మాత్రం ఎంతమంది లేరు! ఇలాటి సమయాల్లో బెట్టుసరి ఏమిటీ !... తెలివి తక్కువ ?"

"అంత పెడసరం కూడదు ! "

'—మొహం చూస్తే అలాగేం కనపడదే !'—

'ఏం ఎరగనట్టు అలాగే వుంటారు లేవే !'

'తనకు తోచక పోతే ఒకరిని చూసి అయినా నేర్చుకోవాలి గాని యిలా కాపురం పాడు చేసుకుంటుందా ?"

"పులిని చూసినట్టు మొగుడిని చూస్తే అంత భయపడిపోతే ఎలా ?"

"—భయం కాదూ ఏమీకాదూ ... మొండితనం!... లేకపోతే — చక్కని వాడు కాదనా ? మోటుమనిషనా ?...ముసలివాడనా ! ఏం తక్కువయిందని ... చక్కా, ఈడూ జోడూ చిలకా గోరింకల్లా వున్నారు! ... ఎఁదుకో ఆ యిది !" అని... ఒకర్తె చెప్పేసరికి.

"...మనలో మాట ... ఏమే సుబ్బీ ... పిల్లకి ఏనువో ఏమిటో ! ... అలాటి వేమీ లేవుకదా ?" అని యింకో ఘోరమయిన సందేహం వెలిబుచ్చింది మరొక ఆమె —

"విక్షేపంలాటి పిల్ల ! ... దానికేమే ! ... చిన్నప్పటి నుండీ మన దగ్గరేకదా పెరిగింది! ఏం ఎరగనట్టు అడుగుతవేం?" అని వెనుకేసుకొచ్చింది మరొకామె.

"ఇంక అబ్బాయి కూడా పయివాడా ఏమిటీ ? మేనత్కం అయెను ! ఎరక్క పోవడం అంటూ వుంటుందా ? అటువంటి వాటికి అవకాశం లేదు !"

"ఏమిటో పాపం పుణ్యం ఆ భగవంతుడికే తెలియాలి ! అగొడవ లేమిటో !"

''అయితే ఆ రాత్రిఅల్లా అలాగే గడిచి పోయిందన్న మాట !"

''ఆఁ! కోడి కూసే వరకూ అదే వరస యింకేముంది. వాళ్లల్లా మిడుతూ మిడుతూ చూసుకుంటూ కూర్చున్నారు. యింక అంతే అని మేం పల్లలోకి పోయేం!"

''ఆ మర్నాడేమయిందో చూశారా !"

''ఊరుకుంటారా ? వాళ్లతో సహా యివతల వీళ్లూ జాగరం చేశారు !"

''ఏమిటయిందేమిటీ ?"

"మళ్లీ యథాప్రకారమే మొదట రోజులాగే మూడు గంటలూ కొట్టేవరకూ అయిపోయింది."

"ఆ...తర్వాత !"

"వెలుతురంటే సిగ్గు పడుతుందేమోనని దీపం కూడా ఆర్పేసేడు !"

''అయినా ... ... ?"

''—దీపం ఆర్పేస్తే నాకుభయమేస్తుంది...వెలిగించండి!" అని ఖచ్చితంగా చెప్పేసింది.—పాపం అలాగే చేశాడు...

దగ్గరగా తీసుకొని ... ఎన్ని విధాలో బ్రతిమలాడాడు ... ఆఖరికి — ఎవరయినా చూస్తున్నారేమోనని జంకుతున్నావా ?" అని కూడా అడిగేశాడు !

'ఆఁ! ఎంతమాటన్నాడు ? అలాక్కూడా అనేశాడన్న మాట! మీరు చూస్తున్నట్టు అలికిడి వినేవుంటాడు.

'ఏమో! అయినా వాడంటే మానేస్తామా ఏమిటీ ?— యింతకీచెప్పొచ్చే దేమిటంటే, అంత యిదిగా చూసినా అదేమీ అనలేదు మంచం దగ్గరికి తీసుకువెళ్లి మంచి మాట లాడితే మురిపించి మురిపించి కబుర్లు మాత్రం చెప్పింది."

..అంతే...మళ్లీ యథా ప్రకారమే !

'అయ్యో కర్మ! అటువంటి సమయంలో కొత్త జంట ఎలా వుండవలసింది ? కోరుండి చేసుకుంది అతడి ననవలసిన పని లేదు!"

'ఏ దెయ్యమో—దేవతో పట్టిందో ఏమిటో ... లేకపోతే మొదట్లో ఏ ఆడదయినా అలా ఎదిరిస్తుందా? అదీ ఆడ పుట్టుక పుట్టిందామరి !"

ఎంత సేపని పెనుగులాడితాడు ! వూరుకుని మాటలు మొదలెట్టేడు. అది అటు ప్రక్కకి తిరిగిపోయి చీకూ చింతా లేకుండా పడుక్కుంది !... పాపం — అతడలా దానివైపుచూస్తూ ఆలోచిస్తూ కుర్చీలో కూర్చుండి పోయాడు ! ఇదీ రెండవ రోజు భాగోతం...యిలా తెల్లారింది !''

''... సిగ్గు సిగ్గు...ఎవరితో చెప్పుకున్నా ... ఎంత పని చేసింది: యిలా చేస్తే వెళ్లిపోయాడంటె ఆ అబ్బాయిదా తప్పు?"

ఈ విధంగా అక్కడికి వచ్చిన పెళ్లివారూ, అమ్మలక్కలూ తర్జన భర్జనలు చేసి ఆడపెళ్లివారిదే తప్పు అని తేల్చేశారు.

ఈ గోల గోరంతలు కొండంతలయి పెళ్లిపెద్దల వరకూ వెళ్లింది. పెళ్లికూతురు తల్లికూడా ఇదంతా గమనించి భయపడింది. అందరూ యిలా అనుకోవడంతో అనుమానం బలపడి ఎటంచి ఏమొస్తుందో అని బెంగపెట్టుకుంది.

ఏది ఎలా వున్నా అల్లుడు మూడు రాత్రులూ పడక ముగియ కండానే, ఆకస్మాత్‌గా వెళ్లిపోవడం, ఎవరితోనీ చెప్పక పోవడం—వీటి వల్ల పెళ్లి పెద్దలకీ కూడా కాళ్లూ చేతులూ ఆడ లేదు! కారణం అంతకన్నా తెలియలేదు. ఎరిగున్నంత మట్టుకు ఏ విషయంలోనూ వారేం లోపం చేయలేదు. పెట్టుపోతల్లో నయితేనేం, మర్యాదలో నయితేనేం, అన్నీ యథావిధిగా జరిపేరు. అలాటప్పుడు అల్లుడలా వెళ్లి పోయాడంటే ఎలా వుంటుంది.

ముక్కు పచ్చలారంది, ప్రపంచ జ్ఞానం లేనిది, అయిన తమ కూతురి వల్ల ఏం తప్పుంటుందని అనుమానించగలరు! అయినా యీ అమ్మలక్కల గోలవల్ల—సారి. పెళ్లికూతురు కమ లని మెల్లిగా అడుగుదామనుకుంది. ఆమె తల్లి.

కమల తలవంచుకుంది సిగ్గుతో — తల్లి జడ వేస్తూంది. కమలలో ఎటువంటి భావాలు వున్నాయో! ఆమె యీ పరిస్థితుల్లో ఎలా వుందో ఏమనుకుంటూందో, ఆమెను చూసి చెప్పడం కష్టం. అయినా ఆమె కళ్లలో కొంచం బెదురు. హృదయంలో భారం కనబడుతూ వుంది. ఆమె అంతలోనూ అమాయకత్వం నిండివుంది.

''మీ ఆయన ఏం చెప్పాడా? ఏమిటే?" అని అడిగింది తల్లి మెల్లగా. కమల తనని కాదన్నట్టుగా వూరుకుంది—

''నిన్నే...నే... అడుగుతున్నది... పిల్లా ...అని నడ్డి మీద పిడికిటితో మెల్లిగా పొడచి అల్లుతున్న జడపట్టుకు కళ్లెంలా లాగింది.

"అబ్బా! వసులుగా వెయ్యవే!" అని అంది బాధతో— కమల.

"సరేలేగాని—మీ ఆయన ఎవరికీ చెప్పా చెయ్యకుండా వెళ్ళి పోయాడేం?"

"అదేమో తననే అడుగు నాకేం తెలుసు!" అని బుంగ మూతి పెట్టి అంది.

"నీతో చెప్పలేదేమిటే! అలిగి వెళ్ళిపోయాడా ఏమిటి!"

"బావుంది: నాకెందుకు చెప్తారు! నాకేం తెలీదు!" అని మూతి ముడిచేసుకుంది. వస్తున్న ముసి ముసి నవ్వులని దాచేసుకుంటూ.

"నీకంత నవ్వులాటగా వుంది...గాని... నలుగురిలోనూ మేం మొహం ఎత్తుకు తిరగాలా?"

"ఏ మొచ్చిందే యిప్పుడు?"

"మరి మూడు రోజులూ కాకుండానే వెళ్ళిపోయాడేం! నీకేం తెలీదంటావు?"

"నాకేం తెలుస్తుంది! యిది మరీ బావుందే!"

"నీకు తెలియక పోవడం ఏమిటి!...ఏదో గొడవ చేసి వుంటావు! తెలియదనుకున్నావా? చూసిన వాళ్లు చెబుతూంటేను.. అయినా చిన్నపిల్లవా? యిన్నేళ్లు వచ్చేక యింకా చెప్పాలా? తగి వట్టు నడుచుకోవాలిగాని—

"ఒకరోజు కాకపోతే, మరోరోజయినా గ్రహించకపోతే ఎలా?...మొదట్లోనే నీమీద ఏం అనుకున్నాడో ఏమిటో! మొగాడి మనసు విరిగిందంటే ఆడాదాని జీవితం ఏమవుతుందనుకున్నావు?" అని కమల తల్లి మొదలెట్టింది.

కమలకిదేమీ అర్థంగాక చూస్తూ ఏం మాటాడక వూరుకుంది. "మన వంశంలో ఎక్కడా లేనిది యిలా చేస్తున్నావేమిటే! అప్రతిష్టపాలు చేయడానికి?" "......"

"................"

"శుభమా అని నీకోసం యిన్నిపాట్లూ పడి మంచి యింట్లో పడెద్దామని తలపెడితే యిలా అభాసు చేసుకుంటారా?"

"................"

"అసలు ఏమిటి జరిగింది...ఎందుకలా మొండిపట్టు పడుతున్నావు!...నాతో చెప్పడానికి నీకేమే.. తల్లీ...అందరూ నీదే తప్పంటున్నారు...విన్నావా...?"

ఇదంతా ఏమిటో, తన్నెందుకు తల్లి యిలా నిందిస్తూందో, తన తప్పేమిటో...కమలకి బోధపడలేదు. ఏం చెప్పడానికీ తెలియడం లేదు. కాని యిలా కమల జవాబు చెప్పకపోవడం... అమ్మలక్కలందరూ తన దగ్గర చెవిని యిల్లు కట్టుకుపోరి తలకెక్కించిన విషయాలూ...కమల తల్లికి, ఒక దురభిప్రాయాన్ని కలగజేసేయి.

తన కూతురు వల్లే తప్పువుందని — ఆ రెండు రాత్రులూ, కమల భర్తదగ్గర సవ్యంగా ప్రవర్తించలేదని అందికే అల్లుడు అలిగి కోపంతో వెళ్ళిపోయాడని...అనుమానం వుండిపోయింది. అందికే ఎలాగయినా కూతురి ద్వారా కారణం తెలుసుగోవి, మెల్లిగా చెప్పి ఒక దారికి తీసుకురావాలని అనుకుంది. అయినా ఎన్ని విధాల తల్లి ప్రశ్నించినా, కమలకి యిదేం అర్థం గాక అయోమయంగా వుంది. అన్నివింటూ అమాయకంగా కూర్చుంది.

మళ్లీ తల్లి మొదలెట్టింది—

"...అతను వెళ్ళి పోయాడంటే తప్పా! యిప్పుడే మొహం పెట్టుకు బతిమాలుకోడం? యింత నగిబాటు చేస్తావని అనుకోలేదు. యింకా పాలు తాగుతున్నావా? జ్ఞానం వచ్చిన దానివి ఆపాటి తెలియొద్దూ?"

"................"

"మంచీ చెడ్డా—కష్టం, నష్టం, ఆలోచించవద్దూ! ఎవరికి నష్టం అనుకున్నావు? అదృష్టం బావులేకపోతే ఎట్నుంచి ఏది వచ్చినా ఆజన్మాంతం నువ్వూ, నీతోపాటు మేమూ ఏడ్వాలసిందేనా? యింకేమయినా వుందా?"

"................"

"మన మర్యాద మనం వుంచుకోవాలి. ఆమోజు అలాగే కాపాడుకోవాలి—గాని యిలా తెలివితక్కువగా ప్రవర్తిస్తే... నీ బ్రతుకు ఏమవుతుంది?"

"................"

"ఏది ఎటయినా ఆడదానికే నష్టంగాని—మొగాడికి!— ఈ రోజునే కదా నువ్వంటే ఏమిటో, ఎటువంటి దానివో—ఆయన తెలుసుకుని, ఒక అభిప్రాయానికి వచ్చేరోజు, అటువంటిదినువ్వు యిలా వున్నావూ అంటే—నీ మొహం తిరిగిచూస్తాడా, నీ కాపురం ఏమవుతుందో యింత పిసరయినా ఆలోచించావా? నీభర్తని సంతోష పెట్టడం కన్న వేరే ఏముంది చెప్పు!"

"................"

"నిన్ను పెంచి పెద్దదాన్ని చేసాం...ఏ లోపం యింత వరకూ రానివ్వలేదు. పువ్వులా ఎంతో ముద్దుగా పెరిగావు... యీడు రాగానే తగినవాణ్ణి తెచ్చి—నిన్నో యింటి దాన్ని చేశాం!... నీ సంసారం నువ్వు దిద్దుకొని పుత్ర పౌత్రాభివృద్ధితో—సుఖంగా వుండాలనేకదా మా కోరిక, పుట్టింటిపేరు నిలబెడతావని నమ్మేం. నీ సుఖంకోసం యిన్ని బాధలూ పడ్డాం...యింతకన్నా ఆడపిల్ల తల్లిదండ్రులు యింకేం చేయగలరు?...అంతవరకే పెద్దవాళ్ల బాధ్యత—ఆ తర్వాత భర్త దగ్గర మెసులుకోవడం, అతని అభిమానాన్ని, ప్రేమని పొందడం, జీవితం మూడు పువ్వులూ ఆరు కాయలుగా చేసుకోడం, నీ చేతిలో వుంది.—

ఆ హక్కు, యోగ్యత, బాధ్యత, స్వతంత్రం నీకు వచ్చింది. అందుకు తగ్గ తెలివితేటలూ, శక్తి నీకు భగవంతుడిచ్చేడు. నువ్వా చరించవలసిన విధి, మొయ్యవలసిన భారం యింతవుండగా, యిన్ని బాధ్యతలూ నీమీద వుండగా యిలాటి పనిచేస్తావా? యింకా చిన్నపిల్లవా? ఒకరిచేత చెప్పించుకుందికి?" అని కుమారి శతకం అంతా వర్ణించింది.

కాని.. ఏమీ అసలు బుర్రకే ఎక్కలేదు కమలకి—

"...అసలెలా ఆముక్క అనగలిగావు.. నీకు సిగ్గూ లజ్జా లేదూ? అంత యిష్టం లేకపోడానికి ఏమొచ్చింది? నీలో ఆ వూహే పుట్టలేదా? నీకా విషయమే అర్థంకాలేదా?...నువ్వలా ఎడ మొహం పెడ మొహం పెట్టుకు కూర్చుంటే ఆయనేమనుకుంటాడు? అసలు నీ కెలా నిద్రపట్టింది!" అని ఆమె తల్లి కొంచం విపులంగా.. అర్థమయేలా, చిన్న చీవాట్లతో సహా అనడం మొదలెట్టింది.

"..................."

"పోనీ నాతో చెప్పడానికి నీకేమిటి సిగ్గు!...చెప్పు... నువ్వెందుకలా చేసేవు.. వంట్లో బావులేదా? భయమా?...ఏమిటో చెప్పాలిగాని...అలా నీలోనువ్వు ఏదో అనుకుంటూ కూర్చుంటే ఎలా చెప్పూ?"

"..................."

"చెప్పమ్మా! నాతల్లివికదూ! నాదగ్గర దాచవలసిన పనేమిటి?" అని కూతురు గడ్డం పట్టుకు బ్రతిమాలింది తల్లి. కమల ఆశ్చర్యంతో తల్లివైపు చూసింది.

"ఏంలేందే ఏమిటమ్మా...చెప్పేది?..." అని అమాయకంగా అంది.

"ఏం లేదూ?...వాళకం బాగానే వుంది అయితే ఎందుకిదంతా జరిగింది?"

"ఏం జరిగింది యిప్పుడు?"

"అయ్యో! సింగినాదమా? యింకా నీకుబోధపడలేదా!... పోనీ...నీ మొగుడు ఎందుకు వెళ్లిపోయాడు. యివాళ యింకా వుంది కదా?"

"అదేమో నాకేం తెలుసు? నాతో ఏం చెప్పారా! చేశారా?"

"సరి! యింతకీ నిన్నడవలసినపనేముంది? మాగ్రహచారం యిలా వుండగా...నీకసలేమీ తలకెక్కలేదుకదా! యింకేం చేసేది!" అని కంటనీరు పెట్టుకుంది.

"ఎందుకమ్మా! అలా ఇదయి పోతావు? నువ్వన్నదేమిటో నాకేంబోధపడందే ఏం చెప్పను. అతను వెళ్లిపోయినంత మాత్రంలో ఎందుకింతలా యిదయిపోతున్నారు? ఏం పనుండి వెళ్లిపోయారో ఏమో!" అని కమల అంది.

"పనుంటే చెప్పివెళ్లరటే..నీకు తెలుసు..నిజం చెప్పమ్మా! ఎందుకిలా బాధపెడతావు?"

"నిజంగా నాకేం తెలీదమ్మా!"

"పోనీ యీ రెండు రోజులూ నీతో బాగానే వున్నాడా?"

"...పో అమ్మా!...నువ్వు మరీని..." అని గునిసింది.. ...మొహం కందగడ్డలా చేసుకొని—

"అందికే వచ్చింది...అదుగో...చూసినవాళ్లు చెప్పలేదూ? ...నీవించే అతను వెళ్లిపోయాడు—యిలాగే మొండితనం చేసి వుంటావు!"

"...నానించా!..." అని ఆశ్చర్యంగా కమల అడిగింది.

"అవును—నీనించే—నువ్వు, ఆయన్ని..దగ్గరికి రానివ్వలేదటగా...ఏం తల్లీ! నాతో నిజం చెప్పు...నీకొచ్చిన కష్టంఏమిటీ!.. కట్టుకున్న భర్తతో అలా చెయ్యొచ్చా...అందికే కోపంవచ్చి వెళ్లిపోయాడు..."

ఈ మాటలు విని కమల పకపకా నవ్వింది.

"నవ్వుతావేమిటే—వెర్రి పిల్లా!"

"—లేకపోతే ఏమిటమ్మా! నువ్వనేది!...నీకిదంతా ఎవరు చెప్పేరు?"

"ఎవరు చెప్పేది ఏమిటీ? తెలీదు నీ వాళకం చూస్తే!"

"నిజంగా నామొహం చూసే అంటున్నావా అమ్మా యీ మాటలు? లేక ఎవరో చెబితే అంటున్నావా?"

"ఎవరయినా ఏమీ లేకపోతే ఎందుకు చెబుతారు?"

"ఎవరికయినా ఏం తెలుస్తుందమ్మా! లోపల ఏం జరిగిందో? పుత్తి అబద్ధాలుగాని..."

"చూసిన వాళ్లే చెబుతున్నారమ్మా!"

"ఏం చూశామని చెప్పేరమ్మా?"

"...ఈ రెండు రాత్రులూ అతన్ని దగ్గరకి నువ్వు రానివ్వలేదని_అతను వచ్చినా నువ్వు మాటాడలేదని_"

"ఎవరమ్మా ఆ చూసినవాళ్లు!"

"ఎవరోలే.. ఎవరయితేనేం! నీమంచి కోరేకదా చెప్పేది!"

"అలా చూడవచ్చా అమ్మా! పెద్దవాళ్లయివుండి!"

"సరి నీతులకేంలే! అదో ఆచారం! యివాళా? విన్నానా? అనాదినుండీ వస్తూంది. దానికేంగాని.. వాళ్లు చెప్పింది నిజమేనా?"

"అయితే వాళ్లు తెల్లవార్లూ చూస్తూనే వున్నారా అమ్మా?"

"బావున్నాయి నీ మాటలు. ఒకటి అడుగుతే మరొకటి చెబుతున్నావు_ఎంత వరకూ చూశారో ఏమిటో నేనడగలేదు!" అని జడవేయడం పూర్తిచేసి_జడగంటలు బిగించి తలలో పువ్వులు ముడిచింది.

"కనుక్కో అమ్మా!..." అని పకపక నవ్వుతూ.. జడగంటలు ముందుకి లాక్కుని విసురుగా.. లేచి...సిగ్గుతో అక్కడి నుండి లేచి పారిపోయింది కమల.

ఆ జవాబులో అర్థం పూర్తిగా గ్రహించలేకపోయింది కమల తల్లి. కాని, కూతురు కులాసా చూసి నవ్వుకుంది.

"అదేంవిటే అలా వెళ్లిపోతావు. అడిగిన సంగతి చెప్పకుండాను.. వెర్రిపిల్ల! ఏం తెలీదుకదా! ఎలా కాపురం చేస్తుందో ఏమో!" అని తనలో అనుకుంది కమల తల్లి. తతిమ్మా వాళ్లెవరూ గ్రహించలేక పోయినా కూతురిలో మార్పు, ఆమె ప్రవర్తన, చూసి కొంచం నిబ్బర పడింది. అమ్మలక్కలన్న వాటిలో ఏమాత్రం నిజంవుందో గ్రహించింది. అయినా పూర్తిగా అనుమానం పోలేదు....

అందుకనే భర్తతో కూడా ఆ విషయం చెప్పింది. అతడు కూడా మొదట్లో గాభరా పడకపోలేదు. తమ వల్లే తప్పుందో, లేక అందరూ అంటున్నట్టు కూతురే ఏం తెలివి తక్కువగా ప్రవర్తించిందో, ఏమిటి కారణమో అని భయపడుతూనే వున్నాడు. అంతలోనే భార్యకూడా అలాగే అనుమానపడి చెప్పవలసినదంతా చెప్పి_

"వెళ్లండి..వాళ్లింటికి వెళ్లి కారణం ఏమిటో కనుక్కోండి. పిల్లవల్ల ఏదయినా తప్పుంటే_చిన్నది, అమాయకురాలని చెప్పి బ్రతిమాలి తీసుకురండి ఏం చేస్తాం!" అని అంది.

"నేనూ అదే అనుకుంటున్నా యివాళే బయలుదేరి వెళ్లి బ్రతిమాలుకుని తీసుకు వస్తాను!"

ఇలాగని అతను అల్లుని దగ్గరికి వెళ్లి తీసుకురావడానికి ప్రయాణమయినాడు. అతనూ యిలా గుమ్మం దిగుతూండే సరికి పోస్టువాడు ఎదురయేడు.

పోస్టువాడు ఇచ్చిన ఎక్స్‌ప్రెస్ వుత్తరం అందుకుని అది అల్లుడి దగ్గరినుండే వచ్చిందని చూడగానే గ్రహించాడు, కమల తండ్రి, గుండె దడదడ లాడుతూండగా ఆతృతతో విప్పి చదివాడు.

తొడిగిన చెప్పులు వదిలేసి లోపలకువచ్చి కుర్చీలో కూర్చున్నాడు. ఉత్తరం భార్యకు అందిస్తూ..."ఎంతపని చేశాడు" అని నవ్వుతూ అన్నాడు.

సాగనంపడానికి ద్వారం వరకు వచ్చిన అతని భార్యకేమీ అర్థంకాలేదు. "ఏమండీ ఏమయింది! మళ్లీ కూర్చుండి పోయారేమిటి?" అని తొందరగా అడిగింది.

"అల్లుడి దగ్గరనుండే వుత్తరం వచ్చింది!..." అని నవ్వుతూనే అన్నాడతను.

"అల్లుడి దగ్గరనుండా ఏంరాశాడేమిటి? ఎందుకలా వెళ్లిపోయినట్టు!" అని ఆతృతతో అడిగింది.

"...మరేంలేదు .విన్న అతడలా బజారువేపు వెళ్లేసరికి అతని పేర టెలిగ్రాం వచ్చిందట...ఈ రోజున ఇంటర్వ్యూకి రమ్మని ఆర్డర్లు వచ్చేయని, అంచేత వెంటనే బయలుదేరి రమ్మని వాళ్ల నాన్నగారు ఆ టెలిగ్రాం యిచ్చారట. ఆ సంగతి మనతో చెప్పవెళ్లడానికి టైములేక అలాగే వెంటనే బండిలో వెళ్లిపోయాడట...చెప్పకుండా వెళ్లిపోతున్నందుకు గాభరా పడవద్దని, ఏమీ అనుకోవద్దని, ఉత్తరం వ్రాసేడు...అది అసలు విషయం!"

"అబ్బ! ఎంతపని చేశాడు ఇంటిల్లపాదీ బెంగపెట్టుకు చచ్చాం!"

"వాళ్ల మాటలూ, వీళ్ల మాటలూ విని నన్ను భయపెట్టి చంపావు! చూశావా.. ఏమీ ఎరగని దాన్ని కమలని నానా మాటలూ అన్నావు!"

"వీళ్ల నోళ్లు పడిపోనూ, ఎన్నెన్ని చిలవలూ, పలవలూ, కలిపించి చెప్పేరండీ!...నిజంగా యింకా నాకు భయం పోనే లేదు. అయినా కమలని అడిగినపుడు నా అనుమానం పోయిందను కోండి. అయినా చిన్నపిల్ల, కణాయించి అడిగితే, ఏం చెబుతుంది. పాపం!.. ఇంతకీ నేనేం చేసేది? ఎటుంచి ఏమొస్తుందో అన్న భయం కొద్దీ మీతో చెప్పేను.

"నువ్వు మాత్రం ఏం చేస్తావులే పాపం!...అతడలా అక స్మాత్తుగా వెళ్లిపోయేటప్పటికి నాకూ భయం వెయ్యక పోలేదు... ఏం జరిగింది చెప్మా! అని. కాకీ వాలింది...పండూ పండింది అన్నట్టు-మనపిల్ల అదృష్టవంతురాలే; కార్యం కాగానే ఉద్యోగం కూడా దొరికింది. యింక వాళ్ల కాపురం వాళ్లు చేసుకుంటారు."

"అమ్మా...కమలా..తల్లీ.." అని ఆనందం పట్టలేక పిలవబోయేసరికి అంతవరకూ తలుపుచాటునుండి అంతా వింటూ చూస్తున్న కమల తుర్రుమని లోపలికి కిలకిల లాడుతూ పారి పోయింది.



# విద్యుచ్ఛక్తి సరఫరా

కడప జిల్లా, కమలాపురం తాలూకాలోని దిగువ పేర్కొన్న గ్రామాలకు 1962 జూలైలో విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు:—

(1) దాదిరెడ్డిపల్లి, (2) దేవరసుపల్లి, (3) చిన్నపుట్ట, (4) బెల్లారెడ్డిపల్లి.

తూర్పు గోదావరి జిల్లాలోని రంగాపురం గ్రామానికి కూడా ఈ నెలలో విద్యుత్ సౌకర్యాలను విస్తరింప జేశారు.

??????

# ప్రశ్నలు - సమాధానాలు

!!!!!

శ్రీ కె. కూర్మనాథస్వామి,
శ్రీకాకుళం.

ప్రశ్న: శ్రీకాకుళం జిల్లాలోని కళింగపట్నం రేవును అభివృద్ధి పరచనున్నట్లు తెలిసింది. ఇది నిజమేనా? ఈ పని ఎప్పుడు జరుగుతుంది?

సమాధానం: విశాఖపట్నం హార్బరును అభివృద్ధి పరచడానికి పూర్వం కళింగపట్నం రేవుకు కొద్దిగా ప్రాముఖ్యత వుండేది. 1952 వ సంవత్సరంనుంచి అక్కడ వర్తక వాణిజ్యాలు జరగడం లేదు. ఏదైనా రేవును అభివృద్ధి పరచడం, ఆ రేవు ద్వారా వర్తక వ్యాపారాలకు లభించే ప్రోత్సాహంపై ప్రధానంగా ఆధారపడివుంటుంది. వర్తక వాణిజ్యాల అవసరాల దృష్ట్యా రేవులను అభివృద్ధి పరచడం జరుగుతుంటుంది. వర్తక వాణిజ్యాలకు అవకాశం లేకుండా రేవుల అభివృద్ధిపై ఖర్చు చెయ్యటం వృధాయే అవుతుంది.

ఆంధ్ర ప్రదేశ్ లోని రేవులను మొత్తంగా అభివృద్ధి పరచే విషయం పరిశీలనలో వుంది.

కుమారి రమాతులసీదేవి,
దెందులూరు, (పశ్చిమ గోదావరి జిల్లా)

ప్రశ్న: 1962 మార్చిలో జరిగిన స్కూల్ ఫైనల్ పరీక్షలో హిందీలో కనీసం ఎన్ని మార్కులు పొందినవారిని ఉత్తీర్ణులను చేశారు? 1963 మార్చిలో జరిగే పరీక్షలో కనీసం ఎన్ని మార్కులు పొందాలి?

సమాధానం: తృతీయ భాషగా హిందీ చదవడం తప్పనిసరి అయిన అభ్యర్థుల విషయంలో తృతీయ భాష హిందీకి కనీసం 15 శాతం మార్కులు నిర్ణయించబడినవి. 1962 మార్చిలో జరిగిన ఎస్.ఎస్.ఎల్.సి. పబ్లిక్ పరీక్షలో, ఇతరత్రా అర్హులై వుండి, హిందీలో ఏడు అంతకంటె ఎక్కువ మార్కులు పొందిన అభ్యర్థులు అర్హులుగా ప్రకటించబడినారు.

హిందీ మినహా మొత్తం మీద 400 అంతకంటే ఎక్కువ మార్కులు పొంది, ఇతరత్రా అర్హులైన అభ్యర్థుల విషయంలో మరో రెండు మార్కులవరకు రాయితీ ఇవ్వబడినది.

1963 మార్చిలో జరిగే ఎస్. ఎస్. ఎల్. సి. పబ్లిక్ పరీక్షకు తృతీయ భాష హిందీలో ఉత్తీర్ణత పొందడానికి 15 శాతం మార్కులు నిర్ణయించబడినవి.

శ్రీ డి. వెంకట్రామయ్య,
ఉప్పలూరు. (కావలి తాలూకా)

ప్రశ్న: ఇదివరకే ఉద్యోగాలలో నున్నవారు అంతకంటే మంచి ఉద్యోగాల కొరకు తమ పేర్లను ఉద్యోగసాధక కేంద్రాలలో నమోదు చేయించుకోవచ్చునా?

సమాధానం: కేంద్ర లేదా రాష్ట్ర ప్రభుత్వ శాఖలలో పనిచేస్తున్న వారు అంతకంటే మంచి ఉద్యోగాల కొరకు ఉద్యోగసాధక కేంద్రాలలో తమ పేర్లు నమోదు చేయించుకోవచ్చు. అయితే అందుకు వారు తమ కార్యాలయాధిపతులనుంచి పొందిన "నో ఆబ్జెక్షన్ సర్టిఫికెట్ల"ను చూపవలసి వుంటుంది.

శ్రీ రాయవరం లక్ష్మీపతి.
హన్మకొండ.

ప్రశ్న: ప్రభుత్వం నియమించిన తెలుగు లిపి సంస్కరణ సంఘం సభ్యులు ఎవరు? వారి సిఫార్సులు ఏమిటి? వాటిని ఎంతవరకు ప్రభుత్వం ఆమోదించి అమలు పరిచింది?

సమాధానం: లిపి సంస్కరణ సంఘంలో ఈ క్రింది వారు సభ్యులు:—

శ్రీ ఎం. సోమశేఖర శర్మ, శ్రీ ఆర్. అనంతకృష్ణ శర్మ, విద్వాన్ శ్రీ కె. సుబ్బరామప్ప, డా. జి. వి. కృష్ణారావు, శ్రీ పి. రామస్వామి నాయుడు, శ్రీ పి. రామాచార్యులు, శ్రీ కె. లక్ష్మణశాస్త్రి (కార్యదర్శి). ఈ సంఘం తుది నివేదికను, ప్రజాభిప్రాయం కొరకు, 1961 డిశంబరు 11వ తేదీ ఆంధ్ర ప్రదేశ్ గెజెటు (మొదటి భాగం) అసాధారణ సంచికలో ప్రకటించారు. అభిప్రాయాలు ఇంకా అందవలసివున్నది.

శ్రీ భాస్కరశేషుకుమార్,
కంచెర్లపాలెం, (తెనాలి తాలూకా)

ప్రశ్న: మద్రాసునుంచి ఆంధ్ర విడివడినప్పటినుంచి ఎంత విస్తీర్ణంలో నీటి పారుదల జరిగిందీ జిల్లాలవారీగా వివరాలు తెలుపుతారా?

సమాధానం: అవిభక్త మద్రాసు రాష్ట్రం విభజన తరువాత అభివృద్ధి పరిచిన అంటే కొత్తగా సేద్యం చేసిన భూముల విస్తీర్ణం జిల్లాల వారీగా ఈ క్రింది విధంగా వుంది:— దిగువ పేర్కొన్న భూములు వరి, పప్పు ధాన్యాలు పండించేవి:—

| పథకం పేరు | | అభివృద్ధి పరిచిన భూమి విస్తీర్ణం |
|---|---|---|
| **శ్రీకాకుళం జిల్లా** | | |
| 1. సూరపాడు ఆనకట్ట పథకం | .... | 876 ఎకరాలు |
| 2. నాగావళికుడి కాలువ | .... | 1561 ,, |
| 3. సీతానగరం ఆనకట్ట | .... | 1255 ,, |
| 4. వోనిగడ్డ ఆనకట్ట పథకం | .... | 429 ,, |
| | | 4121 ఎకరాలు |
| **విశాఖపట్నం జిల్లా** | | |
| 1. రావనపల్లి రిజర్వాయరు పథకం | .... | 2560 ఎకరాలు |
| 2. సరుగుడుగడ్డ ఆనకట్ట పథకం | .... | 251 ,, |
| 3. గంభీరం రిజర్వాయరు పథకం | .... | 530 ,, |
| 4. గారడగడ్డ ఆనకట్ట పథకం | .... | 450 ,, |
| 5. బొబ్బిలిగడ్డ పథకం | .... | 225 ,, |
| 6. కొండల అగ్రహారం పథకం | .... | 575 ,, |
| | | 4591 ఎకరాలు |

శ్రీ కంచి సుబ్బరామయ్య,
గుత్తి, (అనంతపురం జిల్లా)

ప్రశ్న: గుత్తి భూములకు నీటి పారుదల చెయ్యడానికై ఎగువ కాలువ జలాలను గుత్తి చెరువుకు సరఫరా చేస్తారా? లేక నేరుగా కాలువనుంచే ఈ భూములకు నీరు ఇస్తారా? దయచేసి తెలుపగలరు.

సమాధానం: గుత్తి భూములకు గుంతకల్లుశాఖ నుంచి జలాలను సరఫరాచేస్తారు. దీనిని ఎగువకాలువ పథకం రెండవదశ కార్యక్రమంలో చేర్చడం జరిగింది. గుంతకల్లు శాఖా జలాలు చివరన వరుసగా అనేక చెరువులలో కలుస్తాయి. ఆఖరున గుంతకల్లు చెరువుకు ఈ నీరు లభిస్తుంది. గుత్తి చెరువు క్రింద వున్న భూములన్నింటికీ ఈ చెరువు కాలువ నీటి పారుదల చేస్తుంది.

ప్రశ్న: టి. బి. పి. ఎగువ కాలువ పథకం ప్లాను ఎక్కడ లభ్యమవుతుంది?

సమాధానం: టి. బి. పి. ఎగువ కాలువ పథకం గుంటకల్లు శాఖ

ప్లానులను స్థిరపరచలేదు. మొదటి దశ ప్లానులు, పబ్లిక్ వర్క్సు శాఖ స్థానికాధికార్లు అందరివద్ద లభిస్తాయి.

శ్రీ ఎం. గోవిందరెడ్డి,
ఇంగలదహల్ పోస్టు, (కర్నూలు జిల్లా)

ప్రశ్న: కర్నూలు జిల్లా, ఆలూరు తాలూకా అస్పరి పంచాయతీ సమితిలోని ఇంగల దహల్ గ్రామానికి విద్యుచ్ఛక్తి సరఫరాకై పథకాన్ని మంజూరు చేశారా? అయినట్లయితే దానిని ఎప్పుడు ప్రారంభిస్తారు?

సమా: ఇంగలదహల్ తదితర గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరాచేసే పథకాన్ని 1960-61 వ సం. లో మంజూరు చేశారు. పథకం అంచనావ్యయం రూ. 2,83,900/- పథకానికి డబ్బు లభించడాన్ని బట్టి తరువాత పనులను చేపట్టడం జరుగుతుంది.

బి. ఎస్. ప్రసాద్
పూసపాటి రేగ

ప్రశ్న: 1961 అక్టోబరులో జరిగిన 7వ ఫారం మల్టీ పర్పస్ పరీక్షకు ఎంతమంది అభ్యర్థులు హాజరయ్యారు? మన రాష్ట్రం లో హయ్యర్ సెకండరీ పాఠశాలలు ఎన్నివున్నాయి?

సమా: 1961 అక్టోబరులో జరిగిన హయ్యర్ సెకండరీ పరీక్షకు 3,250 మంది హాజరయ్యారు. 805 మంది ఉత్తీర్ణులయ్యారు.

1961 మార్చి 31వ తేదీ నాటికి రాష్ట్రంలో గల హయ్యర్ సెకండరీ, బహుళార్థ సాధక పాఠశాలల సంఖ్య 140.

శ్రీ డి వి. నారాయణ
చిన్నబాదాం, శ్రీకాకుళం జిల్లా

ప్రశ్న: బ్లాకు ప్రాంతంలో తెరిచే పశు చికిత్సాలయాలను బ్లాకు ముఖ్య కార్యస్థానంలో మాత్రమే నెలకొల్పుతారా? ప్రజాసహకారం ఇతర సదుపాయాలు లభించే మరేదైనా ఇతర ప్రదేశంలో ఇట్టి చికిత్సాలయాలను స్థాపించడానికి వీలుంటుందా?

సమా: బ్లాకు ముఖ్య కార్య స్థానంలో కాకుండా ఇతర ప్రదేశంలో పశు చికిత్సాలయాలను నెలకొల్పవచ్చు. అయితే అందుకు దిగువ నియమాలను పాటించడం అవసరమవుతుంది:-

(1) ఆ ప్రాంతానికి చుట్టూ అయిదు మైళ్లలోపుగా పశు చికిత్సాలయం వుండకూడదు. ఎట్టి పశు చికిత్స సదుపాయాలూ అందుబాటులో వుండకుండా వుండాలి.

(2) పశుచికిత్సాలయం తెరువవలసిన అవసరమున్నంతగా ఆ ప్రాంతంలో పశువుల సంఖ్య వుండాలి.

(3) భవనాలను నిర్మించడానికి భూమినీ, రొక్కాన్నీ విరాళంగా ఇవ్వడంద్వారా, ప్రజలు చికిత్సాలయ స్థాపనలో పాల్గొనాలి.

(4) తమ వంతు విరాళాలను భరించడానికి స్థానిక సంస్థలు సమ్మతించాలి.

(5) పశుపోషణశాఖ ప్రణాళికా బడ్జెటులో తగినంతగా కేటాయింపు జరిగి వుండాలి.

శ్రీ ఎం. సత్యనారాయణమూర్తి
పాలకొల్లు, (పశ్చిమ గోదావరిజిల్లా)

ప్రశ్న: ఉన్నత, మాధ్యమిక పాఠశాలలలో హిందీ పండితులకు అర్హతలు ఏమిటి?

ప్రభుత్వోద్యోగులకు నిర్ణయించిన హిందీ పరీక్షకు పాఠ్య ప్రణాళిక ఏది? ఈ పరీక్షకు సమానమైనదిగా, ఏదైనా ఇతర సంస్థలు నిర్వహించే పరీక్షలను ప్రభుత్వం పరిగణించినదా?

సమా: ఉన్నత, మాధ్యమిక పాఠశాలలలో హిందీ పండితులకు అర్హతలు ఇవి:-

ఉన్నత పాఠశాలలు

(అ) ఎస్. ఎస్. ఎల్. సి., హెచ్. ఎస్. సి. లేక మెట్రిక్.

(ఆ) ప్రభుత్వ పరీక్షల కమీషనరు జారీచేసిన సీనియర్ హిందీ పండితుల శిక్షణ సర్టిఫికెటు.

మాధ్యమిక పాఠశాలలు

(అ) మూడవ ఫారం,

(ఆ) ప్రభుత్వ పరీక్షల కమీషనరు జారీచేసిన జూనియర్ హిందీ పండితుల శిక్షణ సర్టిఫికెటు.

ప్రభుత్వోద్యోగులకు నిర్ణయించిన హిందీ పరీక్ష పాఠ్య ప్రణాళికను సిద్ధం చేస్తున్నారు. ఇప్పటి వరకు దక్షిణభారత హిందీ ప్రచార సభవారు నిర్వహించే రాష్ట్రభాషా పరీక్షను మాత్రమే ప్రభుత్వోద్యోగులకు నిర్ణయించిన తృతీయ భాష పరీక్షకు సమానమైనదిగా పరిగణించడం జరిగింది.

# మహాకావ్యము - ప్రబంధము

"సుప్రసన్న"

ప్రబంధములన్నది ఆంధ్రవాఙ్మయమున ప్రత్యేకముగ నెలకొన్న యొకానొక శాఖయనియు, ఈ వాఙ్మయ ప్రక్రియ తెలుగు భాషలో పరమ రమ్యమైన వికాసముపొందిన దనియు విమర్శకుల విశ్వాసము. ఈ ప్రబంధమన్న నామము పెద్దనార్యోపజ్ఞకమైన మనుచరిత్రమునకు ప్రథమతః వర్తిల్లుచున్నది. మహాప్రభువైన రాయలవారి యుగమున వెలువడిన గ్రంథములు తద్యుగమునను సరించిన యనేక మంది కవుల కృతులును ఈ ప్రబంధ మార్గమునకు చెందినవే యగుచున్నవి.

పూర్వాంధ్ర వాఙ్మయమున ప్రధానముగా రెండు దశలున్నవి. ఒక దశయందు ప్రధానముగా సంస్కృత భాషయందలి పురాణేతిహాసములను తెలుగించుట యయినది. రెండవ దశయందు పురాణేతి హాసముల నాధారముగా స్వతంత్రమైన కావ్యనిర్మాణ ప్రక్రియ యున్నది. బసవపురాణ, నాసికేతోపాఖ్యానాదులా కాలమునను: వెన్నెల కంటె సూరన్న రచనయైన విష్ణుపురాణాధిక మీకాలమున రచింపబడినను వీని నపవాదములుగా చెప్పవలయును. ఒకానొక కాలమున ప్రధానముగా నభివ్యాప్తమైన లక్షణమిదియని చెప్పునప్పుడు తత్కాలమునందు ప్రాధాన్యములేని యనేకములైన విషయములు చెప్పుట కుదురదు. అందువలన బసవ పురాణాదులు, విష్ణుపురాణాదులు ఆయా కాలములకు చెప్పబడిన ప్రధాన లక్షణములకు వ్యతిరేకములైన లక్షణములు కలిగియున్నవని యంగీకరించి వీనికన్న అనేకములైన ప్రధానకృతులు పరిశీలించి తత్కాలము యొక్క ప్రధాన లక్షణ మిట్టిదని చెప్పబడినది.

ఈ తెలుగించుటయన్న ప్రక్రియకూడ విశిష్టమైనదే. ఆ యుగమున భారతాదులు పొందిన భాషాపరివర్తనము వాని యొక్క పరివర్తితత్వము కానిపింపకుండ చేయునట్టిది. అది ఆయాకవుల యొక్క స్వకల్పితేతివృత్తమైన మహాకావ్యమువలె సాగిపోవుచుండును. అందుచేతనె తెలుగుభాషలో భారత భాగవతముల కర్తలు ఋషితుల్యులైనారు. వారి కావ్యములు పూజనీయములైనవి.

ఈ కాలము ననుసరించిన కాలమునందే ఈ ప్రబంధములు వెలువడినవి. వీని సంఖ్య వందలలోనున్నది. ఈ ప్రబంధమన్నది సంస్కృతభాషలో ప్రచురముగానున్న కావ్యశబ్దమునకు పర్యాయ పదమా? లేదా తద్భిన్నమైన యొకానొక కవితా స్వరూపమును నిర్దేశించునదా? ఇది ఇదమిత్థమని చెప్పుటకు వీలుకల్గని జటిలమైన సమస్య. సంస్కృతమున రామాయణ భారతాదులైన ఇతిహాసములున్నవి. అష్టాదశ పురాణములున్నవి. రఘువంశాదులు కావ్యములు, మేఘ సందేశాది ఖండకావ్యములు, శాకుంతలాది నాటకములు, రత్నావళ్యాది నాటికలు, ప్రకరణములు, ముక్తకములు ఆఖ్యాయికలు, కథలు ఈ విధముగా ననేక విధములైన సాహిత్య ప్రక్రియలున్నవి. వీనియన్నింటికి సంస్కృతభాషలో సుస్పష్టమైన స్వరూపవివేచన జరిగినది. ఒక్కొక్క ప్రక్రియ ఒకానొక ప్రత్యేక స్వరూపములో నుండును. ఒకానొక లక్షణము అన్నింటిలోకూడా నుండవచ్చును.

సంస్కృతాలంకారికులు పురాణములను కావ్యపరిధిలో చేర్చలేదు. రామాయణ మహాభారతములు పురాణములు వంటివేయైనను, వానియందలి కావ్యలక్షణ సమన్వయమువలన, రసభావాదుల నిర్మాణశక్తి వలన నవి మహాకావ్యములైనవి. ఇక కావ్యములు వారనేక విధములుగా విభజించిరి. భామహుడు—

శబ్దార్థౌ సహితౌ కావ్యం, గద్యం పద్యంచ తద్ద్విధా
సంస్కృతం ప్రాకృతం చాన్యదపభ్రంశ ఇతి త్రిధా
వృత్తదేవాది చరిత శంసిచోత్పాద్యవస్తుచ
కలాశాస్త్రాశ్రయం చేతి చతుర్ధాభిద్యతే పునః

సర్గబంధోఽ భినేయార్థం తథై వాఖ్యాయికాకథే
అనిబద్ధంచ కావ్యాది తత్పునః పంచధోచ్యతే
(కావ్యాలంకారము 1_16,17, 18)

కావ్యము నాల్గు విధములుగా విభజించినాడు.

ఒకటి: గదపద్య భేదమున; రెండు: సంస్కృత ప్రాకృతాప భ్రంశ భేదమున; మూడు: ఇతి వృత్తము ననుసరించి వృత్త దేవాదిచరితము, ఉత్పాద్యము, కలాశ్రయము, శాస్త్రాశ్రయమునని; నాల్గు: స్వర్గబంధమని, అభినేయార్థములని, ఆఖ్యాయిక కథలనియు, అనిబద్ధములనియు. ఈ భాగము చాల సూక్ష్మ పరిశీలనచేత చేయ బడినది. గద్యపద్యభేదమున కావ్యము రెండువిధములుగా భామకుడు చెప్పగా ఆచార్యదండి "గద్యం పద్యంచ మిశ్రంచ తత్ త్రిధైవ వ్యవస్థితమ్" అని మూడు విధములుగా విభాగముచేసియున్నాడు. వామనుడు నబద్ధానిబద్ధ భేదము వలన రెండు విధములుగా పద్యమును విభజించినాడు; "పద్యమనేక భేదం తదనిబద్ధం నిబద్ధంచ" (కా. సూ. వృ. 1_3_16,17) అని.

సంస్కృతాలంకారికులెవ్వరును ప్రబంధమును ప్రత్యేక సాహిత్య ప్రక్రియగా పేర్కొని యుండలేదు. ప్రబంధమన్న శబ్దమే వారెరుగరవి మనము చెప్పజాలము. ధ్వన్యాలోకమునందు మహాకావ్యమనే మహాప్రబంధముగా వ్యవహరించియున్నాడు. 'సందర్భేషు దశరూపకం శ్రేయః' అన్నచోట ఆచార్య వామనుడు వృత్తియందు సందర్భేషు అన్నచోట ప్రబంధేషు అని యర్థము చెప్పెను. ఇది మహాకావ్యమునకు చెందిన యర్థమే. సర్గబంధము నందలి బంధశబ్దమే పృథక్ప్రయోగమునందు ప్రబంధముగా మారి యుండవచ్చును. విశ్వనాథుడుకూడ ప్రబంధమును కావ్య సామాన వాచిగావాడి యున్నాడు.

మొత్తముమీద సంస్కృతాలంకారికుల కావ్యవిభజనము నందు ప్రబంధమన్న సాహిత్య ప్రక్రియ వేరుగా గోచరింపదనుట నిర్వివాదాంశము. సంస్కృతమునందలి సాహిత్య ప్రక్రియలు ఈ విధముగా విభజింప బడవచ్చును. +

నిబద్ధ కావ్యములే అనిబద్ధకావ్యముల కంటె ప్రశస్తి కలవి.

"అసంకలిత రూపాణాం కావ్యానాం నాస్తి చారుతా
న ప్రత్యేకం ప్రకాశంతే తైజసాః పరమాణవః"

అని వామనుడు చెప్పెను. అందువలననే ముక్తకములకు పరదేశములో నున్నట్లు భారత దేశీయ సాహిత్యములో ప్రశస్తి కాదు. రసభావ పరిపుష్టమైన సాహిత్య ప్రక్రియ మనదేశములో నున్నది. ఈ ప్రక్రియయే మహాకావ్యము. ఈ విషయమే కావ్య మీమాంస యందిట్లు చెప్పబడినది_

ముక్తకే కవయోనంతాః సంఘాతే కవయశ్శతమ్
మహాప్రబంధేషు కవిరేకో, ద్వౌ; దుర్లభాస్త్రయః

కాళిదాసు విక్రమోర్వశీయములో భాస సౌమిల్లకాదుల రూపకములనుకూడ ప్రబంధములనియెను. అనేకాలంకారికులు కూడ ఈ శబ్దమును నిర్దిష్టమైన యొకానొక యర్థమున ప్రయోగింపలేదు. తెలుగు కవులుకూడ ఒక నిర్దిష్టార్థమున దీని నుపయోగించినట్లు తోచదు. తిక్కన్నగారు భారతావతారికలో ప్రబంధమండలి యని ప్రయోగించిరి. నన్నెచోడుడు ప్రబంధమని వాడెను. ఎఱ్ఱాప్రగడకు ప్రబంధ పరమేశ్వర బిరుదమేయున్నది. "అభ్యుదయ

---

+ కావ్యము

- గద్యము
  - కథ
  - ఆఖ్యాయిక
- పద్యము
  - నిబద్ధము
    - ఇతిహాసము
    - సర్గబంధము
  - అనిబద్ధము
    - ముక్తకాదులు
- చంపువు
  - చంపూకావ్యము
  - అభినేయము
    - దశరూపకములు

పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన మహా ప్రబంధమునకు" అని కావ్యారంభము చేయుట మన కవులకు చాల పరిమితమైన విషయము. *

ఈ విధముగా చూచినప్పుడు ఆంధ్రమహా కవు లందరును తమ కావ్యములన్నింటిని ప్రబంధములుగానే వ్యవహరించిరి. సంస్కృతాలంకారికులెట్లు ప్రబంధమును కావ్య పర్యాయముగానే వాడినారో అట్లే తెలుగు కవులుకూడ కావ్యములుగానే వాడి యున్నారు.

ఆంధ్ర లాక్షణికులలో కూడ నెవ్వరికిని ఈ ప్రబంధమన్నది వేరొక ప్రక్రియయన్న యూహ యున్నట్లు కన్పడదు. వారి దృష్టిలో ఈ రెండు పర్యాయ పదములే యగును. ఆంధ్రలాక్షణికులలో తొలివాడైన విన్నకోటపెద్దన తన కావ్యాలంకార చూడామణియందు ప్రబంధలక్షణము చెప్పుచు

" ఇట్లు కవికృతమైన: కావ్యత్రయంబు
గద్య పద్య విమిశ్ర సంపాద్యమందు
నగముఖాద్యష్ట దశ వర్ణముల చేత
బరగు నదియును భవ్య ప్రబంధమనగ "

" పురవారాశి మహీధరర్తు శశభృత్పూషోదయోద్యాన పు
ష్కరకేళీ మధుపాన మోహన వియోగ క్షేమయాన స్వయం
వర పుత్రోత్సవ మంత్ర దూత్యరణ దోర్వైక్రాంతి సంకీర్తనా
కర మష్టాదశ వర్ణనాన్వితము తత్కావ్యంబు భవ్యంబిలన్ "

—అని పేర్కొనుచు ప్రబంధమును కావ్యమనిచెప్పుచు 'తత్' శబ్దముచేత నిశ్చయముగా నారెంటి నడుమన భేదము సూచించి యున్నాడు. దండి పూర్వాలంకారికులలో యష్టాదశ వర్ణనలు చెప్పియున్నాడు. అగ్ని పురాణములో కూడా అష్టాదశ వర్ణనలు చెప్పబడినవి. రుద్రటుడు వర్ణనలను కావ్య స్థానములని చెప్పెను, హేమచంద్రుడు వర్ణనలను ఉభయ వైచిత్ర్యములందు చేర్చెను.

విన్నకోట పెద్దన దండి ననుసరించి పదునెనిమిది వర్ణనలు చెప్పియున్నాడు. సాహిత్య దర్పణమున వర్ణనల సంఖ్య పెరిగినది. అప్పకవీయమున కూడ వర్ణనల సంఖ్య పెరిగినది. ఈ కావ్యమువలన సంస్కృత కావ్య సహజము కాని యేదో యొక లక్షణము తెలుగు లాక్షణికులేమియు ప్రబంధమునకు చెప్పలేదని మనము నిశ్చయముగా చెప్పవచ్చును.

ఈ ప్రబంధమును గూర్చి ప్రధానముగా మూడు వాదము లున్నవి. 1. ప్రబంధము తెలుగు భాషలో తద్భాషా పరిణామము ననుసరించి 16వ శతాబ్దము వరకు వచ్చిన మహాకవుల ప్రతిభాలక్షణముల విచిత్ర శక్తులు ప్రాతిపదికలుగా నది యొక ప్రత్యేక శాఖ వలె యుద్గమించి పెంపొందినది. ఏతత్కవితా బంధము సంస్కృతములోని మహాకావ్యమున కంటె విశిష్టమైనది. కొన్ని విషయములలో భిన్నమైనది కూడ. తిక్కనగారు విరాట పర్వము తీర్చినతీరు, ఎఱ్ఱాప్రగడ హరివంశములోని శిల్పవైశిష్ట్యము నాచన సోముని వక్రోక్తి నైపుణ్యము పాదుగా శ్రీనాథుని నైషధము మేలుబంతిగా ఈ మహా ప్రబంధముల రచన సాగినది. ఇది మొదటి మతము.

2. ప్రబంధము యొక్క రచన నన్నెచోడుని కుమార సంభవముతో ప్రారంభమైనది. కన్నడ భాషలోని యనేక కావ్య సంప్రదాయములు తెలుగులోనికి వచ్చినవి. ఈ సంప్రదాయములను జీర్ణము చేసుకొని తెలుగు కవులు క్రొత్తగా ప్రబంధము నిర్మాణము చేసినారు.

3. మూడవ వాదము వేరొక పద్ధతికి చెందినది. కావ్యము వేరు. ప్రబంధము వేరు. కావ్యము లన్నియు కథా ప్రధానములైనవి. మహా కావ్యములన్నియు యొకానొక కథ యొక్క సుచరిత పథమున సాగును, కథాశ్రితములైన కావ్యము లగుట వలన నివి రస ప్రధానములు. కాళిదాసాదుల రచన లన్నియు మహాకావ్యములు. ప్రబంధములు కావ్యములకన్న భిన్నములైనవి. వీనియందు కథ ప్రధానమైనది కాదు. వీని యందు వర్ణనలు, అలంకారములు, కల్పనలు,పద్యరచనా చమత్కారములు నిండియుండును. ఏదో కథ నొక దాని నివి యాశ్రయించి యుండవచ్చును. కాని దీని యందు కథకు ప్రాధాన్యము లేదు. ఇవి రసమును ఆశ్రయించిన కావ్యములు కావు. చమత్కారము నిచ్చెడు నట్టివి. ఈ వాదము ననుసరించి నన్నెచోడుని కుమార సంభవము, మనుచరిత్ర, ప్రభావతీ ప్రద్యుమ్నము మొదలైనవి కావ్యములు.

ఈ మూడు మతములు కూడ సమంజసముగా గోచరింపవు

* ప్రబంధ శబ్దమును ''అలంకార ప్రబంధోయం" అని విద్యా నాథుడు తన ప్రతాపరుద్రీయముగూర్చికూడ వ్రాసియున్నాడు.

మొదటి మతము ప్రకారము తెలుగు భాషలో పరిణామము పొందిన మహా ప్రబంధశాఖ యొక నిర్వచనమునందొదిగి యుండ లేకున్నది. శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతంగారు మహా ప్రబంధము లన్నింటిని సమన్వయించి వానికొక లక్షణము కల్పించి యున్నారు.

" 1. ప్రబంధమునకు ఏకనాయకాశ్రయత్వము, దానితో పాటు వస్త్వైక్యమును ప్రధాన ధర్మములు.

2. ప్రబంధము అష్టాదశ వర్ణనాత్మకమై యుండ వలెను.

3. అందు శృంగారము ప్రధాన రసము, ఆవశ్య కతను బట్టి తక్కిన రసములు గౌణములు కావచ్చును.

4. ఆలంకారికశైలి ప్రబంధమునకు జీవము.

5. ప్రబంధము భాషాంతరీకరణము కారాదు. స్వతంత్రమై యుండవలెను.

(తెలుగు సంస్కృతి III Part Page 608)

ఈ యైదు లక్షణములయందు రెండవ లక్షణము మహా కావ్యములకు చెప్పబడినదే. మిగిలిన నాలుగు లక్షణములు ఆంధ్ర ప్రబంధములలో నెన్నింటికి పట్టునో చూడవలసియున్నది. చివరి లక్షణము శ్రీనాథుల కృతులను ప్రబంధ పరిధినుండి తొలగించినది.

ఆంధ్ర ప్రబంధములకు శిరోభూషణమైనదియు, తత్శాఖకు తొలుతటి కృతియునైన స్వారోచిష మను చరిత్రమునకు ఈ లక్షణములలో ప్రధానమైనవి పట్టుటలేదు. మనుచరిత్రము ఏకనాయకాశ్రయము కాదు. ఇందు స్వరోచి, మాయాగంధర్వుడు, ప్రవరుడు మువ్వురును నాయకులే యనవలెను. ఈ కథారచనాపద్ధతిని ఆశ్రయించివిచారించినప్పుడు ఏ యొక్కనినో నాయకునిగా నిశ్చయించుటకు వీలులేదు. మాయాగంధర్వుని ప్రవరునిలో లీనము చేసినను కావ్యము ద్వినాయకాశ్రయమగుచున్నది. కావ్యముయొక్క స్థితినిబట్టి ప్రవరునకప్రాధాన్యమిచ్చుటకు వీలులేదు. ఇందువలన ప్రథమ లక్షణమునకే దీనియందు వ్యాప్తిలేదు. ప్రబంధము శృంగార రస ప్రధానమని చెప్పబడినది. ఈ లక్షణము కూడ ఈ కావ్యమందు సంక్రమించుటలేదు. ఇది శాంతరస ప్రధానమైన కావ్యము. వరూధినీ ప్రవర ఘట్టము నందున్నది శృంగార రసాభావము. ఇదియు గౌణము. శాంతమునందే పర్యవసింపగలదు. ఈ కావ్యమునకు వస్త్వైక్యము (unity of the plot) సమకూర్చుటకూడ చాల క్లిష్టమైన విషయమే. ఈ విధముగా ప్రబంధముల కేర్పరచిన లక్షణ మేదియైనను అది మను చరిత్రమునకే పట్టుటలేదు.

రాయల యుగములో వచ్చిన అనేక కావ్యములలో ఏ కొన్నింటికో తప్ప యీ లక్షణములు పట్టుటలేదు. ఆముక్త మాల్యదలో వస్త్వైక్యములేదు. ఏకనాయకాశ్రితము కాదు. శృంగారము ప్రధాన రసముకాదు. ధూర్జటికృతి, రామకృష్ణుని కృతియు అనేకోపాఖ్యానముల సంపుటములు. వీని యందును ఏతల్లక్షణములు పట్టుటలేదు.

ఒక విధముగా చూచినచో పైన పేర్కొనిన ప్రబంధ లక్షణములన్నియు వసుచరిత్రము నాశ్రయించి చేయబడినట్లు తోచుచున్నవి. ఆ కావ్యమునందీ లక్షణములన్నియు పట్టుచున్నవి. కాని ఒక ఉద్యమముగా, ఒక యుగముగా నిరూపించ నెంచినపుడు తల్లక్షణము తద్యుగమునందలి మహాకృతులలో చాలగ్రంథములకు ఆ లక్షణములు సంక్రమించనప్పుడు ఆలక్షణమునకు కల్గు మర్యాద యెట్టిది? ఈ పేర్కొనునప్పుడు ఏదోయొక లక్షణము పట్టిన దానినీ మార్గములో చేర్చినచో ప్రబంధములకు సామాన్యమును సాధించలేని లక్షణము గోచరించును.

మరి ఇంకొక్క విషయము. ఈ లక్షణములన్నియు గల మహాకావ్యము సంస్కృతముననే యుండినచో దానిని కాదనుటకు వీలులేదుకదా! తల్లక్షణములుగల కృతియు మహాకావ్యమే యగుచుండగా మనముకూడ ఆ లక్షణములనే యేర్పరచుకొని యిది వేరు శాఖయని చెప్పుకొనుటలో నర్థములేదు. సంస్కృతములో శ్రీహర్షుని నైషధమున కీలక్షణములన్నియు సమకూడును. నైషధమునందు వర్ణన లనేకముగా నున్నవి. కథయొక్క యైక్యము కూర్పబడినది. శృంగార రసప్రాధాన్యమున్నది. తక్కిన రసములు కూడ గౌణములుగా నీలక్షణమునందు సంక్రమించినవి. శైలి ఆలంకారికమైనది. అప్పుడు శ్రీహర్షుని నైషధము ప్రబంధము కావలెను. లక్షణము సమగ్రముగా పట్టినచోట దాని నంగీకరించి, పట్టినచోట యంగీకరింపక పోవుటలో సామంజస్యము గోచరింపదు.

ఒకవేళ నైషధమును ప్రబంధముగా నంగీకరించినచో తెలుగువారు స్వయముగా ప్రబంధమును నిర్మించిరన్న మాటలో

సత్యము గోచరింపదు. శ్రీనాథుని నైషధము తెలుగు ప్రబంధములకు మేలుబంతిగా స్వీకరింపుచు* —దానికి ప్రబంధత్వము కేవల మనువాదమగుట లభింపలేము—సంస్కృత నైషధము కాదనుటకు వీలు లేనిది. ప్రత్యక్ష గా శ్రీనాథుడు పెద్దనాదుల కావ్యమార్గమున కెంత బాధ్యుడో అప్రత్యక్షముగా శ్రీహర్షుడుకూడ అంతియే. ఈ విధముగా ప్రబంధముల కన్నింటికిని నైషధము మూలస్థానముగా గోచరించుచున్నది. ఇది ఈ వాదమునకే భంజకమైన విషయము.

''మన సారస్వతమునందు పెద్దనప్రభృతికవులు సంస్కృత కావ్యముల కంటె భిన్నములుగా దేశీయ పద్ధతులలో స్వతంత్ర నూతన కావ్యసృష్టి చేయుటచేత ఒక నవ్య కవితోద్యమము (రొమాంటిక్ మూవ్మెంట్) ప్రవర్తిల్లెనని చెప్పనగును. ప్రబంధము అనునది ఆంధ్రులు సమగ్ర భారతీయ సరస్వతికి తమ కానుకగా సమర్పించిన ఒక నూత్నాలంకారము. దృశ్యము, శ్రవ్యము, మధురము అని ఒక ప్రమాణమును బట్టి యేర్పడిన మూడు కావ్య విశేషములును, గద్యము పద్యము అని ఇంకొక ప్రమాణమును కలసి యేర్పడ్డ రెండుకావ్య విశేషములును తన యందే ఇముడ్చుకొని సంపూర్ణ సారస్వత సుందరమూర్తిగా వెలుగొందునది ఆంధ్ర ప్రబంధము ''

(తెలుగు సంస్కృతి — Page 610)

అని పింగళివారే నిర్వచించి యున్నారు. ఇది కడు జాగరూకతతో పరిశీలింపదగిన విషయము. ఇందు మూడు లక్షణములున్నవి. 1. సంస్కృత కావ్యముల కంటె భిన్నముగా దేశీయములైన పద్ధతులు. 2. దృశ్య శ్రవ్య మధుర కావ్యముల లక్షణముల సంయోజనము. 3. గద్య పద్యముల యొక్క సంయోజనము. ఈ మూడు లక్షణములయొక్క సంయోజనము వలన ప్రబంధము తానొక ప్రత్యేక మూర్తికల్పనము పొందినది.

దేశీయములైన పద్ధతులనగా ఇష్టదేవతాస్తుత్యాదికము, షష్ఠ్యంతములు, కవి వృత్తాంతము, కృతి భర్తృవృత్తాంతము, ఆశ్వాసాద్యంతముల యందలి కృతిభర్తృ సంబోధనము కావచ్చును. పుష్పాపచయము వంటివి కావచ్చును. కాని ఇష్టదేవతాస్తుత్యాదికము సంస్కృతములోని ఆఖ్యాయికాలక్షణమునుండి తెలుగు కవులు స్వీకరించిరి. ఆఖ్యాయిక యందు కవి మన తెలుగు కావ్యములకు సహజములైన ఇష్టదేవతాస్తుత్యాదు లన్నియు చేయును. దానిలో తన చరిత్రము చెప్పుకొనుట, కృతిపతిని చెప్పుట కలదు. తెలుగు కావ్యములయందు కవి తన ప్రశంసయు, వంశవృక్షమును చెప్పుట కృతిపతి వంశావతారము చెప్పుట కలవు. షష్ఠ్యంతములు, ఆశ్వాసాద్యంత సంబోధనలు తెలుగు కావ్యములకు తొలిరోజుల నుండియు వచ్చుచున్నవే. వీనిని కలిగియుండుటలో ప్రబంధములకే ప్రత్యేకతయులేదు. పుష్పాపచయము సంస్కృత నాటకములలో నున్నదే. దానిని ఒక దేశీయమైన రగడగా రచించుట మాత్రము ప్రబంధముల యందు కలదు. అందువలన దేశీయములైన పద్ధతులని యీ కావ్యముల యందు ప్రత్యేకముగా చెప్పుకొన దగినవి కనిపించుట లేదు. తెలుగు దేశములోని ఆచార వ్యవహారములు జనుల ప్రవృత్తులు, ఆహార విహారములు కూడ ప్రబంధములయందు తత్పూర్వ కావ్యములతో పోల్చి చూచినచో తక్కువ యనియే చెప్పవలయును. భాషా విషయకముగా నాలోచించినను తెలుగు పలుకుబడి నుడికారపు సొంపు పురాణముల కాలములో సొగసులు పోయినట్లు ప్రబంధముల కాలములో పోలేదు. శ్రీనాథుని పద్యరచనా సౌందర్యమునకు ముగ్ధులై తెలుగు పద్యములు సంస్కృత సమాస సంఘటనము నందలి యొకానొక నాదవిద్యాదేవి కమ్ముడు పోయినవి. ఈ ప్రబంధముల మీద సంస్కృత శబ్దముల ప్రభావ మెంత యెక్కుడో విచారించుటకు తరువాత వందయేండ్లలో ప్రారంభమైన యచ్చతెనుగు కావ్య మార్గమే సాక్ష్యమీయగలదు. అందువలన ప్రబంధముల యందు దేశీయములైన పద్ధతులు కలవనుటలో సత్య మేమాత్రమును గోచరింపదు.

రెండవ లక్షణము దృశ్యశ్రవ్య మధుర కావ్యముల సంయోజనము. ఇది కూడ నిర్దిష్టముగా చెప్పవీలులేని లక్షణము. మధురమన్నది శైలీ విశేషమునకో భావనా లక్షణమునకో చెందిన దైనచో అది తత్తత్కవుల రచన నాశ్రయించి యుండును. శ్రీనాథుడు మొత్తముమీద మధుర కవి కాడు, రాయలు కాడు. రామకృష్ణుడు కాడు, ధూర్జటి కాడు, సూరన్న కాడు. మధుర మైన లక్షణము పెద్దన్నలో నున్నది. తత్పూర్వ కవులలో

* తెలుగు వాఙ్మయము — ప్రబంధయుగము (తెలుగు సంస్కృతి—608)

నన్నయలో పోతనలో నెంత మాధుర్యమున్నదో పెద్దనలో నంత మాధుర్యమున్నది. తిక్కన రచన మధురమైనది. రామరాజ భూషణుని రచన మధురమేయయ్యును బహుళములైన యలంకారముల సంయోజనముచేత నొక విధమైన క్లిష్టతను, ప్రౌఢిని సంపాదించుకొన్నది. అందువలన నీ మాధుర్య లక్షణమిట్టిదని చెప్పలేము. ఇది కవుల నాశ్రయించిన లక్షణము కాని ప్రబంధముల నాశ్రయించిన లక్షణము కాదు. ఆ కవులు కూడ ఒక్కొక్కప్పుడు మాధుర్యగుణము వదలి వ్రాయుట యున్నది. ఈ మాధుర్యలక్షణము ఛందస్సునకు చెందిన దేశీయ వృత్త ప్రయోగము, మాత్రాచ్ఛందోరచనముగా తద్గ్రంధములను చూచి భావింపజాలము. ఇంక దృశ్యశ్రవ్య కావ్యలక్షణ సంయోజనమున్నది. ఇదియు సంస్కృత మహాకావ్య లక్షణమునకు భిన్నమైనది కాదు. సంస్కృతాలంకారికులెల్లరు మహాకావ్య లక్షణము చెప్పునప్పుడు పంచ సంధులును తదంగములును యథా యోగ్యములుగా విని వేశనీయములని చెప్పియున్నారు. అందు వలన దృశ్యకావ్య సంప్రదాయము మహా కావ్యమునకు భిన్నత్వము సమకూర్పదు. తరువాత మూడవ లక్షణము గద్యపద్య మయత్వము కూడ ప్రత్యేకలక్షణముగానే చెప్పబడినది. ''గద్యపద్య మయం కావ్యం చంపూరిత్యభిధీయతే'' అని లక్షణము. సంస్కృత సాహిత్యమున చంపూ కావ్యములున్నవి. తెలుగు భాషకు కూడ చంపూ సంప్రదాయమే ఒరవడి. నన్నయ నాటినుండియు చంపూ కావ్య సంప్రదాయమే దేశమునందు ప్రవర్తితమగు చున్నది. కావ్యమునందు భిన్నవృత్త రచనము, వచనము కూడ కూర్పులోని ప్రత్యేకత వలన నదియొక విద్యగా తెలుగు కవులు భావించిరి. వారు వచనము కావ్యమునందు కొన్ని కొన్ని స్థలముల యందు మాత్రమే వాడుచుండిరి.

ఈ విధముగా చూచినప్పుడు సంస్కృత కావ్యభిన్నముగా తెలుగువారు క్రొత్త ప్రక్రియగా ప్రబంధమును తీర్చినారనుట తర్కసహమైన విషయముగా గోచరించుటలేదు.

ప్రబంధ స్వరూపమును గూర్చిన రెండవ మతము కన్నడ ప్రభావమునకు సంబంధించినది. కన్నడ భాషలోని సంప్రదాయములు తొలియుగములో మన కావ్యములయందు మిక్కుటముగా ప్రవేశించినవి. అది వీరశైవ మతోద్యమమువలన భాషలోనికి విరివిగా వచ్చినవి. ఇవి నన్నెచోడుని కుమార సంభవములో కూడ నున్నవి. నన్నెచోడునిమీద సంస్కృత ప్రభావము కన్నడ ప్రభావముకన్న పదిరెట్లెక్కువగా నున్నదని చెప్పుటలో నతిశయోక్తి లేదు. "వనజకేశీ" త్యాది పద్యమున అష్టాదశవర్ణములు పేర్కొని "పరిపూర్ణంబై దశప్రాణంబుల సప్రాణంబైన వరసభావ భరితంబై షట్త్రింశదలంకాలంకృతంబై రమణీయమైన దివ్యకథ"- యని చెప్పెను. ఇవన్నియు సంస్కృతాలంకార శాస్త్రమునకు చెందినవే. తెలుగులో తొలి మహాకావ్యము రచించిన నన్నెచోడుని రచన సంస్కృతాలంకారమునే తన్మహాకావ్యలక్షణమునే చెప్పుచున్నది. ఉద్భటుడు చెప్పినట్లుగా నీతడు ముప్పది యారలంకారములను పేర్కొనెను. నన్నెచోడుని కావ్య స్వరూప భావన యింత స్పష్టంగా గోచరించు చుండగా నది కన్నడ వాఙ్మయ ప్రభావమని చెప్పుటలో సత్యము గోచరింపదు. కన్నడ ప్రభావము కొన్ని పద్యములపై కొన్ని పద సంయోజనములమీద, కొన్ని భావముల మీద కూడ నుండవచ్చును. కాని కావ్య భావమునందు ప్రబంధముగా పరిణామము పొందుటకు కన్నడము కారణము కాజాలదు.

ప్రబంధమూల స్వరూపమును గూర్చిన మూడవ మతము మరియు చిత్రమైనది. అది యూహమీద యాధారపడినది. దానిని బట్టి ఇప్పటి ప్రబంధములు ప్రబంధములు కావు, కావ్యములు కావ్యములు కావు. వీనియందు కథ ప్రాధాన్యముండదో, వర్ణనా బాహుళ్యముండునో రసనిర్వహణము సుష్ఠుగా చేయబడదో వాని నెల్లను ప్రబంధములుగా చేర్పవలయును. సర్గబంధమునకు సంస్కృతాలంకారికులు చెప్పినా వర్ణనాధికము మహాకావ్య సంబంధి కాకపోవును. మహాకావ్యములయందు రసము రాజ్యము వహించును, అది కథను మూలస్థానముగా చేసుకొని పుట్టును.

మహా కావ్యమనగానే యష్టాదశ వర్ణనాత్మకమైనదని స్పష్టముగా నిర్వచించిన యాలంకారికుల నిర్వచనము దీని వలన తల క్రిందలగును. మహా ప్రబంధములుగా మనము నిర్ణయించిన వాని యందు రసమునకు సిద్ధియుండదు. కవియొక్క జన్మతపః ఫలముగా రససిద్ధి పడయనెంచిన వారు రసారామ బహిష్కృతులగుదురు. రాయలకృతి మహా కావ్యముకాదు. మను చరిత్రము మహా ప్రబంధముకాదు. ఈ స్థితి సంస్కృతంలోనికి కూడ సంక్రమింపవచ్చును. అచ్చట మాఘము కావ్యము కాదు. ప్రబంధము. నైషదీయచరితము మహా కావ్యముకాదు. ప్రబంధము. ఇట్లు చెప్పుకొనవలసివచ్చును. కావ్యప్రబంధములని పృథగ్విభాగము చేసినచో కొన్నిచోట్ల దేనిని దేనిలో చేర్పవలయునో కూడ పరమ వివాద కారణమగును.

ఈ కావ్య ప్రబంధ వ్యవహార మెప్పుడు పుట్టినదోకాని దీనిపై చేయబడుచున్న యూహలు వాదనలు చిత్ర చిత్రములుగా నున్నవి. కాలము సాగుచున్నకొలది ఒక మార్గములోననే యనేక నూతన విషయములు చేరును. కాని దానిని యీ మార్గములోనిదే కాదనుటలో యర్థమేలేదు. కావ్యములు కాళిదాసు నాటికి, భారవి నాటికి, మాఘునినాటికి మరియు శ్రీహర్షుని నాటికి క్రమక్రమముగా ననేక నూత్న విషయములు చేర్చుకొనుచు వచ్చినవి. అట్లేవానిని స్వీకరించిన కవులు వానిలో స్వప్రతిభాజన్యములైన నూత్న విషయములు చేర్చుచునే యుందురు. అంతలోననే కాళిదాస, భారవి, మాఘ, శ్రీహర్షుల కావ్యములను వేరువేరుగా విభాగించి వేరు వేరు పేరులు పెట్టుటలో న్యాయములేదు. ప్రతిభయొక్క లక్షణమే నవనవోన్మేషశాలిత్వము, అందును మహాకవులు ఎప్పుడును నూత్నమునేదో యొకదానిని ప్రవేశపెట్టుచునే యుందురు. అల్ప కవులు ఎపుడును వానిననుసరించుచుందురు.

ఈ పైవాదములన్నియు సాకల్యముగా పరిశీలించిన వారు డా॥ శ్రీ పల్లా దుర్గయ్యగారు. వారు తమ ప్రబంధ వాఙ్మయ పరిణామ పరిశోధనలో "ప్రబంధము సంస్కృత సాహిత్య సర్వస్వ పిండీకృత రసఘటిక" అని చెప్పియున్నారు. దీనివలన ప్రబంధము లన్నియు సంస్కృత సాహిత్యంలోని ఎన్నియో సొగసులన్నింటిని తెచ్చికొని తమలో కలుపుకొన్నటులు మనము నిశ్చయముగా చెప్పవచ్చును.

"1. పురాణేతిహాసములనుండి తమ కృతుల యితివృత్తమును—.

2. నాటకములనుండి శుభాంతత్వలక్షణము, వస్త్వైక్యము, సంభాషణావిధానము, పాత్రపోషణము, మృగయా విమాన యాన శీతలోపచారాదికము—.

3. నాటికలనుండి ప్రఖ్యాతధీరలలిత నాయకత్వము, కన్యా నాయికాత్వము. చిత్రస్వప్నాది దర్శనము, ప్రథమానురాగోదయము, చేటీవిదూషకాదులు, స్త్రీ పాత్ర బాహుళ్యము ప్రణయ కోపానునయము—.

4. మహాకావ్యములనుండి రసాలంకార వర్ణనాదులు—.

5. కథాకావ్యములనుండి ప్రణయము పరిణయము, విప్రలంభాదులు, శృంగార ప్రాధాన్యము—.

6. ఆఖ్యాయికలనుండి ఆశ్వాస విభాగము, వీని యవతారికలనుండి ఇష్టదేవతాస్తుత్యాదికము—.

7. చంపూ కావ్యములనుండి గద్యపద్యోభయత్వము భిన్నవృత్త గణనా విధానము స్వీకరించినది. ఈ విధముగా కావ్య సౌందర్యమును సంతరించుకొనిన సరస సాహిత్య ప్రక్రియ ప్రబంధము"

పైన శ్రీ దుర్గయ్యగారు ప్రబంధము నెట్లూహించినారో తెలిపినాను. పై లక్షణములలో కొన్ని తెలుగు వాఙ్మయములో నంతకు పూర్వమే ప్రవేశించినవి. చివరి నాల్గు లక్షణములు నన్నయగారి నాటినుండియు ప్రవర్తించుచున్నవి. నాటకము పంచ సంధుల నిర్వహణమున కనుగుణముగా నైదునుండి పది యంకముల వరకు నుండవచ్చునని యున్నట్లే తెలుగువారి ప్రబంధము కూడ తదను గుణముగా కాబోలు పంచాశ్వాస పరిమితమైనది. విపంచి కావాదనము, నాట్యము, దూతాప్రేషణము మొదలైనవి కూడ నాటికా విషయములే.

పైన పేర్కొన్న విషయములు గమనించినచో నైషధీయ చరితము నాటికి శిఖరాగ్రము నందుకొన్న మహాకావ్యము నాటి కాదుల మరికొన్ని లక్షణములతో కూడ తెలుగు నందు వచ్చినదని తెలియవచ్చును. ఇది మహాకావ్య భిన్నముకాదని కూడ తెలియవచ్చును కొన్ని కొత్త విషయములు చేరినను సంస్కృత మహాకావ్యమును తెలుగులోని మహా ప్రబంధమును ఒక్కటిగానే గోచరించును.

శ్రీ జి. వి. కృష్ణారావుగారు తమ Studies in Kalapurnodayam అను గ్రంథములో నిట్లు చెప్పి యున్నారు. "So the Mahaprabandha is nothing more than the Mahakavya which is a species of poem. But not a poem as its verbal meaning denotes" ( 4 Page )—ప్రకృష్టబంధమైన — యీ ప్రబంధము కావ్యముకన్న భిన్నము కాదనియు, మహాకావ్య మహాప్రబంధములు పర్యాయ పదములనియు వారి యభిప్రాయము.

ఇంత వరకు విచారింపగా తేలిన విషయములు :—

1. తెలుగులోని మహా ప్రబంధము సంస్కృతములోని మహాకావ్యమున కభిన్నమైనది. అలంకారికులు చెప్పిన సర్గబంధమైన మహాకావ్యమిదియే.

2. శ్రీ హర్షుని నైషధీయ చరితమున కనువాదమైన శృంగార నైషధ మొరవడిగా నాంధ్రప్రబంధములు ప్రవర్తిల్లినవి.

3. ఆంధ్రి కావ్య సహజములైన భిన్నవృత్త సంయోజనము, గద్యపద్య నిర్మాణము తెలుగు కావ్యముల యందు విల్చినవి.

4. పంచసంధుల విర్వహణమున కనుగుణముగా పంచాశ్వాస పరిమితమైన కృతిని రచించుట సహజమైనది. పంచాశ్వాస పరిమితత్వము తొలికృతులయందు కాక తరువాతి కావ్యములం దెక్కువగా గోచరించును.

5. దేశీయమైన రగడ 'పుష్పాపచయము' ఘట్టమున ప్రవేశించినది.

6. ఇష్టదేవతాస్తుత్యాదికము, కావ్యకారణము మొదలైనవి నన్నయాదులనుండి వచ్చెడివి. తరువాతి కాలములోవి కృతులకు కూడ చెందుచున్నవి. ఈ పద్ధతులు 'ఆఖ్యాయికల' నుండి తెలుగు కావ్యములకు వచ్చియుండును.

7 కావ్యమునందు కొంచెము తక్కువగా ఇరువది రెండు వర్ణనలు చేయబడినవి.

8. ఇతి సముల నాటికన్న శబ్దార్థాలంకారములు కావ్యమునందు మిక్కిలిగా చోటు చేసుకొన్నవి. బంధకవిత్వము కూడ క్వాచిత్కముగా కొన్ని కొన్ని చోట్ల కానవచ్చుచున్నది.

9. ఈ యుగమునాటి కావ్యములన్నియు శృంగార రస ప్రధానములు కాకపోయినను సర్వకావ్యములయందు శృంగార స్పర్శ యుండనేయున్నది. ఇందు చాల కావ్యములు శృంగార ప్రధాన రసత్వము కలవి కూడ.

10. కావ్యములయందు శుభాంతత్వము లక్షణమైనది. తొలి కావ్యములలో కొన్నిటిలో లేకున్నను తరువాతి వానిలో వస్త్వైక్యముకూడ యొక ధర్మముగా ప్రవర్తించినది.

11. తెలుగు కావ్యములలోని పద్యగద్యములందు బాణ శ్రీహర్షాది మహాకవుల ప్రాబల్యము బలపడజొచ్చినది.

12. ఇతి వృత్తము పురాణేతిహాసములనుండి స్వీకరించినదే యైనను కావ్య ప్రణాళికను నిర్మించుకొనుటలో కవి మిక్కిలి స్వేచ్ఛ కలిగియుండెను.

ఈ మెరుపు లన్నియు సంతరించుకొని తెలుగు భాషలో తొలి స్వతంత్ర మహాకావ్యము అల్లసాని పెద్దనతో నవతరించినది. ఆంధ్రకావ్య చరిత్రలో [illegible] హాసముల, యనువాదముల బాహుళ్యమునుండి మలపు తిరిగి నందున యాయన ఆంధ్ర కవితాపితామహుడైనాడు. ఈ కావ్యమునకు దీని ననుసరించిన కావ్యములకు తెలుగు సారస్వత చరిత్రములో ప్రబంధమను పేరు రూఢముగా నున్నది.



# సంగ్రహ ప్రకటనలు

## ఉర్దూ మాట్లాడేవారికి సౌకర్యాలు

హైదరాబాదులోని ఆంధ్రప్రదేశ్ అంజుమన్ తరఖీ ఉర్దూ సంఘం ఉర్దూ భాషను గుర్తించే విషయమై సమర్పించిన వినతి పత్రాన్ననుసరించి దిగువ నిర్ణయాలను ప్రభుత్వం ప్రకటించింది: సెక్రటేరియేటు, మినిస్టీరియల్, జుడీషియల్ మినిస్టీరియల్ సర్వీసులలో నేరుగా నియమించే విషయాలలో ఉర్దూ భాషను ప్రాంతీయ భాషగా ప్రభుత్వం యిదివరకే ప్రకటించింది. అందువల్ల యీ విషయంలో యింకేలాంటి చర్యలు తీసుకోనవసరంలేదని భావించడం జరిగింది.

15 నుండి 20 శాతం వరకు ఉర్దూ మాట్లాడే జనాభా ఉన్న ప్రాంతం, జిల్లాలలో ముఖ్య చట్టాలు, నియమ నిబంధనలు, నోటిఫికేషనులు ఉర్దూ భాషలోనే జారీ చేయడం జరిగింది. జిల్లాపరిషత్తు యితర స్థానిక సంస్థలలోని చర్చనీయాంశాలను ఉర్దూలో కూడా రికార్డు చేయాలనే ప్రతిపాదన ఆచరణీయం కాదు. ఉర్దూలో దరఖాస్తులను స్వీకరించే సౌకర్యం కలిగించారు. తెలుగులో యిచ్చే దరఖాస్తుల మాదిరిగానే వీటిని పరిగణిస్తారు. ఉర్దూలో ఉన్న దరఖాస్తులకు ఉర్దూలోనే ప్రత్యుత్తరం యివ్వాల్సిన అవసరం లేదని భావించడం జరిగింది. ద్వితీయ భాషా పరీక్షలు గల గెజిటెడ్-నాన్‌గెజిటెడ్ సర్వీసులలో ఉర్దూను కూడా ద్వితీయ భాషగా గుర్తించడం కొనసాగుతుంది.

ఎలిమెంటరీ, ప్రాథమిక పాఠశాలలో తరగతికి కనీసం 10 మంది విద్యార్థులు, పాఠశాలకు 30 మంది చొప్పున, సెకండరీ పాఠశాలలో VI నుండి VIII, VII నుండి IX తరగతులలో 45 మంది చొప్పున విద్యార్థులు ఉన్న చోట్ల ఉర్దూ భాషలో బోధన జరుగుతున్న సౌకర్యాలు సంతృప్తికరంగా ఉన్నవి.

ప్రస్తుతం అమలులో ఉన్నట్లుగానే ఉర్దూ ద్వితీయభాషగా ఉన్నవారు ప్రభుత్వ సర్వీసులలో నియామకానికి అర్హులు అవుతారని ప్రభుత్వం నిర్ణయించింది. అయితే యితర విద్యార్హతలు కూడా సంతృప్తికరంగా ఉండాలి. తెలంగాణాలోని అన్ని జిల్లాలు, గుంటూరు, కడప, కర్నూలు జిల్లాలలోని మినిస్టీరియల్, జుడీషియల్ సర్వీసులలో నియామకాలకు నిర్ణయించిన ప్రాంతీయ భాషార్హతగా ఉర్దూ కూడా పరిగణింపబడింది.

ఉద్యోగ ప్రమోషనుకు తెలుగు టెస్టు అదనపు అర్హతగా యెంచిన చోట్ల తెలుగు టెస్టు ఉత్తీర్ణుడు కాని ఉర్దూ భాష మాట్లాడే ఉద్యోగి యితరత్రా అర్హతకలిగి ఉంటే అతని ప్రమోషను విషయం పరిశీలించాలి. అయితే నిర్ణీత కాలంలో తెలుగు టెస్టులో ఉత్తీర్ణుడు కావల్సిన నిబంధనకు లోబడి యిది జరుగుతుంది.

యీ నిర్ణయాలకు సంబంధించిన అవసరమయిన చర్యలు తీసుకోవాలని అధ్యక్షులను ఆదేశించడం జరిగింది.

## వ్యవసాయదారులకు ఖరీఫ్ రుణాలు

1962 ఖరీఫ్ ఉద్యమం, 1962-63 రాబి ఉద్యమాలలో సన్నకారు వ్యవసాయదారులు వ్యవసాయ పరికరాలు కొనుగోలు చేయడానికి వీలుగా ప్రతి రైతుకు రూ. 50/- ల చొప్పున పంపిణీ చేయడానికి భారత ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వానికి స్వల్పకాలిక రుణంగా రూ. 30 లక్షలు మంజూరు చేసింది. యిందులో నుండి 1962 ఖరీఫ్ ఉద్యమంలో వ్యవసాయదారులకు రూ. 50/- ల చొప్పున స్వల్పకాలిక రుణాలుగా యివ్వడానికి గాను రూ. 20 లక్షలు మంజూరు చేశారు.

సమితి ప్రాంతాలకు కేటాయించిన మొత్తాలను కలక్టర్లు పంచాయతీసమితుల పరం చేస్తారు. యీ మొత్తాలను రైతులకు మంజూరు చేయడం, పంపిణీ చేయడం, తిరిగి వసూలు చేసే బాధ్యతలు పంచాయతీసమితులపై ఉంటాయి. పంచాయతీసమితులు లేని ప్రాంతాల్లో పంపిణీచేయ నిర్దేశించిన మొత్తాలను కలక్టర్లు జిల్లా వ్యవసాయశాఖాధికారుల పరం చేస్తారు.

## రాష్ట్ర ప్రణాళికా సలహా సంఘం

రాష్ట్ర ప్రణాళికా సలహా సంఘాన్ని ప్రభుత్వం పునర్ని ర్మించింది. దీనికి ముఖ్యమంత్రి అధ్యక్షుడుగానూ, ప్రణాళికా శాఖామంత్రి ఉపాధ్యక్షుడుగాను వుంటారు. దిగువ పేర్కొన్న వారు సభ్యులుగా నియమించబడినారు:-

(1) మంత్రులందరూ; (2) డా. కె. ఎల్. రావు, లోక సభ సభ్యుడు; (3) శ్రీ బాకర్ మీర్జా, లోక సభ సభ్యుడు; (4) శ్రీమతి యశోదారెడ్డి, లోక సభ సభ్యురాలు; (5) శ్రీమతి వి. విమలాదేవి, లోకసభసభ్యురాలు; (6) శ్రీ ఆర్. నారాయణరెడ్డి, లోకసభ సభ్యుడు; (7) శ్రీ జి. వి. లచ్చన్న, శాసనసభ సభ్యుడు; (8) శ్రీ టి. విశ్వనాథం, శాసన సభ సభ్యుడు; (9) శ్రీ ఎస్. బి. పి. పట్టాభిరామారావు, శాసన సభ సభ్యుడు; (10) శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు, శాసనమండలి సభ్యుడు; (11) శ్రీ పి. సుందరయ్య, శాసనసభ సభ్యుడు; (12) శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య, శాసనసభ సభ్యుడు; (13) చెంచురామ నాయుడు, శాసనసభ సభ్యుడు; (14) శ్రీ పి. రాజగోపాల నాయుడు, శాసనసభ సభ్యుడు; (15) శ్రీ టి. నరసింహారెడ్డి, శాసనసభ సభ్యుడు; (16) శ్రీ టి. నాగిరెడ్డి, శాసనసభ సభ్యుడు; (17) శ్రీ కె. ఓబుల రెడ్డి, శాసన సభ సభ్యుడు: (18) శ్రీమతి కుముదినీదేవి, శాసనసభ సభ్యురాలు; (19) శ్రీ మఖ్దూమ్ మొహియొద్దీన్, శాసనమండలిసభ్యుడు; (20) శ్రీ ఎం. బాగారెడ్డి, శాసనసభ సభ్యుడు; (21) శ్రీ జి. రాజారామ్, శాసన సభ సభ్యుడు; (22) శ్రీ జి. సంజీవరెడ్డి, శాసనసభసభ్యుడు; (23) శ్రీ కె. వి. నారాయణరెడ్డి, శాసనసభ సభ్యుడు; (24) శ్రీ మొహమ్మద్ కమాలుద్దీన్, శాసన సభ సభ్యుడు; (25) శ్రీ శీలం సిద్దారెడ్డి, శాసనసభ సభ్యుడు; (26) శ్రీ ఏ. వాసుదేవరావు, శాసన సభ సభ్యుడు; (27) శ్రీ జయచంద్ డి. లోహడె; (28) శ్రీ పన్నాలాల్ బన్సీలాల్; (29) శ్రీ వి. రామకృష్ణ; (30) శ్రీ కె. అచ్యుత రెడ్డి (31) శ్రీదిద్దార్ హుస్సేన్; (32) శ్రీమతి ఏ. శ్యామలాదేవి; (33) శ్రీ జె. రఘోత్తమరెడ్డి; (34) శ్రీ కె. బసవరాజు; (35) శ్రీ చంద్రశేఖరరెడ్డి; (36) శ్రీ కె. రామకృష్ణారెడ్డి; (37) శ్రీ మహమ్మద్ రహ్మతుల్లా; (38) శ్రీ ఎన్. వెంకటరావు; (39) శ్రీమతి బి. సరోజినీదేవి; (40) శ్రీ ఎం. బాపినీడు; (41) డా. డి. ఎస్. రెడ్డి; (42) డా, గోవిందరాజులు నాయుడు; (43) ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి; (44) ప్రణాళికా, స్థానిక పరిపాలనాశాఖ కార్యదర్శి (సభ్యుడు, కార్యదర్శి)

1962 జూలై 10 వ తేదీ లగాయతు రెండు సంవత్సరాల వరకు ఈ కమిటీ పనిచేస్తుంది.

## క్షామ ప్రాంతాలలో సహాయక చర్యలు

విశాఖపట్నం జిల్లాలో అనావృష్టికి గురి అయిన 339 గ్రామాలలోని మెట్టభూముల విషయంలో శిస్తులు, ఋణపు కిస్తుల బకాయీలనూ, ప్రస్తుతం చెల్లించవలసివున్న మొత్తాలను, 1962 నవంబరు నెలాఖరు వరకు వసూలు చేయకుండా వాయిదా వేయడానికి ప్రభుత్వం ఆదేశించింది. ఒకవేళ భూమిశిస్తు, ఋణపు కిస్తుల క్రింద ఇదివరకే ఎవరైనా మొత్తాలను చెల్లించడం జరిగితే వాటిని వాపసు ఇవ్వరు కాని ముమ్ముందు చెల్లించవలసివచ్చే బకాయీలు మొదలైన వాటిక్రింద జమకట్టుకుంటారు. శ్రీ కాకుళం జిల్లా టెక్కలి, నర్సన్నపేట, చీపురుపల్లి తాలూకాలలో వర్షాభావం ఏర్పడిన గ్రామాలలో 1371వ ఫసలీకి తరీ భూములు, మన్వారీభూమి శిస్తులకు కూడా ప్రభుత్వం రెమిషను ఇచ్చింది.

అనావృష్టివల్ల తీవ్రంగా దెబ్బతిన్న 91 గ్రామాలలో 1371వ ఫసలీకి వసూలు చేయవలసివున్న భూమిశిస్తు, తక్కావీ ఋణపు కిస్తుల (ప్రస్తుతం చెల్లించవలసినవీ, బకాయీలు) వసూళ్లను కూడా ప్రభుత్వం ఒక సంవత్సరం వరకు వాయిదా వేసింది.

## జిల్లాలలో కోర్టు భాషలు

దిగువ పేర్కొన్న జిల్లాలలోని హైకోర్టు యొక్క సబార్డినేటు కోర్టులలో ఆయాజిల్లాల పేర్లకు ఎదురుగా పేర్కొన్న భాషలను కోర్టుభాషలుగా సివిల్ ప్రొసీజర్ కోడ్ నిబంధనల క్రింద ప్రభుత్వం ప్రకటించింది:-

| జిల్లా పేరు | కోర్టుభాష లేదా భాషలు |
|---|---|
| అనంతపురం | తెలుగు, ఉరుదు, కన్నడం |
| చిత్తూరు | తెలుగు, తమిళం |
| కడప | తెలుగు, ఉరుదు |
| కృష్ణ | తెలుగు |
| కర్నూలు | తెలుగు, ఉరుదు, కన్నడం |
| పశ్చిమ గోదావరి | తెలుగు |
| తూర్పు గోదావరి | తెలుగు |
| గుంటూరు | తెలుగు |
| నెల్లూరు | తెలుగు |
| విశాఖపట్నం | తెలుగు, ఒరియా |

| | |
|---|---|
| శ్రీకాకుళం | తెలుగు, ఒరియా |
| ఆదిలాబాదు | తెలుగు, ఉరుదు, మారాఠీ |
| హైద్రాబాదు | తెలుగు, ఉడుదు |
| కరీంనగరం | తెలుగు |
| ఖమ్మం | తెలుగు |
| మహబూబ్‌నగరం | తెలుగు, ఉరుదు |
| మెదక్ | తెలుగు, ఉరుదు, కన్నడం |
| నల్గొండ | తెలుగు |
| నిజామాబాదు | తెలుగు. ఉరుదు |
| వరంగల్ | తెలుగు, ఉరుదు |

క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌నిమిత్తమై కూడా పై భాషలే ఆయా జిల్లాలలో కోర్టుభాషలుగా వుంటాయి.

## పంచాయతీరాజ్య వ్యవస్థ పునర్నిర్మాణం

1962 ఆగస్టు మొదటి తేదీ నుంచి పంచాయతీరాజ్ కమీషనరు కార్యాలయాన్ని ప్రణాళికలు, స్థానిక పరిపాలనాశాఖలో కలపడానికీ, రెవెన్యూ బోర్డు ఆరవసభ్యుడు, ముగ్గురు పంచాయతీరాజ్ డిప్యూటీ కమీషనర్లు, జాయింట్ కమీషనరు ఉద్యోగాలను రద్దు చేయడానికీ, పంచాయతీరాజ్ అసిస్టెంట్ కమీషనరు ఉద్యోగాలు నాలుగింటిలో మూడింటిని భర్తీచేయకుండా వుంచడానికీ, నాలుగవ దాన్ని రెవెన్యూ బోర్డుకు బదిలీ చేయడానికి ప్రభుత్వం ఆదేశించింది.

పంచాయతీరాజ్ కమీషనరుకుగల అధికారాలను (రివిజినల్, అప్పెల్లేటు) ప్రభుత్వ ప్రణాళికలు, స్థానిక పరిపాలనా శాఖ గానీ లేదా ఇందు నిమిత్తం నియోగించబడే ఆ శాఖ యొక్క అధికారి గాని కలిగివుంటారు. పంచాయతీరాజ్ డిప్యూటీ కమీషనరు, అసిస్టెంట్ కమీషనర్ల అధికారాలనూ, విధులనూ తమ అధికార ప్రాంతంలో కలెక్టర్లు నిర్వహిస్తారు.

## సరుకుల అక్రమ రవాణాల నిరోధనకు సిబ్బంది

సరిహద్దు ప్రాంతాలలో సరుకుల అక్రమ రవాణాను నిరోధించే నిమిత్తం ఆదిలాబాదు, నిజామాబాదు జిల్లాలలో నియమించబడిన సిబ్బందిని 1962 జూలై మొదటి తేదీ నుంచి 1962 సెప్టెంబరు 30 వ తేదీ వరకు కొనసాగించడానికి ప్రభుత్వం మంజూరీ ఇచ్చింది. ఆంధ్రప్రదేశ్ నుంచి బొంబాయి వంటి దక్షిణ మండలం వెలుపలి ప్రాంతాలకు దొంగ చాటుగా బియ్యం, వరి ధాన్యాలను చేరవేయడాన్ని నిరోధించే నిమిత్తం సరిహద్దు ప్రాంతాలలో ప్రభుత్వం ఇదివరలో ఈ సిబ్బందిని నియమించడం జరిగింది.

## సిమెంటు పరిశ్రమ

ఆంధ్రప్రదేశ్‌లో 1947 వ సంవత్సరపు పారిశ్రామిక వివాదాల చట్టం నిమిత్తమై సిమెంటు పరిశ్రమను 1962 జూలై 21 వ తేదీ లగాయతు మరో ఆరు నెలల వరకు ప్రజోపయోగ సర్వీసుగా ప్రభుత్వం ప్రకటించింది.



# చీకటిలో వెలుగు

శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు

పాత్రలు:— మూర్తి, రామారావు, కనకరాజు, రామయ్య, వేదవతి

అది ఒక చిన్నగది. అధునాతనంగానే అమర్చబడివుంటుంది. కాని, ఫర్నీచర్ అట్టేలేదు. ఎడమవేపు గోడను ఆనుకొని ఓ చిన్న టేబిలు, టేబిలు ముందు ఓ కుర్చీ, ఆ ప్రక్కనే గోడ ప్రక్కగా పుస్తకాల షెల్ఫు వుంటాయి. టేబిలు మీద నాలుగైదు పుస్తకాలు అమర్చబడి వుంటాయి. గోడలకు రెండుమూడు ఫ్రేము కట్టించిన పటాలు వుంటాయిగాని, అవి ఫలానా వారి ఫోటోలని కాస్త దూరంనుంచి స్పష్టంగా గుర్తుపట్టడం కష్టం.

తెర తొలిగే సరికి, రామయ్య బీడీ కాల్చుకుంటూ, టేబిలు ప్రక్కనే గోడకి చేరబడి వుంటాడు. అప్పుడే వేదవతి బైట నుండి వస్తుంది. చూడ్డానికి యూవసి. తెల్లని సిల్కుచీర, తెల్లని బ్లౌజు ధరించి వుంటుంది. చేతిన వానిటీ బేగ్ వుంటుంది. ఆమె రాగానే రామయ్య లేచి నుంచుని, బీడి ఆర్పేసి మొల్లో దోపుకుంటాడు.

రామ: వచ్చేశారా అమ్మగారూ: చీకటి పడ్డది...యింకా తమరు రాలేదేమా అని గాబరా పడుతున్నా.

వేద: ఒక స్నేహితురాలు రమ్మంటే, స్కూలునుంచి అలా వెళ్ళాను రామయ్యా వేగిరం వచ్చేద్దామంటే, ఆవిడ విడిచి పెట్టింది కాదు. (కుర్చీలో కూచుని బేగ్ టేబిలు మీద పడేస్తుంది) వాళ్ల కుటుంబాన్ని చూస్తుంటే, ముచ్చటేస్తుంది రామయ్యా: భర్త బెంగాలు దేశంలో యేదో వుద్యోగం చేస్తున్నాట్ట. పిల్లల చదువుకోసమని యీవిడ యిక్కడే వుద్యోగంచేస్తూ హాయిగా జీవితం గడుపుతుంది. ఆమెకి యిద్దరు పిల్లలు. నిజంగా పసిడి బొమ్మల్లా వున్నారంటే, నమ్ము. ఆవిడ యెంత అదృష్టవంతురాలు రామయ్యా!

రామ: (నిట్టూర్చి) అదృష్టాన్నిబట్టే, అన్ని సుఖాలూ సమకూడుతాయమ్మా. మూర్తిబాబుగారు యిలా మిమ్మల్ని ద్రోహం చేసి యెటోపోయారు గాని లేకుంటే, మీరూ ఆనందంగా వుండవల్సిన వారేకదా.

వేద: (బాధగా) అదే నేనూ అప్పుడప్పుడు ఆలోచిస్తూ వుంటాను రామయ్యా: (నిట్టూర్చి) నా బ్రతుకు యింత వ్యధకు గురికావడానికి, పూర్వజన్మలో నేను యే పాపం చేశానో, అనిపిస్తుంటుంది అప్పుడప్పుడు. గాయపడిన నా హృదయానికి వూరట గల్గిస్తూ, తండ్రిలా నువ్వు తోడునీడగా వుండకపోతే, నాగతి యేంకాను.

రామ: అలా అనకండమ్మా: మీవంటివారి నీడలో బ్రతికే అవకాశం అందరికీ అందుబాటులో వుంటుందా: మూర్తిబాబు కూడా మంచివారేనమ్మా: ఆయన యెందుకిలా ప్రవర్తిస్తున్నారో నాకూ బోధపడ్డంలేదు.

వేద: (సాలోచనగా) రామయ్యా:

రామ: అమ్మా

వేద: ఆయన వుద్యోగం విడిచిపెట్టి వుంటారనే నమ్ముతున్నావా?

రామ: అటువంటిదేమీ జరగలేదనే కదమ్మా, ఆఫీసులో భోగట్టా చేస్తే తెలిసింది? ఎప్పటికైనా తిరిగి వస్తారని నాకు నమ్మకముంది.

వేద: (క్షణం ఆగి దుఃఖంతో) ఎందుకో రామయ్యా, నాకు భయమేస్తుంది. మావాళ్లందరికీ దూరమై, అతనే నా సర్వస్వంగా భావించుకుని వచ్చేశాను. మనసులు కలిసిన మా యిరువురం, అరమరలేకండా స్వర్గధామంలో స్వైరవిహారం చేస్తామని కలలు గన్నాను.

రామ: మళ్ళీ మీరు మొదటికే వస్తున్నారమ్మా: జరిగిందేదో జరిగింది. అదంతా మర్చిపోండి.

వేద: (బాధగా) ఎలా మర్చిపోయేది రామయ్యా? అసలు, అదెట్లా సాధ్యమౌతుంది: జీవితం నందనోద్యానవనంలా చేసుకోవాలని యెన్నో కలలు కన్నాను. మూర్తిలాంటి వ్యక్తిని భర్తగా పొందినందుకు యెంతో మురిసి పోయాను. మా వాళ్ళందర్నీ దూరం చేసుకున్నా అంత బాధపడలేదు... కాని...చివరికి యేమయ్యింది? చివరికి మిగిలిందేవిఁటి? స్వప్నసీమలే:

రామ: ఊరుకోండమ్మా: తవ్వుతున్నకొద్దీ గతమంతా గుర్తుకొచ్చి బాధిస్తుంది. మీరు దిగులు పడినా ప్రయోజనం యేమీ లేదు... కాఫీతెస్తానుండండి. (ప్రేక్షకులకు యెదురుగా వున్న ద్వారంగుండా లోపలికి పోతాడు)

[వేదవతి నిర్జీవంగా కూచుంటుంది. ఏవో తప్పులు గుర్తుకొచ్చి, కళ్ళు చెమ్మగిలితే. చీరచెంగుతో ఓసారి ఒత్తుకుంటుంది.]

రామ: (కాఫీ కప్పుతో ప్రవేశించి) నిప్పు ఆరిపోయి కాఫీకాస్త చల్లారిందమ్మా: మళ్ళీ వేడిచెయ్యి మంటే చేస్తాను.

వేద: వద్దులే రామయ్యా, ఇలా తే...(కాఫీ తీసుకొని) నువ్వు నౌకరివి కాదు రామయ్యా: ఆప్తుడివి. నువ్వు లేకపోతే, నాకు ఆత్మహత్యే శరణ్యమయ్యేది,

రామ: (గతుక్కుమని) అటువంటి మాటలనకండి. మీకేం? లక్షణంగా చదువుకున్నారు. నిక్షేపంలా వుద్యోగం చేసుకుంటున్నారు. ఆత్మహత్య చేసుకునే ఖర్మ మీకేం పట్టింది? హాయిగా బ్రతకొచ్చు.

వేద: (ఖాళీకాఫీకప్పు టేబిలు మీద పెట్టి) ఏం హాయి రామయ్యా! పొట్ట పోషించుకోవడానికే వుద్యోగం చేస్తున్నాము గాని, హాయిగా వుందని కాదు. ఎంత చదువుకున్నా. యే వుద్యోగం చేస్తున్నా, స్త్రీకి భర్త, సంసారం, పిల్లలు– వీళ్ళే హాయి నిచ్చేది. నా అంతరాళంలో యెంత ఆవేదన పొంచి వుందో, యెవరికీ తెలీదు రామయ్యా!

రామ: (ప్రసంగం మార్చాలనుకుని) అన్నట్టు, బజారుకి వెళ్ళాలమ్మా.

వేద: ఇప్పుడెందుకు రామయ్యా?

రామ: రేపటికి కాఫీ గుండ తెచ్చుకోవాలి...

వేద: సరే: వెళ్ళి వేగిరం వచ్చేయ్ సుమా: నాకు భయమేస్తుంది.

రామ: ఇక్కడున్నట్టు వచ్చేస్తానమ్మా: (వెళ్ళిపోతాడు).

వేద: ఇదిగో డబ్బు తీసుకెళ్ళి (బేగ్‌లోని రెండు నోట్లు తీసి యిస్తుంది)

రామ: (తల గోక్కుంటూ) డబ్బు సంగతి మర్చే పోయాను చూడండి...

వేద: వేగిరం రావాలి సుమా.

రామ: చిటికెలో వచ్చేస్తానమ్మా: (నిష్క్రమిస్తాడు)

[వేదవతి నిర్జీవంగా లేచి, వానిటీ బేగ్‌ని జీఫోట్ మేకుకి తగిలించి, ఆ ఫోటోను చెమ్మగిల్లిన కళ్ళతో తదేకంగా చూస్తుంటుంది. అప్పుడే బైటనుండి రామారావు వస్తాడు. స్ఫురద్రూపి... షరాయి, లాల్చీ వేసుకుని వుంటాడు].

రామా: నమస్కారమండీ వేదవతిగారూ:

వేద: (చప్పున వెనక్కి తిరిగి) ఓ: మీరా...నమస్కారం... యేవిఁటిలా వచ్చారు:

రామా: కొత్తేమీ లేదు లెండి. మీతో కాస్సేపు మాట్లాడి పోదామని...అంతే

వేద: నిల్చుండి పోయారు...కూర్చోండి.

రామా: (కుర్చీ ముందుకు తీసుకుని ఆమెకి అభిముఖంగా కూచుంటూ) మరి, మీరు నుంచుండి పోయారు...?

వేద: ఫరవాలేదు లెండి.

రామా: మీరు నుంచుని మాట్లాడుతూ వుంటే, నాకూ నుంచోవాలనిపిస్తుందండీ?

వేద: మంచివారేనండీ: (బుక్‌షెల్ఫు ప్రక్కన వున్న స్టూలు తెచ్చుకొని కూచుంటుంది)

రామా: ఆదోలా వున్నారేమండీ?

వేద: (తడబడుతూ) అబ్బే...యేమీ లేదండీ?

రామా: మీరు మీ దిగులును దాచడానికి ప్రయత్నిస్తున్నారుగాని మిమ్మల్ని చూసే ప్రతివారూ యిట్టే పసిగట్టేస్తారు.

వేద: (చిన్నగా నవ్వి) మీరు భ్రమపడుతున్నారేమో: నాకేమీ దిగులు లేదు, రామారావుగారూ: నేనెప్పుడూ నవ్వుతూ తిరుగుతుంటాను.

రామా: అది మీ ప్రయత్న ఫలితం. కాని, నిజానికి మీ హృదయం వ్యథాభరితం.

వేద: (మొహం దించుకుని) పోనీలెండి ... అవన్నీ యిప్పుడెందుకు ? ప్రతిస్త్రీ జీవితంలోనూ యేదో ఒక అసంతృప్తి వుంటుంది.

రామా: అది నిజమే కావచ్చు కాని, అసంతృప్తి, వ్యథకు కారణభూతమవ్వదు: నిరుత్సాహాన్ని కలిగించవచ్చును గాని. మనోవ్యథను సృష్టించదు.

వేద: (నవ్వు తెచ్చుకుంటూ) అబ్బే: నాలో యేమీ మనోవ్యథ లేదండీ:

రామా: అని మీరు అనుకుంటున్నారు. కాని, పరిశీలనా దృష్టితో మీ మొహాన్ని పరికిస్తే, మనోవ్యథ మీలో పాతుకుపోయి వుందని తెలిసి పోతుంది.

వేద: మీరొక్కరే యిలా అంటున్నారు గాని, యింతవరకూ యెవ్వరూ అనలేదండీ:

రామా: (నిట్టూర్చి) ఆవేదన అనుభవించిన వాళ్ళకే, యెదుటివారి వేదన గ్రాహ్యమౌతుంది గాని, అందరికీ సాధ్యపడుతుందటండీ?

వేద: (ఆశ్చర్యంగా అతనికేసి చూసి) అంటే, మీరూ మనోవ్యథ రుచి చూసినవారే నన్నమాట:

రామా: (నిట్టూర్చి) అదంతా ఓ పెద్ద కథ లెండి. మొన్న మొన్నటి వరకూ, నేను సజీవంగా వున్నట్టే అనిపించేది కాదు. ఈ కాస్త జీవితంలోనే, తట్టుకోలేనంత ఘాతం తగిలింది, దాంతో మనిషిని కృంగిపోయాను. మళ్ళీ యిదిగో – మీతో పరిచయం అయ్యాక, క్రమంగా వుత్సాహాన్ని పుంజుకుంటున్నాను, మనిషిగా కోలుకుంటున్నాను.

వేద: (అర్థంగాక అయోమయంగా చూసి) మీరంటున్నది యేమిటో నాకు బోధపడ్డం లేదండీ: నన్ను చూశాక, మీరు వుత్సాహాన్ని పుంజుకోవడమేమిటి?

రామా: (తడబడి) అబ్బెబ్బే: యేమీ లేదండీ: మీ పరిచయభాగ్యం కలిగిన తర్వాతనే నా వ్యథను క్రమంగా దూరం చేసుకోగలుగుతున్నాను.

వేద: మీరంత వ్యథకు గురికావడానికి కారణం?

రామా: (నిట్టూర్చి) తెలుసుకోవాలన్న కుతూహలం మీలోవుందా?

వేద: ఒకరి బాధను మరొకరు తెలుసుకోడానికి, కుతూహలమే అవసరమంటారా?

రామా: కాదనుకోండి. అయినా, నేనుచెప్పింది మీరు నమ్ముతారా?

వేద: ఈ సందేహం మీకెందుకు కలిగిందో అర్థం కావడంలేదు.

రామా: మీరు నమ్మరేమోనని.

వేద: మీరు నిజమే చెప్తున్నపుడు, నమ్మకపోవడానికేముందండీ:

రామా: (క్షణం నిశ్శబ్దంగా వుండి–నిట్టూర్చి) నా తలిదండ్రులు నా చిన్నతనంలోనే పోయారు. మేనమామ యింట్లో పెరిగాను. చదివాను. ప్రయోజకుణ్ణి అయ్యాను. ఆ వూళ్ళోనే వుద్యోగం దొరికింది. మాయింటి ప్రక్కనే వుండేది సరస్వతి. చిన్నప్పట్నుంచీ, మా యిరువురిలో అదో విధమైన అనురాగం పెనవేసుకుంది, ఆమెకి యుక్తవయసు వచ్చే సరికి కట్టుబాట్లు అడ్డువచ్చాయి. అయినా, మా అనురాగం సన్నగిల్లలేదు. అప్పుడప్పుడు చాటుమాటుగా కలిసేవాళ్ళం. ఇంతలో ఆమెకి పెళ్ళి సంబంధాలు చూడ్డం ప్రారంభించారు. పాపం, ఆమె కలవరపడింది. ఎక్కడికైనా పారిపోదామంది. ఆమెలో అంత ధైర్యం యెలా వచ్చిందో నాకే ఆశ్చర్యమేసింది, సభ్యతగా వుండదన్నాను నేను. కాని, ఆమె నాతో యేకీభవించలేదు. ఒకే పట్టుమీద కూచుంది. ప్రాధేయపడింది,. యేడ్చింది.. ఆత్మహత్య చేసుకుంటానని భయపెట్టింది. నా మనసు కరిగిపోయింది. అప్పట్లో నా దృష్టికి సంఘం, సభ్యత, కనిపించలేదు. నా కనుపాపల్లో స్థావరం యేర్పర్చుకుంది సరస్వతి రూపమే: ఒక నాటి రాత్రి బైలుదేరాం.

వేద: (అసక్తిగా) ప్రస్తుతం ఆ అమ్మాయి మీదగ్గరేవుందా:



1962 జులైలో ఆంధ్రప్రదేశ్‌ను దర్శించిన ఉత్తర భారత జర్నలిస్టుల బృందం. నల్లగొండ జిల్లా, మట్టంపల్లి స్త్రీల పంచాయతీ సభ్యురాండ్రతో ఉన్న ఫోటో.



సైనిక సాంకేతిక శిక్షణ పథకాన్ని అనుసరించి, హైద్రాబాదులోని ప్రభుత్వ పాలిటెక్నికులో ఎ.యం.ఐ.ఇ. కోర్సులకు ఆగస్టు 1వ తేదీన ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేసినప్పుడు వచ్చిన ఆహూతుల దృశ్యం



మెదక్ జిల్లా, దుబ్బకొండలో లంబాడి కాలనీలోని పాఠశాలలో లంబాడీబాలలు.



1962 జులై 11 వ తేదీన హైదరాబాదులోని ప్రాంతీయ రీసర్చి లెబొరేటరీలో, జాతీయ లెబొరేటరీల డైరెక్టర్ల 10వ సమావేశానికి కేంద్రప్రభుత్వ శాస్త్రీయ పరిశోధన, సాంస్కృతిక వ్యవహారాలమంత్రి ప్రొఫెసరు హుమాయున్ కబీరు ప్రారంభోత్సవం చేశారు.



రూ. $3\frac{1}{2}$ లక్షల ఖర్చుతో సికింద్రాబాదులో నిర్మింపబడిన హెడ్ పోస్టాఫీసుకు 1962 జులై 13వ తేదీన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి ప్రారంభోత్సవం చేశారు.



నల్లగొండజిల్లా తాటిపాముల గ్రామంలోని శ్రీ నలమడ రాఘవరెడ్డి, శ్రీ రామారావులు తమ గ్రామంలో మాధ్యమిక పాఠశాలకై రూ. 20,000 లు విలువ చేసే వారి భవనాన్ని విరాళంగా యిచ్చారు.



విరాళంగా ఇచ్చిన భవనం.



ఆగస్టు, 2, 3. తేదీలలో హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన పార్లమెంటు సభ్యుల సమావేశంలో ముఖ్యమంత్రి ప్రసంగించినప్పటి చిత్రం.



**బహుమతి పతకాల ప్రదానం:—** 1962 ఆగస్టు 15వ తేదీన సికింద్రాబాదు పెరేడు మైదానంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి తొమ్మిది మంది రాష్ట్రపోలీసు ఉద్యోగులకు బహుమతి పతకాలను బహూకరించారు:— చిత్రంలోనివారు: శ్రీకాకుళం జిల్లాలోని పోలీసు కానిస్టేబుల్ (ప్రస్తుతం మందాసలో ప్రోహిబిషన్ గార్డు) శ్రీ పల్లంటి కొండల్‌రావు, వీరోచిత పాత్రకు పోలీసు మెడల్ పొందారు. రిటైర్డు అసిస్టెంటు ఇన్స్పెక్టర్ జనరల్ శ్రీ వి. యస్. రామమూర్తి ఐ. పి. యస్. ప్రతిభాపూర్వకమైన సేవ చేసినందుకు ప్రెసిడెంటు పోలీసు, ఫైర్ సర్వీసుల మెడల్ పొందారు. ప్రశంసనీయమైన సేవచేసినందుకు దిగువవారు పోలీసు మెడల్స్ పొందారు:—

హైదరాబాదులోని అవినీతి నిరోధకశాఖ పూర్వ సంయుక్త డైరెక్టరు (సెలవులోవున్న) శ్రీ కె. రామచంద్రారెడ్డి ఐ.పి.యస్; **విశాఖపట్నం**లోని పోలీసు రిక్రూట్సు పాఠశాల ప్రిన్సిపాల్ శ్రీ డి. నాగదస్తగిరిరెడ్డి; హైదరాబాదులోని అవినీతి నిరోధకశాఖ (తాత్కాలిక) డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు శ్రీ బి. పుల్లయ్య; హైదరాబాదులోని సి.ఐ.డి. క్రైమ్ బ్రాంచి (తాత్కాలిక) డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు శ్రీ టి. డి. అంబాజీరావు; హైదరాబాదులోని సి.ఐ.డి. స్పెషల్‌బ్రాంచి (తాత్కాలిక) పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ సి. శ్రీనివాసులునాయుడు; హైదరాబాదు. సి. ఐ. డి. స్పెషల్‌బ్రాంచి. (తాత్కాలిక) పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ యస్. **రామారావు;** హైదరాబాదు, సి. ఐ. డి. స్పెషల్‌బ్రాంచి (తాత్కాలిక) పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ బి. ఉమామహేశ్వరరావు.

రామా: (ఆవేదనగా) అలా అవుతే, యీ ఆవేదన యెందుకు చెప్పండి? మేం యీ సన్నాహాలు జరుపుతుండటం, మా మేనమామ పసిగట్టేశాడు. నేను సరస్వతిని లేవదీసుకు పోవడం అతనికి ఇష్టంలేదు. అపవాదుకిభయపడికాదు, నా మూలంగా సంక్రమించవల్సిన కట్నాలూ కానుకలు వదులు కోవల్సి వస్తుంది కదా అన్నదే ఆయనబాధ. మేం బయలు దేరాక, ప్రక్కింటివాళ్ళను రేపెట్టాడు అంతే. మేం వూరు పొలిమేరలు దాటామో లేదో, సరస్వతి నాన్నగారు, మా మేనమామ రుద్రమూర్తులై వచ్చి అడ్డగించారు. నానా విధాలా దూషించారు. సరస్వతిని బలవంతంగా తీసుకు పోయారు. నేను మాత్రం తప్పించుకు వచ్చేశాను.

వేద; (చెమ్మగిల్లిన కళ్లను ఒత్తుకుంటూ) పాపం! ఇద్దర్నీ కలరంగా విడదీశారన్నమాట! ఆ అమ్మాయి యెప్పుడన్నా అగుపిస్తూ వుంటుందా.

రామా: (బొంగురు కంఠంతో) ఆ అదృష్టమూ లేక పోయిందండీ. ఆమెను పెళ్ళి చేసుకోమని, నానా హింసలూ పెట్టారట. ఈ రాక్షసత్వాన్ని తట్టుకోలేక మరోగత్యంతరం లేక, ఆత్మహత్య చేసుకొందట. (కాస్సేపు మౌనం)

వేద: (గతుక్కుమని) ఆత్మ హత్య చేసుకుందా?

రామా; మరేం చేస్తుంది చెప్పండి? ఆమె చనిపోయాక, ఆ శుభ వార్త అందించడానికా అన్నట్టుగా. మా మామయ్య వచ్చి కబురుచెప్పాడు. నన్నక్కడికి వచ్చేయ మన్నాడు. సలక్షణమైన సంబంధంచూసి పెళ్ళి చేస్తానన్నాడు...

వేద: (క్షణం ఆగి) పోనీ పెళ్ళి చేసుకోలేక పోయారా? సరస్వతిని క్రమంగా మర్చిపోయేవారేమో!

రామా: (బాధగా) మీరూ అలానే అంటున్నారా వేదవతిగారూ? నా హృదయవీణ భగ్నమయ్యింది. దాన్ని సరిచెయ్యడం అందరికీ సాధ్య పడదేమో:

వేద: (మౌనంగా వూరుకుంటుంది)

రామా: (సంకోచంతో తలవంచుకుని) మీతో ఒక్క విషయం కొద్ది రోజుల్నించీ అనుకుంటున్నాను. కాని, అవకాశం అందు బాటులో లేక వూరుకున్నాను.

వేద: చెప్పండి.

రామా: ఎలా చెప్పడమో బోధపడ్డంలేదు.

వేద: అంతగా సందేహించవల్సిన విషయమేముందండీ?

రామా: (మెల్లగా) మీతో పరిచయమై కొద్దిరోజులే అయ్యింది. పరిచయ వేళా విశేషం యేమిటోగాని, ఆరోజునుంచీ నాలో అవ్యక్తమైన మార్పు వచ్చేసింది. నా మనస్సు అను క్షణం ఓ విధమైన ఆసక్తిని పెంచుకోవడం ప్రారంభించింది. నా జీవితంలో మళ్లీ ఆశ చిగురించింది.

వేద: (అదోలా అతనివేపుచూసి) ఇంతకీ, మీరు చెప్పదలచుకొన్న దేమిటి.

రామా. మనసులో వున్న మాటను విడమర్చి చెప్పలేక పోతున్నానండీ! అయినా చెప్పక తప్పదు. మీకు...(సంకోచంతో) యిష్టమైతే మిమ్మల్ని నేను వివాహం చేసుకుంటాను. (ఆమె మొహంలోకి ఆసక్తిగాచూస్తాడు)

వేద: (షాక్ తిన్నట్టుగా లేచినుంచుని) నన్ను వివాహం చేసుకుంటారా?

రామా: (లేచినుంచుని ప్రాధేయపూర్వకంగా) కాదనకండి వేదవతి గారూ! ఈ భావనకొద్దిరోజుల్నించి అంతరాళంలో మెదులుతున్నా వెల్లడిచేసే ధైర్యం లేకపోయింది. ఇది నా అభ్యర్థనే అనుకోండి..మీ సమక్షంలో పెడుతున్నా. నా జీవితాన్ని పుష్పింపజేస్తారో లేక మోడువారి పోతూవుండే చూస్తూ వూరుకుంటారో. మీదే బాధ్యత.

వేద: (నిట్టూర్చి) నన్ను అపార్థం చేసుకుంటున్నారు రామారావు గారూ! నేను అవివాహితను కాను.

రామా: (నిశ్చేష్టుడై) ఏమిటీ?

వేద: ఆశ్చర్య పడకండి. నేను వివాహితనే. (నిట్టూర్చి) అవుతే నేం_మీలానే వ్యధకులోనై, జీవచ్ఛవంలా బ్రతుకుతున్నాను. మీకూ, నాకూ, వ్యత్యాసం ఏమిటంటే, మీరు పరులచే మోసగింప బడ్డారు. నేను, మనసిచ్చిన వ్యక్తిచే తనే మోసగింపబడ్డాను.

రామా: మీ ఆయన మోసగించారా?

వేద: నేను చాలా దురదృష్టవంతురాల్ని రామారావుగారూ! (నిట్టూర్చి) మేం ప్రేమించుకున్నాం, కాని, పెళ్లిచేసుకోవడానికి పరిస్థితులు అనుకూలించలేదు. లేచివచ్చాం. మా

వాళ్ళనందరిని విడిచి, నా జీవిత సర్వస్వం అతని చేతిలో పెట్టాను. నా సౌందర్యము, నాగౌరవం, నా హృదయం, నా వ్యక్తిత్వం. అన్నీ అతనికే అర్పించాను. కాని, యేం లాభం: నా త్యాగానికి తగిన ప్రతిఫలాన్ని పొందలేక పోయాను. ఆయన నన్ను విడిచి యెక్కడికో పోయారు. పుట్టింటికి పోయే ధైర్యం లేదు. ఆత్మహత్య చేసుకుందుకు పిరికితనం అడ్డొచ్చింది. ఏంచెయ్యను. ఆయన ఎప్పటికైనా రాకపోతారా, అని నిరీక్షిస్తూ నిర్జీవంగా రోజులు గడుపుతున్నా. మీకు నిరాశ కల్గించినందుకు క్షంతవ్యురాల్ని.

రామా: (భారంగా నిట్టూర్చి) నేను చాలా అభాగ్యుణ్ణండీ? నా మనసులోని భావాన్ని మీతో వెల్లడిచేసు కోవాలనీ, మిమ్మల్ని ప్రాధేయపడి మీ అభిమానం సంపాదించాలనీ, ధృఢ నిశ్చయుడనై వచ్చాను యివ్వేళ. కాని ... కాని ... యిక్కడా నాకు దురదృష్టదేవతే స్వాగతమిచ్చింది. నాలో రేగిన ఆశ చప్పగా అణగారి పోయింది. ఏం చెయ్యను?

వేద: బాధపడకండి రామారావుగారూ: నా మాట వినండి. మీకు నచ్చిన అమ్మాయిని చూసి, పెళ్ళి చేసుకోండి.

రామా: (బాధగా నవ్వి) పెళ్ళి! హూ...నాలో యింక ఆ ఆసక్తిగాని, ఆశగానీ లేదండీ. ఈ జీవితంలో నేను తెచ్చి పెట్టుకున్నది యింతవరకే ఇలా మోడువారిన బ్రతుకు సాగవల్సిందే:

[కుడివేపు నుండి రామయ్య ప్రవేశం ... అతని చేతిలో పొట్లాలు వుంటాయి].

రామా: (వస్తూనే) నమస్కారం బాబూ:

రామా: (పక్కకి తిరిగి కళ్ళు ఒత్తుకుని) నమస్కారం...ఎక్కడికి వెళ్ళావేంటి రామయ్యా ?

రామ: బజారుకి వెళ్ళానండీ.

వేద: రామయ్యా, కాఫీ పెట్టు.

రామా: అబ్బే: నాకిప్పుడేమీ వద్దండీ:

వేద: అలా అనకండి. వెళ్ళు రామయ్యా:

( రామయ్య చిరునవ్వుతో లోపలికి నిష్క్రమిస్తాడు )

రామా: సరేగాని, వేదవతిగారూ, ఆయన యెక్కడున్నారో, ఆరా తియ్యడానికి ప్రయత్నించారా ?

వేద: ఎక్కడికి పోగలను చెప్పండి? ఫలానా ప్రాంతంలో వున్నారంటే, ప్రయత్నించడం సాధ్యపడుతుందిగాని, దేశమంతా గాలించడం నా తరమా ? అయినా, అదృష్టం వంకరైనప్పుడు మనం యెన్ని ప్రయత్నాలు జరిపినా, ఫలితం శూన్యమే:

రామా: అయినా, మిమ్మల్ని ప్రాణసమంగా ప్రేమించిన వ్యక్తి, యీ విధంగా ద్రోహం చేశాడంటే, నమ్మశక్యం కావడం లేదండీ:

వేద: అదే నాకూ బోధపడ్డం లేదండీ : ఆయన మనస్ఫూర్తిగా నన్ను మోసగించి వుంటాడని నమ్మలేకుండా వున్నాను.

రామా: అవుతే, యెవరో ఆయన్ని మీ నుండి దూరం చెయ్యడానికి చేసిన ప్రయత్నమే అంటారా ?

వేద: దూరంగా యోచిస్తూవుంటే, అదే అయ్యుంటుందనిపిస్తోంది.

రామా: ఈ ప్రయత్నానికి పూనుకున్నది, యెవరని మీ అనుమానం ?

వేద: నిశ్చయంగా చెప్పలేను. ఆయన తండ్రే యెందుకు అయుండకూడదు ?

రామా: ఔను: అది సాధ్యమే:

( రామయ్య కప్పులతో కాఫీ తీసుకొస్తాడు, చెరో కప్పు అందిస్తాడు )

రామా: (కాఫీ తీసుకుంటూ) ఇప్పుడెందుకు చెప్పండి మీకీశ్రమ?

వేద: (చిన్నగా నవ్వి) శ్రమతీసుకున్నది నేను కాదు కదండీ!

[ ముగ్గురూ మెల్లిగా నవ్వుతారు ]

రామా: (ఖాళీ కప్పు టేబిలు మీద పెట్టి) వస్తానండీ. (లేస్తాడు)

వేద: మంచిది.

రామా: రామయ్యా: వస్తా... (నీరసంగా నిష్క్రమిస్తాడు)
(వేదవతి అతని వేపే సానుభూతితో చూస్తుంది. రామయ్య అమాయకంగా చూస్తాడు)

రామ: రామారావు బాబు యేమంటారమ్మా?

వేద: (నిట్టూరుస్తూ కుర్చీలో కూలబడి) ఏమీలేదు రామయ్యా అతని జీవితగాధ వెల్లబోసుకుంటున్నాడు. పాపం, అతనూ నాలానే విధివంచితుడు. ప్రేమించిన స్త్రీ అతణ్ణి

మోసగించలేదు గాని మనసులు కలిసిన వాళ్ళిద్దర్నీ సంఘం వేరుచేసింది. స్వార్థపరులు వేరు చేశారు. దాంతో ఆ అమ్మాయి మనోవ్యధకు లోనై, కృశించి, ఆత్మహత్య చేసుకుంది. ఈయన జీవచ్ఛవంలా జీవితాన్ని గడుపు తున్నాడు.

రామ: పాపం! ఈయన చాలా మంచివారమ్మా! అయినా, భగ వంతుడు మంచివారికే కష్టాలు తెచ్చి పెడతాడు ... ఎందుకో?

వేద: అదే సృష్టి వైచిత్ర్యం రామయ్యా! మంచివారిని కష్టాల్లో ముంచకపోతే, మానవులంతా, తన వునికినే విస్మరిస్తారని భగవంతుని భయం.

రామ: మంచి దేవుడేనమ్మా! అయినా, యీ బాబుగారు మళ్ళీ పెళ్ళి చేసుకుంటే కాదూ?

వేద: (కలవర పడి) మనసు విరిగి, విరక్తిని నింపుకున్నాట్ట. అయినా, అతనికి నచ్చినవాళ్ళు చేతికి అందకుండా, చేతికి అందుతారనుకున్న వాళ్ళు అతనికి నచ్చకుండా వుంటే, పెళ్ళి యెలా సాధ్యపడుతుంది రామయ్యా?
(బైటనుండి 'రామయ్యా' అన్న కేక వినిపిస్తుంది)

వేద: (ఆత్రంగా) ఎవరో పిలుస్తున్నట్టుంది రామయ్యా! వెళ్ళిచూడు.

రామ: బాబుగారే అవుతే, లోపలికి రాకుండా వుంటారా అమ్మా?

వేద: (నిరుత్సాహంతో) అదీ నిజమేలే...పోనీ, యెవరో చూడు.
(రామయ్య బైటికి వెళ్ళి క్షణంలో తిరిగివస్తాడు)

రామ: (మెల్లగా) కనకరాజుగారు వచ్చారమ్మా.

వేద: (కనుబొమలు ముడుస్తూ) ఈ వేళప్పుడా? ఎందుకు?

రామ: ఏమోనమ్మా! మీరున్నారా అని అడిగారు.

వేద: సరే... వచ్చిన పెద్దమనిషిని పొమ్మనలేంగా! రమ్మను.
(లేచి నిల్చుంటుంది)
[రామయ్య బైటికి వెళ్తాడు. కొద్ది క్షణాల్లో కనకరాజు వెంట రాగా, లోపలికి వస్తాడు. కనకరాజు పొట్టిగా చామనఛాయ రంగులో లీవిగా వుంటాడు. కోరమీసాలు. తెల్లని గ్లాస్కో పంచె, సిల్కు లాల్చీ. పైమీది కండువా– యివన్నీ అతను డబ్బున్నవాడని చెప్తాయి.]

వేద: (అయిష్టంగా) నమస్కారమండీ!

కన: నమస్కారం... (అంటూ వచ్చి వేదవతి చెప్పకుండానే కుర్చీలో కూర్చుంటాడు)

వేద: వేళ్ళకాని వేళప్పుడు వచ్చారే...?

కన: (అదోలా నవ్వి) అబ్బే... అబ్బే... యీ వీధికి వెళ్ళి వస్తూ, ఓసారి మిమ్మల్ని చూసిపోదామని యిలా వచ్చాను. (యింటి కప్పుకేసి చూస్తూ) ఇల్లు యెక్కడా కారడం లేదు కదండీ.

వేద: అసలు వర్షాలు పడ్డం లేదు కదండీ.

కన: (గతుక్కుమని) ఔను కదూ! మతిమరుపు యెక్కువ లెండి. ఇల్లు సదుపాయంగా వున్నట్టేనా?

వేద: సదుపాయంగా లేదని మీకు చెప్పినట్టు, నాకు జ్ఞాపకం లేదే!

కనక: (దెబ్బతిని) మీతో మంచి చిక్కేనండీ. అంత కోపంగా మాట్లాడితే యెలా? ఏదో యింటి యజమాని గనుక అడ గడం నా విద్యుక్త ధర్మం. అరెరె... మీరలా నిల్చుండి పోయారే... కూచోండి... కూచోండి...

వేద: ఫరవాలేదు లెండి...

కనక: మీతో మంచి చిక్కేనండీ. మీరు నిల్చుని వుంటే, నాకే బాధగా వుంది... సరేగాని రామయ్యా రాకరాక వచ్చాను. కాస్త కాఫీ అయినా వేడి పెట్టవయ్యా: (మందహాసం చేస్తాడు)
(రామయ్య కనకరాజుకేసి కొరకొర చూస్తూ, వేదవతి వేపు చూస్తాడు)

కనక: (అది గమనించి) ఓహో మరిచేపోయాను. మీ అమ్మగారి అనుమతి కావాలి కదూ: (నవ్వి) ఇంటి కొచ్చిన పెద్ద మనిషిని ఆదరించడం, మీ అమ్మగారికి మాత్రం తెలీదా యేవిటి? (వేదవతి వేపు చూస్తాడు)

వేద: (కోపంతో మండిపోతూ–అది వ్యక్తం కాకుండా) వెళ్ళి కాఫీ తీసుకురా రామయ్యా.
(రామయ్య, కనకరాజు వేపు చురచుర చూస్తూ, చేబులు కిందున్న ఖాళీకప్పులు తీసుకుని లోపలికి పోతాడు)

వేద: కనకరాజుగారూ: మీరు యీవేళప్పుడు రావడం యేమీ సమంజసంగా లేదండీ!

కనక: (చిన్నగా నవ్వి) చదువుకున్నారు... పైగా వుద్యోగం చేస్తు న్నారు. మీవంటి నవనాగరికులు యీ మాట అంటున్నా రంటే, నవ్వొస్తుందండీ:

వేద : నవనాగరికులైనంత మాత్రాన, సభ్యత విస్మరించి, సంచరించాలన్న సిద్ధాంతం యెక్కడా లేదండీ.

కనక: యిందులో సభ్యత ప్రసక్తే లేదండీ: స్నేహరీత్యా కలుసుకోవడం తప్పంటారా ?

వేద : అది తప్పు కాదుకాని, దానికి సమయా సమయాలుంటాయి.

కనక: (చిన్నగా నవ్వేసి) సరే లెండి. నా తప్పును నేను సమర్థించాను. అన్నట్టు, మీ ఆయన సంగతి యేమన్నా తెలిసిందా ?

వేద : లేదండి.

కనక: అయినా యిన్నాళ్ళ నుంచి కనబడకుండా యెక్కడికి పోయాడో యేఁటో, ఆ వుద్యోగం కాస్త వూడేటట్టుంది. తర్వాత చింతించిన ప్రయోజనం వుండదు .. అహఁ.... ఆయన మంచిని కోరే చెప్తున్నాను.

వేద : ఆయన తిరిగి వస్తే చాలండి. ఉద్యోగం వున్నా, వూడినా అంత బాధలేదు.

కనక: (వెటకారంగా నవ్వి) ఉద్యోగం వూడినా బాధలేదంటారేవిఁటి ? ఈ వుద్యోగాలు దొరక్క లక్షల మంది కాలే కడుపులు చేతబట్టుకొని నడిరోడ్లపై తిరుగుతున్న యీ రోజుల్లో, మీ ధైర్యం మెచ్చుకోదగ్గదే సుమండీ:

వేద : (నిరాశగా) అదృష్టం కలిసిరానప్పుడు ధైర్యమే శరణ్యం.

కనక: నేనూ మీ ఆయన విషయంలో మేనేజరుతో చెప్పానెండి. చేతనైన సహాయం చేస్తానన్నాడు. నామాట ఆయనెప్పుడూ కాదనడు.

వేద : అయాచితంగా, మాకోసం మీరేందుకండీ శ్రమ తీసుకుంటున్నారు ?

కనక: (మందహాసంతో) ఇందులో శ్రమ యేముందండీ ; మా యిళ్ళల్లో అద్దెకు వుంటున్న వాళ్ళని సహితం, నన్నిహితులుగానే నేను భావిస్తాను. మీ ఆయనకి—ముఖ్యంగా మీకు అన్యాయం జరుగుతూ వుంటే చూస్తూ వూరుకోగలనా చెప్పండి.

వేద: (కటువుగా) మీ అభిమానానికి కృతజ్ఞులమేగాని, మీరిక అటువంటి సిఫార్సులు చెయ్యకండి.

కన: (దెబ్బతిని) అదేఁటండీ:

వేద: అది అంతేనండీ: ఆయన మంచి చెడ్డలు, ఆయన చూసుకోగలరు.

కన: సరే మీరలా చెప్తుంటే నాకేం లేండి. అసలు ఆయన తిరిగి వస్తాడన్న నమ్మకం మీకుందా ?

వేద: (చిరుకోపంతో) రాకపోయినందు వల్ల మీకేమి నష్టం లేదుగా: మీ యింటి అద్దె నేనే యిచ్చుకుంటున్నాను.

కన: అబ్బ: మీతో గొప్ప చిక్కు వచ్చి పడిందండీ: అద్దె విషయంలో భయపడుతున్నాననా, మీ అభిప్రాయం: అటువంటి సందేహం యెప్పుడూ వద్దు. మీ శ్రేయస్సు కోరేవారిలో నేనొకణ్ణి, మీరంటే, నాకు యెంత అభిమానమో మీకు తెలీదు.

వేద: (కటువుగా) తెలుసుకోవల్సిన అవసరం కూడా లేదులెండి.

కన: ఎంత మాట అనేశారు...? మంచికి పోతే, చెడు యెదురవుతుందంటారందుకే సరేలెండి గాని—ఆయన మిమ్మల్ని మోసగించి పోయాడంటే, యింక తిరిగి రావాలన్న వుద్దేశం అతనిలో వుండి వుండదు. మళ్ళీ రాలేదు కూడాను, హాయిగా మరో అమ్మాయిని పెళ్లిచేసుకుని సంసారం సాగిస్తూ వుంటాడు.

వేద: (కోపంగా) ఈ జ్యోతిషం మీకు చెప్పమనలేదే.

కన: ముందే చెప్పాను కదండీ, నా కర్తవ్యం నెరవేర్చు కుంటున్నానని,

వేద: అయినా సరే—మీరు మా స్వవిషయాల్లో జోక్యం కలుగజేసుకోకూడదు...అది అంత శ్రేయస్కరం కాదు. మీరు వయసులో పెద్దలు. అయినా, మీకు చెప్పాల్సి వచ్చింది కదా అన్నదే నా విచారం.

కన: మీ పట్ల నా కుండే ఆదరాభిమానాలు అభివ్యక్తం చేసుకోవడం కూడా తప్పేనన్నమాట. (చిన్నగా నవ్వి) మీ వంటి అమాయకుల్ని నేనింతవరకూ యెక్కడా చూళ్ళేదండీ... మోసాన్ని మోసంతోనే ఖండించాలన్న సూత్రాన్ని మీరు విస్మరిస్తున్నారు.

వేద: (అదోలా చూసి) అంటే మీ వుద్దేశం?

కన: చదువుకున్నారన్న మాటేగాని సూక్ష్మగ్రాహ్యత లేదండీ. (మెల్లగా) ఆయన మిమ్మల్ని మోసం చేశాడని మీకూ తెలుసును. అటువంటప్పుడు మీరెందుకు అతణ్ణి మోసగించ కూడదు? పురాణ కాలంనాటి స్త్రీలవలె యీ కలికాలంలో కూడా మీ వంటి విద్యాధికులు పారమార్థికం ఆలోచిస్తున్నారంటే, ఆశ్చర్యంగా వుందండీ.

వేద: (వెటకారంగా) అవుతే, మీరిప్పుడిచ్చే సలహా యేవిటో కాస్త సెలవిస్తారా ?

( మిగతా వచ్చే సంచికలో )

# పంచాయతీరాజ్య పురోగమనం

## శ్రమదానం

ఆదిలాబాదు జిల్లా జిమ్మ గ్రామస్థులు, శ్రమదానం ద్వారా స్థానిక సేద్యపు నీటి కాలువను మరమ్మతు చేశారు. ఈ పని విలువ సుమారు రూ. 300/-.

## మంచినీటి సమస్య పరిష్కారం

కొడిగెనహల్లి బ్లాకు ముదరెడ్డిపల్లి గ్రామంలో కొత్తగా నిర్మించిన కాలనీలో మంచినీటి సరఫరా ఒక సమస్యగా వున్నది. ఆ కాలనీ కాపురస్థులు ఈ సమస్యను పరిష్కరించడానికి కృత నిశ్చయులై ఒక బావి త్రవ్వకాన్ని ప్రారంభించారు. కొద్ది రోజుల్లోనే నిర్మలమైన నీరు సమృద్ధిగాగల ఒక బావిని వారు నిర్మించుకోగలిగారు.

## వీధి దీపాలకు విరాళం

పుత్తూరు బ్లాకులోని ఒకానొక గ్రామం తిమ్మంపల్లి. ఆ గ్రామంలో వీధిదీపాలు లేవు. గ్రామస్థులంతాకలిసి రూ. 400/-లు ప్రోగుచేసి ఆ మొత్తాన్ని పంచాయతీకి విరాళంగా సమర్పించారు. గ్రామ పంచాయతీ 14 వీధి దీపాలను కొనుగోలు చేసి వీధులలో ఏర్పాటు చేసింది. ఆ వృత్తవ్యయాన్ని స్వంత నిధుల నుంచి భరించడానికి కూడా పంచాయతీ తీర్మానించింది.

## పశువుల ప్రథమ చికిత్సా కేంద్రం

అనంతపురం జిల్లా తిమ్మంపల్లి గ్రామంలో పశువుల ప్రథమ చికిత్సా కేంద్రాన్ని తెరిచారు. మందుల ఖర్చు క్రింద గ్రామ పంచాయతీ రూ. 125/- లు ఇచ్చింది. కేంద్రం కొరకు అద్దె లేకుండా ఒక ఇల్లును కూడా పంచాయతీ ఇచ్చింది.

## మహిళల సంచార గ్రామీణ శిబిరం

చిత్తూరు జిల్లా గంగాధర నెల్లూరు గ్రామంలో, జూన్ రెండవ వారంలో మహిళల సంచార గ్రామీణ శిబిరాన్ని నిర్వహించారు. 44 మంది స్త్రీలు శిబిరంలో పాల్గొన్నారు. మైసూరు రాష్ట్రంలోని అనేక చారిత్రకస్థలాలను, అభివృద్ధిమండలాలను వారు సందర్శించారు.

## వనమహోత్సవం

రాజుపాలెం బ్లాకులో అన్ని గ్రామాలలోనూ వనమహోత్సవ సప్తాహం జరుపుకున్నారు. సప్తాహం సందర్భంలో బ్లాకు ప్రాంతంలోని ప్రతి కుటుంబాన్నీ కనీసం ఒక్క మొక్కనైనా నాటుటకు ప్రోత్సహించడం ఈ ఉత్సవాల ప్రత్యేకత.

## సాముదాయిక వర్కుషాపు

కరీంనగరం పంచాయతీసమితి బ్లాకులోని మానకొండూరులో తొలి గ్రామీణ సాముదాయిక వర్కుషాపును ప్రారంభించారు. గ్రామీణ పనివారలకు ఆధునిక రీతులలో శిక్షణ ఇచ్చే నిమిత్తం రూ. 39,000 ల వ్యయంతో దీనిని నెలకొల్పారు.

## మధ్యాహ్న భోజన పథకం

"కేర్" సహకారంతో చేపట్టిన ఉచిత మధ్యాహ్న భోజన పథకాన్ని ఖమ్మంలో జూలై 26 వ తేదీన ప్రారంభించారు. పథకాన్ని అమలుపరచడానికి రూ. 6000/- లు విరాళంగా ఇవ్వదలచినట్లు స్థానిక మునిసిపాలిటీ ప్రకటించింది.

## రోడ్డు మరమ్మతు

మండవల్లి బ్లాకులోని ఊటుకూరు గ్రామంలో 20 మంది సభ్యులతో కూడిన ఒక యువజన క్లబ్బు వుంది. ఈ గ్రామంలోని మట్టి రోడ్డు చాలా చెడుస్థితిలో వుంది. యువజన క్లబ్బువారు పూనుకొని రోడ్డును మరమ్మతు చేశారు. దీని విలువ: 20 మంది యువకుల శ్రమదానం.

## మేలుజాతి గ్రుడ్లు

పనప ర్తిలో, పశుపోషణ కార్యక్రమం క్రింద మేలుజాతి గ్రుడ్లను, పశులను 50 శాతం విరాళం ప్రాతిపదికపై పంపిణీ చేశారు. 25 శాతం విరాళాల పథకం క్రింద, దరఖాస్తు చేసిన ముగ్గురు వ్యవసాయదార్లకు కోడెలను సరఫరా చేయడానికి ప్రతిపాదించారు.

## 100 శాతం పన్నుల వసూలు

మెదక్ జిల్లాలోని పైత్రగ్రామ పంచాయతీ వర్తమాన సంవత్సరంలో నూటికి నూరుపాళ్లు పన్నులు వసూలు చేసింది. 1962 జూలై 9 నుంచి 15 వరకు ఇండ్ల పన్నుల వసూలుకై మెదక్ సమితి ప్రాంతంలో నిర్వహించిన ప్రత్యేక ఉద్యమ ఫలితమే ఇది.

## పంటల పోటీ పక్షం

రైతులు, పంటలపోటీల ప్రాముఖ్యతను గుర్తించి వాటిలో పాల్గొనునట్లు చేసే నిమిత్తం నల్గొండ జిల్లాలో ఆగస్టు మొదటి తేదీ నుంచి "పంటల పోటీ పక్షం" జరిపారు. ఈ పక్షం రోజులలో ఖరీఫ్ వరి, జొన్న, వేరుసెనగ పంటల పోటీలకు అత్యధిక సంఖ్యలో రైతులను చేర్చుకున్నారు.

## ఉన్నత పాఠశాలకు విరాళాలు

నెల్లూరు జిల్లా చేజర్ల గ్రామ ప్రజలు తమ గ్రామంలో ఒక ఉన్నత పాఠశాలను తెరవడానికి రూ. 10,000 లు విరాళంగా ఇచ్చారు. పాఠశాల భవన నిర్మాణానికై ఐదు ఎకరాల స్థలాన్ని కూడా దానం చేశారు.

## మహిళల పర్యటన కార్యక్రమం

చిట్యాల సమితి జూకల్ గ్రామంలో గ్రామ సేవికలు గ్రామస్థుల నుంచి రూ. 405 ల మొత్తం సేకరించారు. మహిళల పర్యటన కార్యక్రమానికి ఈ డబ్బు ఖర్చు చేస్తారు. రాజేంద్రనగర్ కూ, అభివృద్ధి కార్యక్రమాలు అమలు జరుగుతున్న ఇతర ప్రదేశాలకు స్థానిక మహిళల పర్యటనను ఏర్పాటు చేయదలిచారు.

## పతకాలు

ప్రశంసనీయమైన సేవ చేసినందుకు ఆంధ్రప్రదేశ్ లో ఈ క్రింది పోలీసు అధికారులకు ఆగస్టు 15వ తేదీన రాష్ట్రపతి వారికి పతకాలనిచ్చారు.

పోలీసు, అగ్నిమాపకదళ శాఖలకు రాష్ట్రపతి పతకం హైదరాబాద్ లోని అసిస్టెంట్ పోలీస్ ఇన్ స్పెక్టరు శ్రీ మల్లవరపు తార్డు థామస్ కు లభించింది.

ప్రశంసనీయమైన సేవచేసి పోలీసు పతకాలను పొందిన వారు: శ్రీ రాచపూడి వెంకట నారాయణ సుబ్బారావు, అసిస్టెంట్ పోలీస్ కమిషనర్, క్రైం బ్రాంచ్, హైదరాబాద్; శ్రీ మహమ్మద్ అలీ పోలీస్ సూపరింటెండెంట్, కృష్ణాజిల్లా; శ్రీ పాణ్యం లక్ష్మీనారాయణ, డిప్యూటీ పోలీసు సూపరింటెండెంటు అవినీతి నిరోధకశాఖ, కడప; శ్రీ సయ్యద్ ఇజాజ్ అలీ, పోలీస్ ఇన్ స్పెక్టర్, సి. ఐ. డి. స్పెషల్ బ్రాంచి, హైదరాబాద్: శ్రీ ఆల్. శేషగిరిరావు, పోలీసు ఇన్ స్పెక్టరు, అవినీతి నిరోధక శాఖ, శ్రీకాకుళం; శ్రీ జక్కం సూర్యనారాయణ, పోలీస్ సబ్ ఇన్ స్పెక్టరు, విశాఖపట్నం (ఉత్తరం) జిల్లా.

# హాసలీల-ఆత్మకథ

శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు

ముత్తెపు నెమ్మెఱుంగు, శశిమూర్తి, గిరీశు హారంగు, రెల్లు పూ
గుత్తి బెడంగు, దీరరుచి, కోమలి చెక్కిలి తళ్కు మించు లీ
మొత్తములో సుధాద్రవము పోసి సువాసన గూర్చి ధాత మీ
చిత్తము రంజిలంగననుజేసి యొసంగెనటంద్రునిక్కమే!

మూలపదార్థ సంఘటనమూలముగాఁదగు, నాదుమూర్తులున్
లీలలు భిన్నభిన్నములు, లెక్కకు ముక్కిలి వాచ్యరూపముల్,
వేలగువ్యంగ్యభంగిమలు, విశ్వజనీనుఁడఁగావ్యరీతి, నే
శ్రీలలితుండ నిచ్చలును జెన్నెసలారెదఁగొత్తకొత్తగా.

నేనిసుమంత తోఁచునెడ నివ్వటిలుం బరువంపు వెన్నెలల్,
నేనొక యింతగన్పడఁగ నిర్వృతిభాసిలు దివ్యదీప్తులన్
నానెలవైన మ్రోడులును నవ్యవసంతలతాంతమాధురీ
స్థానములై చెలంగుఁబికషట్పద గీతికలుప్పతిల్లఁగన్.

అగుననిమిత్తమ్మొక్కటఁ
దగుఁగా సనిమిత్తమింకఁదక్కినయెడ నా
సొగసది, వగపగ దొలఁగఁగ
మగువల మగవారి గూర్చు మంత్రము నేర్చున్.

పదనులేనికత్తి, పంటపండని చేను,
బొట్టులేనియట్టి పొలతిమోము
రాజులేని నభము రాణనే వెలయని
చోటు, కళల కెల్ల లోటు పాటు.

ముసిముసి, పకపక, వికవిక,
విసమున్, వెడ, మొలక, వెడఁగు వేడుక, యరయున్
కొసరును, వెంగలి, వంకర
వెసఁగెడి బిరుదంబు లిట్టి వెన్నియొ తాల్తున్.

హరిముక్కంటిగ, శంభుఁడానలువగా, నాధాత కొంచారిగా,
సురసేనాపతి వేయి కండ్ల దొరగా, శోభిల్లు నింద్రుండుభా
స్కర దేవుండుగ మాటి మాటి కనినన్ గాంచంగ లేరన్న నీ
నరులామామక వైభవంబెఱుఁగఁగానాధుల్? వృథా జంబముల్.

అమృతంపుసోనలు హాలాహలపు వాన
లేక ధారగ గురిపింపఁగలను,
అజ్ఞాన లసనముల్ విజ్ఞాన దీధితు
లొక్కతీరువఁ దీర్చి యుంచఁగలను,
ఆరకంట నధికార మరకంట దాస్యంబు
మేలుగా నీనేల నేలఁగలను,
జీవ కళాశ్రీలు దేవ కళాశ్రీలు
దాటించి పాటించి చాటఁగలను.

భాష్యకారుఁడ వ్యంగార్థ భవ్యకావ్య
సూత్ర వార్తిక రాశికి సూరులార!
వినుఁడు ప్రణిపాత సంప్రశ్న విధివిధాన
జేరి తత్త్వమ్ము చేతనోద్ధారకమ్ము.

పొగడి కొనఁగఁదగదు తగదని తెలిసియుఁ
దగవుమాలి కొంత పొగడికొందు,
నావిభుత్వరవికి నవకోటిరశ్మికి
అంశమైనయొక్క యంశుమహిమ.

ఏనొకసారి ధర్మజమహీశుని యింటికి నేగినాఁడ, నా
స్థానము చిత్రకారకర చాతురి చిత్ర విచిత్ర మూర్తియై
ప్రాణము పోసికొన్నయది భాసిలు చిత్రసుమమ్ములోనళుల్
తేనెలుగ్రోల మూగినవి; తీర్చినవేల్పుకదానికన్నియల్

పాణులవీణియల్ కదిపి పాడినయట్లుగనైన ప్రేక్షకుల్
పూనిరి దేవ భావములు పొందివిమేషణవృత్తిశూన్యతల్.
రాణులు రాజులున్ గదలిరా నదితోఁచె సుధర్మనాఁగ. శ్రీ
మానిని వాసగేహముగ, మానధనుండు సుయోధనుండు, హే

లానత దృగ్లతాంత రుచిరాగభరమ్మున, ప్రౌఢభావనా
ధీనత మోముచిట్లగిల తేజముడిల్లపడన్. స్వమిత్రబాంధవుల్
పూని కళావిశేషములు పొందికఁజెప్పఁగ. గర్వరేఖతా
నౌననసికసాగి కృతకాంబువుచూచి కరానఁజాంగులన్

పూనికఁబట్టి కాదనుచుఁతోలిచివీడె. ననంతరమ్ము, వి
రైనను దొంటిభావమున నస్లైతలమ్మని విభ్వరమ్ముగాఁ
దానదువన్ దటాలుమని దానఁబడెన్. వడివాకళాచ్ఛవిన్
బూనెను ద్రౌపదీప్రముఖ పూజ్యపురంధ్రుల యోష్ఠపీమలాన్

కింకిల కలకళ మనునా
కలకంఠుల కంఠరవళి కౌరవపతికిన్
ములుకై గుండెలు నాటెను
కలనికి నదెవాంది సూక్తిగా విలసిల్లెన్

ఆంతకుమున్నె యొక్కతతి నారఘువీరుని విందుకొల్వులో
వింతలుచూడనేగిరిని. వీరతరావణు వ్రక్కలించి శ్రీ
కాంతుని సీతతోఁబురికి క్రమ్మరివచ్చెను. కూడినారుభూ
కాంతుడు. దేవతల్, మునులు గణ్యులు రాక్షసవానరోత్తముల్

'-శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజాను బాహుమరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి.

వైదేహీసహితం సురద్రుమతలే హైమే మహామంటపే
మధ్యేపుష్పక మానునేమణిమయే వీరాసనేసుస్థితం
అగ్రేవాచయతి ప్రభంజన సుతేతత్త్వమునిభ్యః పరం
వ్యాఖ్యాంతం భరతాదిభిః పరివృతం రామంభజేశ్యామలమ్-'

అనెడి మాగధ గీతికల్వినఁగఁబడియె
ప్రభుని యాస్థానిశాంతి కావాసమయ్యె
నలువ తొలిపల్కు పల్కగా నిలువఁబడియె
మెఱసె లక్ష్మణున ధరాన మెఱపొకండు

నలువమోము పగటి కలువపూవాయెను
లీలవాసెఁజంద్రమౌళిమొగము
లక్ష్మణుండు తమ్మె లక్షించిహేళన
దంతదీప్తివెలికిఁ దార్చెనంచు

ఆత్మదోషగాథ తుదియది యెదఁదోఁప
ధాతమొదలుపండు కోఁతిదాక
వాల్చినారు లజ్జ వదనముల్ సభ్యులు
రామవిభుఁడు కోపధాముఁడయ్యె.

అరయఁబదునాల్గువత్సరాలగ్రజునకు
సేవఁజేసెడి తనువును జేరవెఱచు
నిద్రనెలఁతకు సందయ్యెనేఁడునంగ
ఆలమెనాకళ లక్ష్మణునధరసీమ

హేతువారసియందఱు ప్రీతులైరి
లక్ష్మణస్వామి కైంకర్య లక్ష్మిఁదలఁచి
రామచంద్రుఁడు జానకీ రమణిఁగాంచె
తల్లి యూర్మిళఁ దనచూపువల్లిఁ బెనచె.

తమ్మికొలను విరిసెఁ దావులు మలసెను
మద్విలా సభాసమానమైన
కొమరురామదేవు కొలువువెల్ల పులకించి
తళుకు తళుకు తళుకు తళుకు మనియె.

# ముఖ్యమంత్రి ప్రసంగం

(4వ పేజీ తరువాయి)

ఛాయలు మన పల్లెల్లో, పట్టణాలలో అప్పుడప్పుడు తలెత్తుతూనే ఉన్నాయి. వీటిని సమూలంగా మన మనస్సుల్లోనుంచి తొలగించుకోనిదే జాతికి విముక్తి లేదు. కులమత భేదాలవంటివే ప్రాంతీయ విభేదాలు, భాషా విభేదాలు కూడా. మేము గొప్పంటే మేము గొప్పనుకునే మనస్తత్వం పతనానికి దారితీస్తుంది. అందరం ఒకేజాతికి చెందిన అన్నదమ్ములమనే భావన బలపరచుకోవటం అవసరం. అందరికీ సమాన అవకాశాలు చేకూర్చే సోషలిస్టు సమాజ నిర్మాణం, ధ్యేయంగా పెట్టుకుని, కృషిచేసే తరుణంలో ఆర్థిక నిమ్నోన్నతులు తొలగించే వివిధ కార్యక్రమాలు అమలు జరుగుతున్న నేటి దశలో ఏకజాతీయ భావన పెంపొందించుకోనిదే ఏదీ సాధ్యం కాదు. ఒక వైపు ప్రపంచమంతా రెండు యుద్ధకూటాలుగా విడివడి ఉంది. ఏ క్షణంలోనైనా అగ్ని పర్వతం బ్రద్దలయ్యే ప్రమాదం కనిపిస్తున్నది. అణు బాంబులు, హైడ్రోజను బాంబులు వంటి మారణాయుధాలవల్ల మానవ నాగరికత యావత్తూ మనకండ్ల ఎదుటనే నాశనం కాబోతున్నదా అనిపిస్తుంది.

ప్రపంచాన్ని యీ ముప్పునుండి తప్పించడానికి, శాంతిదూత నెహ్రూ నాయకత్వాన, ఇతర తటస్థ రాజ్యాల సహాయంతో, మన దేశం విశ్వ ప్రయత్నం చేస్తున్నది. గాంధీజీ మనకు నేర్పిన శాంతి సందేశాన్ని, ప్రపంచానికి అందించడానికి మనం ప్రయత్నిస్తున్నాం. అంతకంటే ప్రమాదభరితమైన విషయం, మన ఉత్తర సరిహద్దులలో చైనా దురాక్రమణ పూరితమైన ఉద్దేశాలతో కాచుకుని కూచుంది. అలాగే పాకిస్తాన్ మనలను ఇంకా ఏదో సాధించాలని చూస్తున్నది. మనమేమో, వీటన్నిటికి అతీతంగా, ప్రజాశికా పథంలో, పరమశాంతియుతమైన పద్ధతిలో, అభ్యుదయం సాధించడానికి దీక్షతో కృషిచేస్తున్నాం. ఇటువంటి సమయంలో, ఏది ఎట్లా ఉన్నా, మనలో మనకుండే విభేదాలన్నీ మరచి, జాతీయ సమైక్యతాభావం పెంపొందించుకోవడం అత్యవసరం.

అనేక శతాబ్దాలుగా సమాజంలో అట్టడుగున పడివున్న ప్రజలు కొందరున్నారు. వారికి కొన్ని ప్రత్యేక సౌకర్యాలు కల్పించుకుంటూ, వారి జీవనస్థాయి పెంచడానికి కూడా, ఇన్నాళ్లుగా కృషిచేస్తున్నాం. వారిని వెనుకబడిన వర్గాల వారని పిలుస్తున్నాం. వారు కూడా తాము వెనుకబడిన వర్గాలకు చెందిన వారని అనుకుంటున్నారు. ఐతే, యీ వెనుకబడినతనమునేదాన్ని, కుల, వర్గాల ప్రాతిపదికపై ఇప్పటివరకు నిర్ణయిస్తున్నాం. ఒకవైపు జాతీయ సమైక్యతాదృష్టి కావాలని ప్రచారంచేస్తూ, మరొకవైపు కులవర్గ ప్రాతిపదికలతో పనిచేయటం న్యాయమేనా అని ఒక్కొక్కప్పుడు అనిపిస్తుంది. అస్పృశ్యతా నివారణకు కంకణం కట్టుకుని పనిచేస్తూ, హరిజనులకు గృహ వసతికై ప్రత్యేకంగా కాలనీలు నిర్మించడమేమిటి? ఇన్నాళ్లుగా మనం విశ్వసించిన మూల సిద్ధాంతాలను, అమలు పరచిన కార్యక్రమాల రూపురేఖలను సవరించుకోవలసిన అవసరం వచ్చినా మనం వెనుకంజ వేయకూడదు. ఆర్థిక ప్రాతిపదికపై వెనుకబడిన తనాన్ని నిర్ణయించి, సంఘంలో ఆర్థికంగా బలహీనులైన వారందరికి సహాయం చేయడం మంచిది కాదా? ఈ పది పన్నెండేళ్ల అనుభవంతో, లోతుగా ఆలోచించుకుని అవసరమైన మార్పులు చేసుకోవలసిన తరుణం వచ్చింది. ఐతే ఏ మార్పులు చేసినా అవి మన లక్ష్యమైన సోషలిస్టు సమాజ స్థాపనకు దోహదకారులుగా ఉండాలనే విషయాన్ని మాత్రం మరువకూడదు.

ఇటువంటి సమస్యలు ఎన్నో ఉన్నాయి. మన రాష్ట్రానికి సంబంధించి నదీ జలాల సమస్య చాల ముఖ్యమైనది. అలాగే కొన్ని ప్రాజెక్టుల నిర్మాణం విషయమై, పొరుగు రాష్ట్రాలకూ మనకూ అభిప్రాయ భేదాలున్నాయి. ఇవన్నీ సవ్యంగా పరిష్కరించుకోవాలంటే, ఇరుగు పొరుగు రాష్ట్రాలతో ఇచ్చిపుచ్చుకునే నేర్పు, మన వాదం వారికి వినిపించి వారి సమ్మతిపొందే చాకచక్యం మనం అలవరచుకోవాలి. అంతేకాని అనవసరంగా ఆవేశాలకు పోకూడదు. దానివల్ల అవతలి వారుకూడా రెచ్చిపోవడం, ఉభయ పక్షాల, నేనుపట్టిన కుందేటికి మూడే కాళ్లని కూచోవడం జరుగుతుంది. సమస్య పరిష్కారం కాకపోగా, మనస్పర్థలు ఎక్కువవుతాయి. జాతీయ సమైక్యతా దృష్టితో ఆలోచించినట్టయితే యిది

దేశాభివృద్ధికి గొడ్డలిపెట్టు. ఉభయ పక్షాలు రెచ్చిపోయే ప్రమాదమున్న సమస్యల విషయంలో ప్రజలు కూడా నిగ్రహం వహించాలి. శాంతియుతంగా మన న్యాయమైన కోర్కెలను, ఇతరులచేత ఒప్పించడానికి, అదొక్కటే సరియైన మార్గం.

స్వరాజ్య మూల తత్వాన్ని పరిశీలించడానికి పూనుకున్నామని ఇంతకు ముందే మనవి చేశాను. దీనికి అనుగుణంగానే, యావద్భారత దేశానికి ఆదర్శప్రాయంగా, అందరికంటె ముందుగా అధికార వికేంద్రీకరణ సూత్రాన్ని మన రాష్ట్రంలో అమలు పరిచాం. ప్రజలకు అధికారం యిచ్చి, దేశ భవిష్యత్తును తీర్చి దిద్దడంలో వారికి తగిన బాధ్యతలు సంక్రమింపజేశాం. 'ప్రజలే రాజులు' అనే సిద్ధాంతాన్ని కేవలం నినాదంగా వల్లించడం మాత్రమే కాకుండా, దానిని ప్రత్యక్షంగా అమలు పరచి చూపించాం. నేడు ప్రభుత్వాధికారమంతా ప్రజా ప్రతినిధులకు అప్పగించబడి, గ్రామం, బ్లాకు, జిల్లా స్థాయిలలో, పరిపాలనా నిర్వహణకు అవసరమైన కొత్త ప్రజా సంస్థలేర్పడి, పంచాయతీ రాజ్య వ్యవస్థ అప్రతిహతంగా పురోగమిస్తున్నది. వివిధ కార్యక్రమాలపట్ల అమితోత్సాహంతో, ప్రజలు ముందుకు వచ్చి పని చేస్తున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే, తమ భవిష్యత్తును తామే తీర్చి దిద్దుకుంటున్నారు.

దీనికి తోడు మరొక ముఖ్యమైన మార్పును కూడా క్రమేణా సాధించుకుంటున్నాం. పరిపాలనాధికారం ప్రజలపరం చేశాం. కాబట్టి ప్రజల భాషలోనే పరిపాలన సాగడం అవసరం. భాషా ప్రయుక్త రాష్ట్రాల ఉద్యమం కూడా యీ ఆశయంతోనే పుట్టి పెరిగింది. సామాన్య ప్రజల ప్రతినిధులైన మన రైతు కూలీలకు కూడా, ప్రభుత్వ పాలన ఏవిధంగా జరుగుతున్నదో తెలియాలంటే, తెనుగు భాషలో పాలన జరగాలి. తాలూకా స్థాయిలో, ఇప్పుడు కొన్ని ప్రభుత్వ శాఖలకు సంబంధించి ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ తెలుగులోనే జరుగుతున్నాయి. ఈ నిర్ణయం ఇటీవలనే గైకొనబడింది. క్రమేణా అంతకంటె ఎక్కువగా పరిపాలనా వ్యవహారాలలో తెనుగు భాష ప్రవేశపెట్టడం జరుగుతుంది.

పోతే మన రాష్ట్రానికి మరొక ముఖ్య సమస్య పరిశ్రమలు. పరిశ్రమల విషయంలో మనం యితర రాష్ట్రాలతో పోల్చుకుంటే చాలా వెనుకబడి ఉన్నాం. మన రాష్ట్రంలో ఖనిజ సంపదకు కొదువ ఏమీ లేదు. కాని భారీయెత్తున పెట్టుబడిపెట్టి, పరిశ్రమలు విస్తరింపచడానికి డబ్బున్నవారు, చొరవతీసుకుని ముందుకు రావడం లేదు. అటువంటి వారికి అవసరమైన అన్ని సౌకర్యాలు కల్పించడానికీ, రాష్ట్రంలో సత్వర పారిశ్రామిక ప్రగతి సాధించటానికి దోహదంచేసే వివిధ చర్యలు గైకొనడానికీ, ప్రభుత్వం సిద్ధంగానే ఉంది. ధనవంతులైనవారు తమ దృష్టిని కొంతవరకు యీ రంగంవైపు మరల్చి శ్రద్ధగా, రాష్ట్రాభ్యుదయానికి పాటుపడాలని విజ్ఞప్తి చేస్తున్నాను. ఎందుకంటే, యీ పని అంతా ప్రభుత్వమే చేయాలంటే సాధ్యంకాదు. ప్రభుత్వ రంగం, ప్రయివేటు రంగం కలిసి మెలిసి పనిచేస్తేనే ఆర్థిక ప్రగతి సాధ్యమవుతుంది. మనకున్న పరిశ్రమల్లో ముఖ్యమైనది, సింగరేణి బొగ్గు పరిశ్రమ. దక్షిణాది కంతటికి యివే పెద్ద గనులు. ఇక్కడ బొగ్గు ఉత్పత్తిని సాధ్యమైనంత ఎక్కువ చేసుకోవలసి ఉంది. సింగరేణి బొగ్గుగనులను, కేంద్ర ప్రభుత్వ యాజమాన్యానికి మార్చాలనే ప్రతిపాదన కూడా ఒకటి ఉంది. కాని మనకు సాధ్యం కాకపోతే గదా, కేంద్ర ప్రభుత్వానికి వదలి వేయడం. మనకున్న యీ ఒక్క పరిశ్రమనూ, మనమే విజయవంతంగా నడుపుకోగలమనే ఆత్మవిశ్వాసం, నాకు పూర్తిగా ఉంది. ఆంధ్ర మహాజనులందరికి కూడా యీ విధానమే సమ్మతమని నాకు తెలుసు. కృష్ణాజిల్లా నూజివీడు ప్రాంతంలో బొగ్గు గనులున్నట్లు పరిశోధనల వల్ల తెలుస్తున్నది. ఇటువంటి కొత్త ప్రదేశాలను కూడా గాలించి, సాధ్యమైనంత వరకు మన రాష్ట్రంలోని సహజ సంపదను, సద్వినియోగ పరచుకోవాలనీ, పారిశ్రామికాభ్యుదయం సాధించాలనీ ప్రభుత్వం ఆశిస్తున్నది.

ఏ కార్యక్రమం చేపట్టినా, ఎంత శ్రద్ధగా పనిచేసినా దాని ఫలితాలు అనుభవానికి రావడానికి తప్పనిసరిగా కొంతకాలం పడుతుంది. కొన్ని ఫలితాలు చాలకాలం తర్వాతగాని రావు. ఫలితాలను గురించి తలచుకొన్నప్పుడల్లా నాకొక కథ గుర్తు వస్తుంది. ఒక శత వృద్ధు-డందుముసలి-కొత్తగా నారింజ మొక్కలు నాటి తోట పెంచడానికి కృషిచేస్తున్నాడట. రోజూ ఉదయము, సాయంత్రం ఆ మొక్కలకు నీరు కడుతుండేవాడు. "తాతా! నీకెందుకు యీ శ్రమంతా? యీ తోట పెరిగి కాయలు కాసేనాటికి నువ్వు ఉంటావో ఉండవో" అని ఎవరో అడిగారట. ఆ తాత చిరునవ్వుతో అన్నాడు, "నాయనా, నేనుకాకపోతే నా కొడుకులు, కూతుళ్లు, మనుమలు, మనుమరాండ్రు ఏమవుతారు? వారికోసం యీ తోట పెంచుతున్నాను" అని. అంత వార్ధక్యంలోకూడా ఆ వ్యక్తికి ఎంత పట్టుదల, భవిష్యత్తుమీద ఎంత విశ్వాసం ఉందో చూడండి. మనం కూడా యీ నాడు సరిగ్గా అదే స్థితిలో ఉన్నాం. మనకోసం మనం కృషి చేసుకోవడమూ ఉంది – అంతకంటే ముఖ్యమైనది భావితరాల ప్రజల సౌభాగ్యం కోసం ఇప్పుడే గట్టిగా కృషి చేయడమూ అవసరం. ఈ భారత సౌభాగ్యం అనే కొత్తగా నాటిన తోట పెంచడానికి అందరమూ నీరు పోద్దాం, సమిష్టిగా కృషి చేద్దాం.

భారతదేశ భవిష్యత్తుకు రూపు రేఖలు దిద్దుకునే కృషి అనుకున్నంత సులభ సాధ్యం కాదు. ఎండనక, వాననక సంవత్సరం పొడుగునా, పొలంలో పరిశ్రమించే హలాయుధులైన రైతు బిడ్డలలాగా, నిరంతరం కృషిచేసి, సౌభాగ్య సస్యలక్ష్మిని పండిద్దాం. వర్గభేదాలు, కుల మత ప్రసక్తులు, ప్రాంతీయ తత్వాలకు స్వస్తిచెప్పి, అభ్యుదయ పథంలో పురోగమిద్దాం.

జై హింద్.

# నిర్విరామమైన కృషిచేద్దాం

శ్రీ బి. వి. సుబ్బారెడ్డి
శాసన సభాధ్యక్షులు

[ఆగస్టు పదిహేనవ తేదీన స్వాతంత్ర్య దినోత్సవ సందర్భంగా హైదరాబాదు కేంద్రంనుంచి ఒక ప్రత్యేక రేడియో గోష్ఠిని ఆకాశవాణి నిర్వహించింది. ఈ గోష్ఠికి ఆంధ్ర ప్రదేశ్ శాసన సభాధ్యక్షులు శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, అధ్యక్షత వహించారు. సమాచార, న్యాయశాఖల మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు, శాసన సభా ప్రతిపక్ష నాయకులు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య, శాసన సభ్యులు శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ వావిలాల గోపాలక్రిష్ణయ్య, సర్వోదయ నాయకులు శ్రీ ప్రభాకర్‌జీ, విద్యావేత్తలు శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగార్లు యీ గోష్ఠిలో పాల్గొన్నారు. శ్రీ సుబ్బారెడ్డి, శ్రీ నరసింహారావు, శ్రీ సుందరయ్యగార్ల ఉపన్యాసాలను వ్యాసాల రూపంలో ఈ సంచికలో విడివిడిగా ప్రచురిస్తున్నాము. మిగిలినవి వచ్చే సంచికలో ప్రచురించుతాము.]

అభ్యుదయం అనేది మన అందరకు చాలా అభిమానకరమైన విషయం. ప్రపంచములోని ప్రతి నాగరిక జాతి అభ్యుదయమునే కోరుకుంటుంది. అభ్యుదయము అందే పురోగమనం. దీనినే తేటతెలుగులో చెప్పాలంటే ముందుకు పోవడం. అయితే అది సౌభాగ్యకరంగానూ, ఆనందదాయకంగానూ ఉండాలి. అంతే కాదు. అభ్యుదయం అనేదాన్ని మనం కేవలం కోరుకోవడంవల్ల సాధించలేము. నిర్విరామంగా పట్టుదలతో, ఆత్మ విశ్వాసంతో కృషి చేస్తేనే అది సాధ్యమౌతుంది. ఈ అభ్యుదయం కొన్ని రంగాలకు మాత్రం పరిమితం కాకుండా సర్వతోముఖంగా ఉండాలి.

మన ఆంధ్ర ప్రదేశ్, దేశంలోని పెద్ద రాష్ట్రాలలో నొకటి. దేశం మధ్యలో ఉండటంచేత అది ఉత్తర, దక్షిణ భారత దేశాలకు కూడలి స్థలం. వ్యవసాయోత్పత్తిలో మన రాష్ట్రం దేశములో ప్రముఖస్థానం ఆక్రమిస్తున్న రాష్ట్రాలలో నొకటి. అయితే పారిశ్రామిక రంగంలో చాల వెనుకబడిన రాష్ట్రం. మన రాష్ట్రాదాయంలో నూటికి 13 వంతులు మాత్రం పారిశ్రామిక రంగం నుండి వస్తూంది. మన రాష్ట్రంలో భారీ యెత్తున పారిశ్రామికాభివృద్ధి జరగడానికి తగిన వసతులుండికూడా యిట్లు వెనుక బడటం మిగుల శోచనీయమైన విషయం. రాష్ట్రం అభివృద్ధి పొందాలన్నా, సౌభాగ్యం సాధించాలన్నా, పరిశ్రమలపై పెట్టుబడిని అభివృద్ధి చేసుకోవాలి. నాడే పరిశ్రమలు రాష్ట్రాదాయానికి ఇంకా ఎక్కువ ధనం చేకూర్చకలుగుతాయి. నాడే వ్యవసాయంలో నిమగ్నమైన అదనపు జనాభాను పరిశ్రమలలోకి మరల్చి వ్యవసాయ రంగంలో ఉపయోగకరమైన మార్పులు ప్రవేశపెట్టుట సాధ్యమౌతుంది. ఇటీవల డాక్టర్ వి. ఎస్. లోకనాథంగారు మన రాష్ట్ర ప్రభుత్వానికొక నివేదిక సమర్పించారు. అందులో ఆంధ్ర ప్రదేశ్ ఆర్థికాభివృద్ధికి 600 కోట్ల రూపాయల ఖర్చుతో కూడిన ఒక దశ వర్ష ప్రణాళికను పొందుపర్చారు. అందులో వారు 'ఆంధ్ర ప్రదేశ్‌కు అభివృద్ధి అయ్యేందుకు ఉజ్వల అవకాశాలున్నాయి. రాష్ట్రంలోనే ముఖ్యమైన వస్తు సంపదల్ని ఇంతవరకు పూర్తిగా బైటికి తీసి వినియోగించడం జరుగలేదు' అని చెప్పారు. ఇది యథార్థమైన మాట అని మనమందరము అంగీకరించక తప్పదు.

నిరుద్యోగ నిర్మూలన చాలా ముఖ్యమైన సమస్య. అందుకొరకు కూడా గట్టి కృషి మనం చేయాలి. శరీర శక్తి, విద్య ఉన్నవారందరికీ మనం ఉద్యోగావకాశాలు కల్పించవలసి ఉంది. పూర్తిగా అందరికీ ఉద్యోగావకాశాలు కల్పించాలంటే వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో తీవ్రమైన మార్పులు తీసుకొని రాక

తప్పదు. వ్యవసాయ రంగంలో నవీన పద్ధతులు ప్రవేశ పెట్టడం, పరిశ్రమలను శీఘ్రగతిని వృద్ధిచేయడం, ఉన్నవాటిని ఇంకా పెంపుదల చేయడం,—యీనాడు చాలా అవసరమైన విషయాలు. మన రాష్ట్ర జన సంఖ్య 3 కోట్ల 60 లక్షలు. ఇది సాలీనా 1.3 శాతం చొప్పున పెరుగుతూంది. నిరుద్యోగ నిర్మూలనలో యీ విషయాన్ని దృష్టిలో పెట్టుకొని జనాభా పెరుగుదల్ని కట్టుబాటు చేసేందుకు గట్టి చర్యల్ని అన్వేషించాలి.

## మూడు ముఖ్య విషయాలు

ఆర్థిక రంగానికి సంబంధించిన రెండు మూడు ముఖ్య విషయాలను ఇక్కడ స్థూలంగా సూచిస్తాను. అందులో మొదటి విషయం మన రాష్ట్రం నదుల విషయంలో చాలా సంపన్నమైన రాష్ట్రం. కాబట్టి నీటి వనరులు సమృద్ధిగా ఉన్నాయి. మన నీటి పారుదల ప్రాజెక్టులు కొన్ని పూర్తి అయ్యాయి. మరికొన్ని నిర్మాణంలో ఉన్నాయి. ఇవన్నీ కలసి ప్రస్తుతం నీటి పారుదలగల భూమిని ద్విగుణీకృతం చేయగలవని ఆశింపబడుతోంది. అందువల్ల నీటిపారుదలగల భూ శాతము అత్యధికంగాగల రాష్ట్రాలలో ఆంధ్ర పదేశ్ ఒకటి కాగలదు.



మన రాష్ట్రపు సముద్ర తీరం సుదీర్ఘమయినది. మత్స్య సంపద గల చెరువులెన్నో ఉన్నాయి. అయితే ఆ రంగంలో మన మింతవరకు అశ్రద్ధవహించాము. సాలీనా మత్స్య ఉత్పత్తిని పెంపొందించడానికి మనం ఇతోధిక శ్రద్ధ వహించాలి.

అడవులు పశుసంపద విషయంలో కూడ మనం గట్టి కృషి చేయడం అవసరం. అడవుల ప్రాముఖ్యం గురించి విస్తారంగా చెప్పనక్కరలేదు. పారిశ్రామిక రంగం కొరకు కూడా వీటిని వినియోగించుకోవాలి. పశుసంపద మన ప్రజల ఆరోగ్యానికి, రాష్ట్ర ఆర్థిక సౌభాగ్యానికి కూడా చాలా ముఖ్యమయినది. దానిని వాణిజ్య పద్ధతుల్లో వృద్ధి చేసుకొనడానికి చాలా అవకాశం ఉంది. పశువులు నేడు ఇస్తున్న పాల పరిమాణము చాలా తక్కువ. వాటి ఉత్పాదన శక్తిని పెంపొందించుటకు కృషి చెయ్యాలి. పక్షులు, మొదలగు వాటికి సంబంధించి కూడా శ్రద్ధ వహించి మాంస పరిశ్రమను వృద్ధి చేసుకోవాలి.

రాజకీయంలో మనం సాధించిన ప్రశంసనీయమయిన అభివృద్ధి పాశ్చాత్యులలో అనేక మందికి ఆశ్చర్యం కలిగించింది. మానవ విశిష్టమైన వ్యత్యాసాలు, అన్యాయాలు నిర్మూలించి, వ్యక్తిగత పురోభివృద్ధికి, సాంఘికాభ్యున్నతికి అందరకు సమానావకాశాలు కల్పిస్తున్నాం. మూడు సాధారణ ఎన్నికలు శాంతియుతంగా జరిగిపోయాయి. కేంద్ర రాష్ట్ర స్థాయిలలో ప్రాతినిధ్య ప్రభుత్వం ఏర్పాటు చేసుకున్నాం. పంచాయతీరాజ్యం ద్వారా అధికార వికేంద్రీకరణాన్ని సాధించాము. ప్రతి పౌరుడు తన హక్కులు, విధులూ ఏవో తెలుసుకున్నాడు. స్వయం సహాయం, పరస్పర సహకారము, గ్రామాభ్యుదయ పథకాల నిర్వహణకు ప్రాతిపదికలు కావాలి. పంచాయతీలు ఇందుకు కీలక స్థానాలై ఉండాలి. పంచాయతీ రాజ్యమనే ఆశయం నెరవేరిన నాడు రాష్ట్రానికి వాస్తవమయిన ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్యం సిద్ధిస్తుంది.

తిన తిండికి, కట్టబట్టకు నోచుకోక, ప్రాథమిక జీవితావసరాలు లేక ఇతరుల చేతిక్రింద బ్రతుకవలసిన వ్యక్తికీ, సౌఖ్యానికీ ఆమడల దూరం అని మీకెల్లరకూ తెలుసు. ఇట్టి ప్రాథమికావసరాలు చేకూరకుండా చేస్తున్న అడ్డంకుల్ని అంతమొందించాలి. నాడే రాష్ట్రానికి అభ్యుదయం చేకూరుతుంది. ఈనాడు వ్యర్థంగా ఉన్న వనరులన్నిటినీ సంఘానికి ఉపయోగపడేటట్లు కృషి చేయాలి.

## అభ్యున్నతికి కీలకం

ఈ కృషి జయప్రదం కావాలంటే, మన ప్రణాళిక నిర్వహణ సక్రమంగా సాగాలంటే అనేక మంచి లక్షణాలు మనం పెంపొందించుకోవాలి. నిజాయితీ, శీల సంపద గల అనేక మంది యువకుల్ని మనము తయారు చేసుకోవాలి. ఇతరుల పరిస్థితిని

అర్థం చేసుకొనే నేర్పు, ప్రతిఫలంతో నిమిత్తం లేకుండా ఏ పనినైనా చెయ్యగల ఓర్పుగల యువతీ యువకులు తయారై చిత్తశుద్ధితో, పట్టుదలతో కృషి చేసిననాడే అభ్యున్నతి సాధ్యమౌతుంది.

మానవాభ్యున్నతికి వజ్ర సంకల్పం అవసరం. నిరాశకు గురికాకుండుట ముఖ్యం. ఈనాడు ప్రభుత్వం అనేది పౌరుల సేవ కొరకే పుట్టింది. రాజ్యంలో పౌరులందరికి ఆర్థిక సమత, సమానావకాశాలు ఉండుట ముఖ్యం. ఆర్థికముగా వెనుకబడినవారందరికి కుల ప్రసక్తి లేకుండా సహాయం చెయ్యవలసి ఉన్నది.

మన ప్రణాళికలను జయప్రదంగా నిర్వహించుటకు ప్రజలు, జాతీయ నాయకులు, అధికారులు హృదయపూర్వకంగా సహకరించుట అవసరం.

ప్రజలలో సంఘీభావం, క్రమశిక్షణ, అభ్యుదయం కోసము త్యాగాలు చెయ్యడానికి సంసిద్ధత, వివిధ వర్ణస్థుల మధ్య సామరస్యము ఉంటే మనము అనుకొన్న దానికంటే తొందరగానే అభ్యున్నతి సాధించగలం. మన కష్టనష్టాలెటువంటివైనా, మనం ఆశిస్తున్న నవ ప్రపంచం వంకకు పురోగమిస్తున్నాం. చెదరని ఆత్మ విశ్వాసం, మొక్కవోని ధైర్యం, సడలని త్యాగభావం మనము అలవరచుకొంటే యీ నవ ప్రపంచ నిర్మాణం మన శక్తికి మించిన విషయం కాదు.

ఈనాడు దారిద్ర్యం, అనారోగ్యం మనలను ఆవరించుకున్నాయి. ఐతే మన భావి తరాలవారు సగర్వంగా "ఇది మా స్వంతం. మా పూర్వీకులు దీనిని నిర్మించారు. ఈ భూములను సశ్యశ్యామలాలుగా మార్చారు. ఈ వాతావరణంలో పవిత్రత తీసుకొచ్చారు. ఈ విజ్ఞానాన్ని విదేశాలలో వ్యాపింప చేశారు. మా మనస్సులలో దిగులుకు తావులేదు," అనగలిగే సుదినం కొరకు కలలు కందాం. "మా భూమి సశ్యశ్యామలము. బంగారు పంటలు పండే సుందర సీమ. చల్లని పిల్లగాలులలో విలసిల్లే స్వర్గధామం. ధైర్యం, ఆత్మ నిగ్రహం మా విజ్ఞానానికి, కృషికి, విశ్వాసానికి ప్రాతిపదికలు. నవచైతన్యంతో, నూతనాశయాలతో, ఆ ఆశయ సిద్ధికి ఎనలేని కృషితో కలకలలాడుతూ, అందచందాలతో తొణికిసలాడే మహత్తర భూమి మాది," అని వారు చెప్పగలిగే సుదినం కోసం ఆశిద్దాం కాను కలలు కందాం. కాదు నిర్విరామమయిన కృషి చేద్దాం. సర్వే జనాస్సుఖినోభవంతు.



# “అభివృద్ధికి చిహ్నం”



మంత్రి

## శ్రీ పి.వి. నరసింహారావు



అభివృద్ధి కాలంలో అన్నీ కొరతగా కనిపిస్తాయి. త్వర త్వరగా పెరిగే బాలుడికి చొక్కా లెప్పటికప్పుడు బిగువౌతుండడం సహజం. ఇదే నేడు మన అన్ని కార్య రంగాల్లోనూ కానవచ్చే విశేషం. అవసరాలు పెరగటం అభివృద్ధికి చిహ్నం.

అభ్యుదయానికి మొదటి మెట్టు ఉదయం. ఉదయానికి మూలం రాత్ర్యంతం. బానిసతనపు రాత్రి గడిచి పోతేనే స్వాతంత్ర్య భానూదయమౌతుంది. అందుకే భారత జాతి హుంకరించి ఉద్యమించింది. స్వరాజ్యం మా జన్మహక్కని చాటిన తిలక్, మట్టిలోనుంచి మహా మానవులను సృష్టించిన అపూర్వ ఇంద్రజాలికుడు మహాత్మాజీ మొదలుకొని లక్షలాది అనామిక సైనికులు ఆ మహోద్యమంలో అశేషత్యాగాలు చేశారు. చివరకు వారందరి కృషి ఫలించింది. ప్రపంచమంతా గాఢ నిద్రలో ఉన్న ఒక అర్ధరాత్రి భారత దేశం మేల్కొని తన భవితవ్యంవైపు పురోగమించింది. ఎందుకీ మార్పు? దేనికీ విప్లవం? ఈ ప్రశ్నల కొకే ఒక ప్రత్యుత్తరం హృదయాంతరాళాల్లో ప్రతిధ్వనించింది, “అభ్యుదయం కోసం, సౌభాగ్యం కోసం” అని.

ఇల్లలుకగానే పండుగ కాదంటారు. స్వతంత్రులమైనంత మాత్రాన సమస్యలన్నీ తీరిపోవు. వాస్తవానికి సమస్యలు నూతనంగా ఉద్భవించడమే స్వాతంత్ర్య ప్రాప్తి లక్షణం. మనకూ అంతే జరిగింది. మనకనుసరణీయమైన మార్గమేదో ముందు తేల్చుకోవడం ముఖ్యం. మన మహా ప్రస్థానానికొక పటం, ఒక దిక్సూచి అనివార్యమైనవి. ఆ పటమే మన రాజ్యాంగం, ఆ దిక్సూచియే మన ప్లానింగ్ కమీషన్. అనతి కాలంలోనే యీ రెంటినీ నెలకొల్పుకున్నాం.

## పునాది ప్రజాస్వామ్యం

దేశ వ్యవస్థకు పునాది ప్రజాస్వామ్యం. ఈ పునాది దృఢతరం కానిదే మన భవ్య భవనం చిరస్థాయిగా ఉండజాలదు. ప్రజాస్వామ్య వ్యవస్థతో ప్రారంభమైన అనేక స్వతంత్ర దేశాల్లో అనతికాలంలోనే నిరంకుశ వ్యవస్థ నెలకొల్పబడడం చూస్తున్నాము. కాబట్టి దేశాభ్యుదయానికి ప్రథమ సోపానం ప్రజాస్వామ్య పరిరక్షణ. ఇదివరలో రాష్ట్ర స్థాయి వరకు మాత్రమే రూపొందిన మన ప్రజాస్వామిక వ్యవస్థను గ్రామ గ్రామం వరకు స్థాపించి బలీయం చేయడం అత్యావశ్యకం. ఆ కార్యక్రమాన్ని కూడ దేశ వ్యాప్తంగా ప్రారంభించాం. మన ఆంధ్రప్రదేశ్ పంచాయతీ రాజ్య

స్థాపనలో అగ్రతాంబూలమందుకుంది. మనరాష్ట్రంలో మారుమూల గ్రామాలో నివసించే రైతుకు, కూలీకి, యజమానికి, ఉద్యోగికి, ప్రతివ్యక్తికి ప్రజాస్వామిక వ్యవస్థలో ఏదో ఒక ప్రయోజనం ఏర్పడిందంటే అతిశయోక్తి కాదు. గ్రామస్థాయిలో ప్రతివ్యక్తికీ ముఖ్యమయిన నిర్ణయాల్లో ప్రమేయం కలిగించే ఉద్దేశంతో గ్రామ సభ రూపొందించబడుతోంది. అందుకు సంబంధించిన శాసనం మన విధాన మండలి పరిశీలనలో ఉంది. గ్రామ సభ, గ్రామ పంచాయతీ, పంచాయతీసమితి, జిల్లాపరిషత్తు, రాష్ట్ర విధాన మండలి, జాతీయ పార్లమెంటు—ఈ వ్యవస్థాక్రమం దేశానికొక సమగ్ర ప్రజాస్వామిక స్వరూపాన్ని సమకూర్చనుంది. దేశ సౌభాగ్యం కోసం, రాష్ట్రాభ్యుదయం కోసం మనం రూపొందించు కున్న ఆదర్శ రాజకీయ వ్యవస్థ ఇది.

## ఆర్థిక సాంఘిక న్యాయం

మన రాజ్యాంగపు ఆయువుపట్టు న్యాయం—రాజకీయ, ఆర్థిక, సాంఘిక న్యాయం. ఆర్థిక సాంఘిక న్యాయం సమకూర్చడ మంటే ఒక్కనాటి పనికాదు, ఒక్కడు చేస్తే అయ్యేపని కాదు. నేటి నుండి మాత్రమే న్యాయం చేస్తామంటే చాలదు, అలాచేసినా దానివల్ల ఆట్టే ప్రయోజనం ఉండదు. నిన్నటి వరకు జరిగిన అన్యాయాన్నీ, తత్పరిణామ రూపంగా వచ్చిన అవకతవకల్నీ సరిదిద్దడమే ఇకమీద చేయబోయే న్యాయానికి పునాది. కష్టించే వాడూ, ఫలితం పొందే వాడు వేరు వేరు వ్యక్తులుగా, వేరు వేరు వర్గాలకు చెందినవారుగా ఉండడమే సాంఘిక ఆర్థిక అన్యాయానికీ, శోషణకూ ముఖ్య లక్షణం. ఈ వ్యవస్థను మార్చడమే సాంఘిక ఆర్థిక న్యాయానికి నాంది. ఈ కార్యక్రమం మన ఆంధ్రప్రదేశ్‌లో చురుకుగాను, చిత్తశుద్ధితోను సాగుతూ వచ్చింది. జమీందారీ, జాగీర్దారీ, ముక్తా, ఇనాం, ఇజారా మొదలగు బూజుపట్టిన వ్యవస్థ లన్నీ రద్దుచేయబడ్డాయి. కౌలుదారీ వ్యవస్థను కూడ క్రమేణా రద్దు చేస్తూ కౌలుదార్లకు రక్షణలు కల్పించి వారికి భూయజమానులయ్యే సౌలభ్యం కలిగించి, అత్యధిక విస్తీర్ణం కలిగిన భూకమతాలు ఇక మీద ఏవ్యక్తి భుక్తంలోనూ ఉండకుండా నియంత్రించే అభ్యు దయకర వ్యవస్థ యావద్భారతదేశంలోకల్లా ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఒక భాగంలో రూపొందించబడింది. దానినే అనతికాలంలో రాష్ట్రానికంతటికీ విస్తరింప చేస్తున్నాం. వ్యవసాయమే ప్రధాన జీవనోపాధియైన మన దేశానికి, అందులో మన రాష్ట్రానికి యీ నూతన భూసంబంధ వ్యవస్థ ఒక శాంతియుత విప్లవంగా పరిణ మిస్తుందనడంలో సందేహంలేదు. రాష్ట్రాభ్యుదయం కోసం మనం చేసిన మహాయజ్ఞమిది.

## అభివృద్ధి కాలంలో అన్నీ కొఱతలే

"అభివృద్ధి కాలంలో అన్నీ కొఱతలే కనిపిస్తాయి. త్వర త్వరగా పెరిగే బాలుడికి చొక్కాలెప్పటికప్పుడే బిగువౌతుండడం సహజం. ఇదే నేడు మన అన్ని కార్య రంగాల్లోనూ కానవచ్చే విశేషం. అవసరాలు పెరగడం అభివృద్ధికి చిహ్నం. గత తపంలో భారతీయుల అవసరాలు, ఆశలు, ఆకాంక్షలు ఆకాశాన్నంటు కుంటున్నాయంటే అతిశయోక్తి కాదు. అవసరాలతో పాటు వాటిని పూర్తి చేసుకోవాలనే ఆసక్తి కూడా పెరిగింది. నడుం బిగించి ముందుకు సాగాం. మొదటి పంచవర్ష ప్రణాళికకూ, రెండవ ప్రణా ళికకూ మన కార్య సాధన శక్తి ముమ్మడి వరకు పెరిగింది. ఇక మూడవ ప్రణాళిక మొదటి ప్రణాళికతో పోల్చి చూస్తే ఐదంత లకు మించి ఉంది. ఇదే మన సత్వరాభివృద్ధికి తార్కాణం. అబ్బాయికి చొక్కాలు చాలనందుకు విచారించడం వెర్రి; విసుగు కోవడం సబబుకాదు. సంతోషించాలి; చాలే చొక్కాలు కుట్టించ డానికి ప్రయత్నించాలి. అందుకయ్యే అదనపు ఖర్చుకు సిద్ధపడాలి. అదే మనం నేడు చేస్తున్న పని. పెద్ద యెత్తున చేయబూనిన రాష్ట్రాభ్యుదయ కార్యక్రమానికి చాలినంత ఆర్థిక స్తోమత ప్రజాప్రభుత్వానికి కలిగించడానికి కొంత ఇబ్బంది పడియైనా సరే అదనపు పన్నులు విధించుకున్నాం.

నేడు మనదేశాన్నెదుర్కొంటున్న అనేక సమస్యలతో పాటు మన ఆంధ్రప్రదేశ్ కూడా కొన్ని ప్రత్యేక సమస్యల నెదు ర్కొంటున్నది. సత్వర పారిశ్రామికీకరణకు కావలసిన ప్రమా ణంలో విద్యుచ్ఛక్తి సరఫరా లోపాన్ని తొలగించుకోవలసి ఉంది. రాష్ట్రానికీ, ముఖ్యంగా వెనుకబడిన కొన్ని ప్రాంతాలకు, ఆయువు పట్టులైన కొన్ని ప్రాజెక్టులను వెంటనే సాధించుకోవలసి ఉంది. ఇందుకై రాష్ట్ర ప్రభుత్వం ద్వారా తీవ్ర కృషి విరంతరంగా సాగు తోంది. ప్రజలు, ప్రజా ప్రతినిధులు సంపూర్ణ సహకారమిస్తు న్నారు.

## నూతన జన్మ

ఇక సాంఘిక రంగంలో సాధించిన అభివృద్ధి కూడా చెప్పుకోదగినదే. శతాబ్దాల తరబడి దీన హీన స్థితిలో కుమిలి కృశించిన హరిజనుడు నేడొక నూతన జన్మమెత్తాడు. ఏ ఉన్న తాసనాన్నైనా అధిష్ఠించే అర్హత నేటి హరిజనులు కలిగియున్నా రని మన రాష్ట్రమే ప్రప్రథమంగా రుజువు చేసింది. దళిత జాతు లను, వర్గాలను ఉద్ధరించే కార్యక్రమం మన రాష్ట్రంలో చురుకుగా సాగుతోంది. ఆర్థికంగా హీనదశలో నున్న అన్ని వర్గాలకు కూడా అధిక సౌలభ్యాలు కల్పించాలనే ఉద్దేశం కార్యరూపం దాల్చు తోంది. ఇది మన రాష్ట్రాభ్యుదయం కోసం చేయబడుతున్న ముఖ్య కార్యక్రమాల్లో ఒకటి. వెనుకబడిన తరగతుల విద్యార్థులకు సాంకేతిక విద్యలో సీట్ల ప్రత్యేకింపు ఉన్నప్పటికీ అట్టి ప్రత్యే కింపుతో అవసరం లేకుండా వారి యోగ్యతను బట్టే వారికి సీట్లు వస్తున్నాయంటే ఇక అనతికాలంలోనే మన రాష్ట్రంలో వెనుక బడినతనం అదృశ్యమయిపోతుందని ఆశించవచ్చు. ఇది అత్యంత శుభసూచకం.

ఈ అభ్యుదయ మహాయజ్ఞంలో ప్రజలు ప్రజా ప్రతినిధులు ప్రభుత్వాధినేతలు, ప్రభుత్వోద్యోగులు అందరూ చేయి చేయి కలిపి సహకరిస్తున్నారు. ఈ కృషి తప్పక ఫలిస్తుంది. అక్షరక్రమంలోనే కాక అభివృద్ధి క్రమంలో కూడా ఆంధ్రప్రదేశ్ తన ఆదిస్థానాన్ని నిలుపుకుంటుంది.

# పారిశ్రామిక విశేషాలు

[రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. పారిశ్రామిక వేత్తలు, ప్రజలు వాటిని గురించి తెలుసుకొనటం అవసరం అనే దృష్టితో ముఖ్య పారిశ్రామిక విశేషాలు యీ శీర్షక క్రింద యివ్వబడుతున్నవి.]

## ప్రైవేట్ రంగం

**బెంజైల్ క్లోరైడ్, అసెటేట్,** ఇంకా ఇతర బెంజైల్ **కాంపౌండ్లను తయారుచేయుడానికి** మెస్సర్స్ హైదరాబాద్ కెమికల్స్ అండ్ ఫార్మస్యూటికల్స్ లిమిటెడ్ సంస్థకు లైసెన్సు ఇచ్చారు. సంవత్సరానికి 3,600 టన్నుల చొప్పున నిర్మాణ సాధనాల తయారీకి సికింద్రాబాద్‌కు చెందిన శ్రీ ప్రవీణ్ చంద్ర మోడీకి లైసెన్సు ఇచ్చారు.

పంచదార పరిశ్రమ కేంద్ర వేతన సంఘం సిఫార్సుల క్రింద బోధన్‌లోని ప్రభుత్వ ఆల్కహాల్ ఫ్యాక్టరీ కార్మికులకు పలు సౌకర్యాలను విస్తరింప చేశారు.

ఇటీవల ఈ కేంద్ర వేతన సంఘం పంచదార పరిశ్రమలో కార్మికులందరికి వర్తించే వేతనాలను ప్రకటించింది. ఈ వేతన సంఘం చేసిన సిఫార్సులను నిజాం చక్కెర ఫ్యాక్టరీ అప్పుడే అమలు జరిపింది. ఈ సౌకర్యాలు అనుబంధ పరిశ్రమలలో కార్మికులకు వర్తించవు. కాని ప్రభుత్వం ఆ సౌకర్యాలను బోధన్‌లోని ప్రభుత్వ ఆల్కహాల్ ఫ్యాక్టరీ కార్మికులకు 1-11-1960 నుంచి ప్రత్యేకంగా వర్తింప చేసింది.

ఈ హెచ్చింపు వేతనాల వల్ల ఫ్యాక్టరీలోని 72 మంది కార్మికులకు లాభం కలుగుతుంది. ఇందువల్ల ప్రభుత్వానికి ఏడాదికి రూ. 25,200 లు వ్యయం అవుతుంది.

## బొగ్గు పరిశ్రమ

సింగరేణి బొగ్గుగనులలో బొగ్గు ఉత్పత్తి త్వరితగతిని సాగుతున్నది. 1962 జూన్ మాసాంతం వరకు 1,488,067 టన్నుల బొగ్గు ఉత్పత్తి అయింది. 1961 లో అదే సమయానికి 1,277,746 టన్నుల బొగ్గు మాత్రమే ఉత్పత్తి అయింది.



# రాష్ట్రాభ్యుదయం అంటే!!

శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య
శాసనసభా ప్రతిపక్షనాయకులు

రాష్ట్రాభ్యుదయం అంటే, ప్రతి వ్యక్తికీ చేతినిండా పని, కడుపునిండా తిండి, వంటినిండా గుడ్డ, ఉండడానికి ఇల్లు, బాలబాలికల కందరికీ 18 ఏండ్లు వచ్చేవరకు ఉచిత ఉన్నత విద్యతోపాటు ఏదైన ఒక వృత్తిలో శిక్షణ, విశ్వవిద్యాలయ స్థాయిలో చదువుకోడానికి అందరికీ అవకాశాలు, ఉచిత వైద్య సదుపాయాలు, ప్రమాదాలకు జబ్బులకు, భీమా సౌకర్యాలు, 60 ఏండ్లు దాటిన వారి కందరికి పెన్షన్లు, స్త్రీ పురుషులకు సమాన ప్రతిపత్తి, మానవునికి మానవునికి మధ్య రంగునుబట్టి, కులాన్ని బట్టి, మతాన్ని బట్టి, ధనాన్ని అధికార హోదానుబట్టి విచక్షణ చూపెట్టక అందరికీ సమానఅవకాశాలు సమాన గౌరవం—ఇదే రాష్ట్రాభ్యుదయం.

మన ఆంధ్రప్రదేశ్‌లో కృష్ణానది మీద నాగార్జున సాగరు, శ్రీశైలం ప్రాజెక్టులు, గోదావరి నదిమీద పోచంపాడు, ఇప్పూరు (రామపాదసాగరు) రిజర్వాయరు ప్రాజెక్టులు 500 కోట్లరూపాయలు ఖర్చుపెట్టి రాబోయే పది పదిహేను సంవత్సరాలలో నిర్మించుకోవాలి. తుంగభద్ర హైలెవలు ఛానలు యీ ప్రణాళిక కాలములోనే రాయలసీమలోని కరువు నివారించడానికి పూర్తి చేసుకోవాలి. యీ పెద్ద ప్రాజెక్టులతో సమన్వయం చేసుకుంటూ, వంశధార, లాంగల్య మొదలగు అనేక చిన్న చిన్న నదులకు, వాగులకు ఆనకట్టలు కట్టి చెరువులు నింపుకొన్నప్పుడు మరో లక్ష నూతులు బనా త్రవ్వి వీనికన్నిటికి విద్యుచ్ఛక్తిని సరఫరా చేసినప్పుడు ఆంధ్ర ప్రదేశ్‌లో 2 కోట్ల ఎకరాలకు నీటి సదుపాయాలు కలుగుతాయి.

నీటి సదుపాయాలతో పాటు, ఎరువులు, పంటలకు వచ్చే తెగుళ్ళకు క్రిమి సంహారక మందులు, పశువులకు వచ్చే జబ్బుల నిర్మూలించడానికి కావలసిన మందులు, చికిత్సాకేంద్రాలు ఏర్పరచి, పాడి పంటల పెంపొందించి ప్రతి వ్యక్తికి రోజుకు సేరు ఆహార పదార్థాలు, సేరు పాలు లభ్యమయ్యేట్లు చూడాలి.

గోదావరి లోయలో కొత్తగూడెం, బెల్లంపల్లి బొగ్గుగనుల నుండి నేడు తీస్తున్న 3 లక్షల టన్నులకు బదులు రాబోయే పదేండ్లలో 3 కోట్ల టన్నులు ఏటేటా త్రవ్వి తీయాలి. థర్మలు స్టేషనులను, హైడలు ప్రాజెక్టులను నిర్మించి 20 లక్షల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని కనీసం ఉత్పత్తి చేసి ఆంధ్రప్రదేశ్‌లో తలకొకటి 200 యూనిట్ల విద్యుచ్ఛక్తినైనా పదేండ్లలో సరఫరా చేయాలి.

ఆంధ్ర ప్రదేశ్‌లో విరివిగా దొరుకుతున్న బొగ్గు, ముడి ఇనుమును ఉపయోగించుకొని ఉక్కు పరిశ్రమను ఏర్పాటు చేయాలి. యీ బొగ్గును వినియోగించుకొని అనేక రసాయనిక వస్తు పరిశ్రమలను అభివృద్ధిచేయాలి. మైకా బరైట్సును ఇతర లోహాలను వినియోగించుకుంటూ అనేక పరిశ్రమలను నెలకొల్పాలి. రోడ్డు, రవాణా, రైలు సౌకర్యాలు పెంపొందించాలి. ఆంధ్ర ప్రదేశ్ అంతా ఒకే రైలు జోనులో ఉండేటట్లు రైల్వే పునర్నిర్మాణం చేయాలి.

చేతి పరిశ్రమలకన్నిటికి సహకార సంఘాలు ఏర్పాటుచేసి వారికి కావలసిన ముడి సరకులు తక్కువ ధరలకు సరఫరాచేసి తయారైన వస్తువులను పూర్తిగా అమ్మడానికి ఆ పరిశ్రమలలో పనిచేసేవారికి కనీస జీతాలు గ్యారంటీ చేయడానికి ప్రభుత్వం ముందుకు రావాలి.

## అధికార భాషగా తెలుగు

మన తెలుగు భాష, తెలుగు సంస్కృతి అభివృద్ధి చెందాలంటే ప్రభుత్వం ఇంకేమాత్రం ఆలస్యం చేయకుండా పరిపాలనా వ్యవహారాలన్నిటినీ అన్ని స్థాయిలలోను తెలుగు

భాషలోనే రాబోయే ఐదేండ్లలో, పూర్తిగా సాగించాలి. కళాశాలలలో, విశ్వ విద్యాలయాలలో తెలుగు ద్వారానే అన్ని విషయాలు బోధించాలి. అప్పుడే మన విద్యావేత్తలకు, మన సేవా పులకు, మన ప్రభుత్వానికి సామాన్య ప్రజలతో సజీవ సంబంధాలు ఏర్పడుతాయి. సామాన్య ప్రజలందరికీ ఉన్నత విద్యాభ్యాసానికి, ఉన్నతాధికార నిర్వహణకు, సమాన అవకాశాలు దొరుకుతాయి. మైనారిటీ భాషలవారికి కూడా వారి భాషలోనే ఉన్నత విద్యాబోధన చేయాలి. హిందీని, ఇంగ్లీషును నేర్చుకోడానికి 8వ తరగతి నుండి సెకండరీ స్కూళ్ళలోను కళాశాలలలోను, సదుపాయాలు ఏర్పాటు చేయాలి. కాని ఐచ్ఛికంగా వీనిని నేర్వాలని, ఇంగ్లీషు లేదా హిందీద్వారా రకరకాల కోర్సుల విద్యాబోధన చేయాలనే ప్రయత్నము కొనసాగితే జాతీయైక్యతకు బదులు, జాతీయ విచ్ఛిన్నతకు దారి తీస్తుంది.



వేయి మందికున్న గ్రామ ప్రాంతానికి ఏడు తరగతులున్న ఒక ప్రాథమిక పాఠశాలను, పదివేల జనాభా ప్రాంతానికి ఒక హయ్యరు సెకండరీ స్కూలును, రాబోయే ఐదేండ్లలో ప్రభుత్వమే నిర్వహించాలి. గుంటూరు, వరంగల్లు, కాకినాడ, కర్నూలులలో విశ్వ విద్యాలయాలు స్థాపించాలి. ప్రతి గ్రామంలో గ్రంథాలయము, ఆటస్థలము, కళా కేంద్రం (విజ్ఞాన మందిరం) ఏర్పాటు చేయాలి.

ప్రతి గ్రామములో, పట్టణంలో మంచినీటి బావులు, మంచినీటి పథకాలు, పరిశుభ్రతకు కావలసిన సదుపాయాలన్నీ ఏర్పాటు చేయాలి. పట్టణాలలో భూగర్భ మురుగు సదుపాయాలు నిర్మించాలి. పదేండ్లలో పదివేల జనాభా ప్రాంతానికి ఒక వైద్యశాల, ఐదుగురు డాక్టర్లతో (అందులో ఒకరు స్త్రీ డాక్టరు) పది మంది నర్సులతోను, పదిమంది వైద్య సహాయకులతోను ఏర్పాటు చేయాలి.

కార్మికులకు, ప్రభుత్వ ఉద్యోగులకు, దుకాణాల పని వారికి కనీస వేతనము 100—150 రూపాయలు, వారానికి ఒక రోజు సెలవు, రోజుకు ఏడెనిమిది గంటలకు మించని పని ఉండాలి. ఒక సంవత్సరము పనిచేసిన వారందరికి ఉద్యోగాలు ఖాయం చేయడం, సాంవత్సరిక సెలవులు, ఇంటి వసతి, ప్రమాదాలకు, రోగాలకు గురి అయినవారికి నష్టపరిహారము. వయస్సు దాటిన తరువాత పెన్షను, ప్రావిడెంటు ఫండు, తదితర భీమా సౌకర్యాలు కల్పించాలి. కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులకు, స్థానిక సంస్థలలో ఉద్యోగులకు జీతాలలో తేడా ఉండరాదు. ఒకే స్థలంలో ఒకే రకం పనిచేసే వారికి జీతాలలో, సౌకర్యాలలో తేడా ఉండకూడదు. స్త్రీ పురుషులకు సమాన జీతాలు ఉండాలి.

వీనిని సాధించాలంటే రోజు రోజుకు ఢిల్లీ ప్రభుత్వ కేంద్రంలో అన్ని అధికారాలు, అన్ని శాఖలలోను కేంద్రీకరించే ధోరణి మాని వేయాలి. జనరలు విధానాలు, సమన్వయ బాధ్యత, దేశ రక్షణ, విదేశాంగ నీతి, కరెన్సీ, విదేశ వాణిజ్యము తప్ప మిగిలిన శాఖలన్నీ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలకు అప్పజెప్పి రాష్ట్ర స్వపరిపాలనాధికారాలు విస్తృతి మొనర్చాలి.

మన రాష్ట్రాలలో, పంచాయితీలు, పంచాయతీ సమితులు జిల్లా పరిషత్తులు రహస్య బ్యాలెటుతో ప్రత్యక్ష ఎన్నికలలో దామాషా ఓటింగుద్వారా, అంటే ఏ పార్టీకి ఎన్ని ఓట్లు వస్తే అన్ని స్థానాలు వచ్చే పద్ధతిలో ఎన్నుకోబడాలి. ఉద్యోగస్థులందరూ, మునిసిపలు కమీషనర్లు, పంచాయతీ ఎక్జిక్యూటివు ఆఫీసర్లు, జిల్లా కలెక్టర్లు, ఈ సంస్థలకు లోబడి పనిచేయాలి.

## కేంద్ర సహాయం

ఇలాంటి ప్రణాళికలకు డబ్బు కావాలి. కేంద్ర ప్రభుత్వము, జనాభాను దృష్టిలో పెట్టుకొని ఆదామాషాన ప్రతి ప్లానులోను ప్రతి రాష్ట్రాభివృద్ధికి, అన్ని రంగాలలో ఖర్చుపెట్టడానికి పూనుకోవాలి. వెనుకబడిన రాష్ట్రాలకు అదనంగా సహాయపడాలి.

ఈ మూడు ప్రణాళికల కాలములో మనవంతు జనాభా దృష్ట్యా 2,000 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టవలసి వుంటే ఖర్చు పెట్టింది అన్ని రంగాలలో కలుపుకున్నా 750 కోట్లకు మించదు.

ప్రణాళికల కోసం కావలసిన డబ్బును, సామాన్య ప్రజల మీద రోజు రోజు అధిక పన్నులు వేసి వసూలు చేయడం వల్ల అలజడి, అసంతృప్తి పెరిగి ప్రణాళికలకు ప్రజలతోడ్పాటు రాదు. వ్యతిరేకత వస్తుంది. ఏ ఒక్కరికి నెలకు 100 రూపాయలకు తగ్గని జీతభత్యాలు వచ్చేవరకు, ఏ వ్యక్తికి పెద్ద ఆఫీసరు కానివ్వండి, పెద్ద పరిశ్రమాధికారి కానివ్వండి, పెద్ద షావుకారు కానివ్వండి నెలకు 1,000 రూపాయలకు మించని ఆదాయము వదిలి అదనపు ఆదాయాన్నంతా ప్రభుత్వం సేకరించాలి. గ్రామసీమలలో ప్రతి ఒక్కరికీ పని కల్పించడానికి వ్యవసాయాభివృద్ధి గావించి, కావలసిన ఆహారాన్ని ఇతర ముడి సరుకులను సమృద్ధిగా తయారు చేయడానికి భూమిమీద స్వయంగా కాయకష్టముతో పని చేసుకొనే వారికే, దున్నే వారికే భూమి ఉండేటట్లు, భూసంస్కరణలు అమలు జరపాలి. ప్రభుత్వ అధికారములో ధనాఢ్యుల ప్రాబల్యం పోయి కష్టజీవుల ప్రాబల్యము రావాలి.

## నవసమాజ నిర్మాణం

ఆనాడే నిజమైన రాష్ట్రాభ్యుదయం, భారతదేశాభ్యుదయం పూర్తిగా సాధ్యమవుతుంది. ఆనాడే ఒక మనుష్యుని శ్రమ ఫలితాన్ని మరో మానవుడు దోచుకునే నేటి విధానానికి స్వస్తిచెప్పడం జరుగుతుంది. ప్రజలందరమూ నిత్యమూ పనిచేయడానికి అలవాటు పడిపోయి సోమరితనాన్ని అసహ్యించుకుంటూ, వివిధ కళోపాసకులమయి మన విజ్ఞానాన్ని, సంస్కృతిని రోజుకు రోజుకు యావజ్జీవం అభివృద్ధి చేసుకుంటూ సుఖప్రదమైన జీవితాన్ని అనుభవిస్తాము. ఇరుగుపొరుగు వారి శ్రేయస్సే మన శ్రేయస్సనీ లాభాపేక్ష గల నేటి సమాజస్థానాన, సేవాదీక్ష గల సమాజాన్ని నిర్మించుకుంటాం. ప్రతిఒక్కరూ శక్తికొలది పనిచేస్తూ, కనీస అవసరాలకు కావలసినంతనుట్టుకే ప్రతిఫలము తీసుకొనే మానవున్ని నూతన సమాజాన్ని సృష్టించుకుంటాం.

---

# స్వీకారం

1. గ్రంథం పేరు: శ్రీ గోదా త్రింశన్మాల.
రచయిత: శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు
వెల: 20 న. పై.
ప్రాప్తి స్థానం: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారాయణపురము, ఉల్లిపాలెం పోస్టు, దివి తాలూకా, కృష్ణా జిల్లా.

2. శ్రీ వేంకటేశ్వర గీతాంజలి,
రచయిత: తాతపూడి శ్రీరామచంద్ర కీర్తి
అమూల్యం.
ప్రాప్తి స్థానము: మహేంద్రవాడ పబ్లిషింగ్‌హౌస్, యానాం, పాండిచేరిస్టేట్.

3. శివస్తోత్రములు,
సంపాదకులు: పురాణపుండ రామమూర్తి.
వెల: 50 న. పై.
ప్రతులకు: పి. రాధాకృష్ణమూర్తి, ఆధ్యాత్మ ప్రచారక సంఘం, రాజమండ్రి—తూ.గో. జిల్లా.

4. శ్రీ అగస్త్యేశ్వరశతకము:
రచయిత: విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు, యం.ఏ.
వెల: 25 న. పై.
ప్రాప్తిస్థానం: బి. వి. అండ్ సన్సు, రామారావుపేట, కాకినాడ.

5. శ్రీ సత్యదేవ సంప్రార్థనము (అష్టోత్తరశతకము)
రచయిత: విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు, ఎం.ఏ.
వెల: 25 న. పై.
ప్రకాశకులు: బి. వి. అండ్ సన్సు; రామారావుపేట, కాకినాడ.

6. శ్రీ గోదాస్తుతి
అనుకృతి: శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు
వెల: 30 న.పై.
ప్రకాశకులు: శ్రీ గోదా గ్రంథమాల; శ్రీమన్నారాయణపురము, ఉల్లిపాలెం పోస్టు; దివి తాలూకా, కృష్ణా జిల్లా.



# ప్రగతి పథంలో

(జిల్లాలనుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గురించిన సంక్షిప్త వార్తలు)

## అనంతపురం

### పాఠశాలా భవన నిర్మాణం

కూచినవారిపల్లి, జంగంరెడ్డిపేట, దుగ్గుపల్లి గ్రామాలలోని ప్రజలు స్వయం సహాయంతో తమ పిల్లల పాఠశాలకు పక్కా భవనాలను నిర్మించారు.

### మేలురకం వరి విత్తనాల సరఫరా

రాయదుర్గం సమితి ఇటీవల ఐదెకరాల మాగాణి భూమిలో విత్తనాల క్షేత్రాన్ని నిర్వహించింది. మేలురకం విత్తనాలను పండించి వాటిని బ్లాకు ప్రాంతంలోని రైతులందరికీ పంచిపెట్టే ఉద్దేశంతో ఈ క్షేత్రం ప్రారంభించారు.

## ఆదిలాబాద్

### పశు ప్రదర్శన

ఈ సంవత్సరం నవంబర్ నెలలో ఆదిలాబాద్‌లో జిల్లా పశు ప్రదర్శన నొకదానిని నిర్వహించాలని ఇటీవల జరిగిన జిల్లా పరిషత్తు సమావేశంలో నిర్ణయించారు. అలాగే నిర్మల్‌లో కూడ ఒకరోజు ప్రదర్శనను ఏర్పాటు చేస్తారు.

### వయోజన విద్య

పొన్నారి గ్రామంలోని యువకులు గ్రామం మొత్తానికి ఒక వయోజన విద్యా పథకాన్ని రూపొందించారు. ఈ పథకం వల్ల స్త్రీలతో సహా వయోజనులందరినీ రెండేళ్ళలోపల అక్షరాస్యులుగా చేస్తారు. ఈ కార్యక్రమం ఆగస్టు 15 వ తేదీ నుంచి ప్రారంభమయింది.

## కడప

### స్త్రీలకు గ్రామనాయకుల శిక్షణ శిబిరం

దీండ్లవాగు గ్రామంలో స్త్రీలకై గ్రామనాయకుల శిక్షణ శిబిరాన్నొకదానిని మూడు రోజుల పాటు ఏర్పాటు చేశారు. గృహ నిర్వహణ, తోట పెంపకం, ఆరోగ్యం, పారిశుధ్యం, కుటుంబ నియంత్రణ, చిన్న మొత్తాల పొదుపు మొదలైన విషయాలను గురించి తగు ప్రదర్శనల ద్వారా బోధించారు. చివరి రోజున స్త్రీల బహిరంగ సమావేశం జరిగింది. ఈ సమావేశంలో మహిళా మండలి, బాలవాడీల సభ్యులు వినోద కార్యక్రమాలతో ప్రేక్షకులను ఆనందపరిచారు.

## కరీంనగరం

### మధ్యాహ్న భోజన పథకం

గొట్ల నరసింగపూర్‌లోని ప్రభుత్వ ప్రాధమిక పాఠశాలలో

జూలై 14 వ తేదీన కేర్ సంస్థ సహకారంతో మధ్యాహ్న భోజన పథకాన్ని ప్రారంభించారు. ఈ పథకం క్రింద ఆ పాఠశాలలో 50 మంది పిల్లలకు మధ్యాహ్నం పూట ఉచితంగా భోజనం పెడతారు.

## కర్నూలు

### మేలురకం విత్తనాలు

వ్యవసాయపు పనుల ఋతువు ప్రారంభం కావడంతో నంద్యాల పంచాయతీసమితి, రైతులకు మేలురకం విత్తనాలను పంచిపెట్టే కార్యక్రమాన్ని చేపట్టింది. 783½ మణుగుల మేలురకం వరి విత్తనాలను, 87 మణుగుల పప్పు ధాన్యాలను, 3373 మణుగుల వేరుసెనగను అప్పుడే రైతులకు పంచిపెట్టారు.

## కృష్ణా

### యువజన క్లబ్

కాడేపల్లి గ్రామంలో ఒక యువజన క్లబ్‌ను ప్రారంభించి 10-7-62 తేదీన జరిగిన సత్వసభ్యసమావేశంలో ఆ సభ్యులు గ్రామంలో జరిగే అన్ని అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొంటామని ప్రమాణం చేశారు.

## ఖమ్మం

### ఏజెన్సీ సమితి

బూర్గుంపాడు పంచాయతీసమితిని (ఏజెన్సీ, రెండవ దశ బ్లాకు) 12-6-1962 వ తేదీన ప్రారంభించారు. ఈ సందర్భంగా కొండజాతులవారి హాస్టల్‌లో ఒక విందు ఏర్పాటు చేశారు.

## గుంటూరు

### గ్రామ సహాయకులకు శిక్షణ

గోకరాజు నల్లిబోయినవారిపాలెంలో జూన్ ఆఖరివారంలో గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం ఒకదానిని మూడురోజుల పాటు ఏర్పాటు చేశారు. ఆ గ్రామంలో 50 మంది ఈ శిక్షణ పొందారు. వ్యవసాయం, పశుపోషణ, నీటి పారుదల, సహకారం, పంచాయతీ పరిపాలన మొదలైన విషయాలను గురించి బోధించారు.

## చిత్తూరు

### సమన్వయ ఫలితం

కుమార బొమ్మరాజాపురం గ్రామంలో గల సమితి ప్రాథమిక పాఠశాల స్థలం అధికారులు అనధికారుల సమన్వయ కృషికి ఒక నిదర్శనం. ఆ పాఠశాలకు బావి అత్యవసరంగా వుంది. బ్లాకు అధికారులు పని ప్రారంభించగా గ్రామీణులు కూడా తగిన పనిముట్లు తీసుకొని పని ప్రారంభించారు. అంతే; ఇప్పుడా పాఠశాలకు ఒక బావి ఏర్పడింది.

### బాలల విద్యా పథకం

గంగాధర నెల్లూరు బ్లాకు ప్రాంతంలో పాఠశాలలు తెరవగానే బడికి వెళ్ళే వయసువచ్చిన పిల్లలనందరినీ పాఠశాలలకు పంపడానికి కృషి జరిగింది. తత్ఫలితంగా ఆ పాఠశాలలలో మొదటి నెలలో 98 మందిని చేర్చుకున్నారు.

## తూర్పు గోదావరి

### కుటుంబ నియంత్రణ సంఘం

తునిలో బ్లాకు స్థాయిలో ఐదుగురు సభ్యులతో ఒక కుటుంబ నియంత్రణ సంఘాన్ని ఏర్పాటు చేశారు. ప్రతి ఆదివారం కోటనందూరు ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో సమావేశమై వెసిక్టమి ఆపరేషన్లు చేయాలని ఈ సంఘం ఒక తీర్మానం చేసింది.

### కార్యాచరణ ఉప సంఘాలు

ఆహారోత్పత్తికి సంబంధించిన ప్రణాళికలను విజయవంతంగా అమలు జరుపడానికి పి. పోలవరం, కాటనందూరు, అల్లిపూడి, బిళ్ళనండూరు, యన్. సూరవరం, దొండవాక, కొ. మల్లవరం గ్రామాలలో కార్యాచరణ ఉపసంఘాలను ఏర్పాటు చేశారు. డి. పోలవరంలో గ్రామసభను కూడా నిర్వహించారు.

## నల్గొండ

### మశూచి నిర్మూలన

సెప్టెంబర్ 1వ తేదీ నుంచి నల్గొండ జిల్లాలో జాతీయ మశూచి నిర్మూలన కార్యక్రమం ఆరంభ మవుతుంది. ఇందుకై 1962-63లో ఒక లక్ష రూపాయలను ఖర్చు చేస్తారు.

### త్రాగు నీటి సౌకర్యం

గ్రామీణ ప్రాంతాల్లో మంచినీటి సరఫరాకై జిల్లాలలో 40 కొత్త బావులను త్రవ్వి, 56 పాత బావులను బాగు చేశారు.

## నెల్లూరు

### వయోజన విద్యా కేంద్రాలు

మూగచింతల, కోయవారి పాలెం, పంగులూరివారి పాలెం, రాయలగడ్డ పాలెం గ్రామాలలో త్వరలో వయోజన విద్యా కేంద్రా

లను ప్రారంభించనున్నారు. ఈ కేంద్రాల నిర్వహణకయ్యే ఖర్చులో 50 శాతాన్ని ఆ గ్రామాల ప్రజలే భరిస్తారు.

### స్వచ్ఛంద మధ్యాహ్న భోజన కేంద్రాలు

జడుగుమల్లి, కామసల్లి గ్రామాల ప్రజలు స్వచ్ఛంద మధ్యాహ్న భోజన కేంద్రాలను నిర్వహిస్తున్నారు. ఈ కార్యక్రమం క్రింద ప్రతి గ్రామంలోనూ 20 మంది పిల్లలకు భోజనం పెడుతున్నారు.

## నిజామాబాద్

### రేడియో సెట్లు

అన్నారం కాలనీ, దుద్కి గ్రామాలలో గత జూలై ఆఖరి వారంలో రెండు కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పారు.

## పశ్చిమ గోదావరి

### ఖరీఫ్ ఉద్యమం

అత్తిలి సమితి ప్రాంతంలో ఖరీఫ్ వరి ఉద్యమం 32,600 ఎకరాలలో ప్రారంభించారు. 3,773 ఎకరాలలో జపాను పద్ధతిలో వరి నాటారు.

## మహబూబ్ నగరం

### సహకారోద్యమం

86 గ్రామాలు సహకారోద్యమం క్రిందకు తీసుకు రాబడ్డాయి. 2,375 మంది సభ్యులతో 53 ఋణాల సొసైటీలు రు. 63,924 ల చెల్లింపు మూలధనంతో ఏర్పడినవి. ఈ 53 సంఘాలలో 20 సంఘాలను బహుళార్థ సాధక సంఘాలుగా మార్చారు.

## మెదక్

### నీటి సరఫరా పథకం

ఆగస్టు 8వ తేదీన జరిగిన జల్లా పరిషత్తు సమావేశంలో 45 లక్షల రూపాయలు వ్యయమయ్యే ఒక మంచి నీటి సరఫరా పథకాన్ని ఆమోదించారు. ఈ పథకం వల్ల 814 గ్రామాలకు నీరు సరఫరా చేయబడుతుంది. ఈ ఖర్చును ప్రభుత్వమే దశలవారీగా భరిస్తుంది.

## వరంగల్లు

### గ్రంథాలయం ప్రారంభం

పర్లపల్లి గ్రామంలో ఒక యువజన క్లబ్బుంది. ఈ క్లబ్ గ్రామంలో ఒక గ్రంథాలయాన్ని స్థాపించగోరి గ్రామంలో ఆరు వందల పుస్తకాలను సేకరించింది. తత్ఫలితంగా ఒక చక్కని గ్రంథాలయం ఏర్పడింది.

## విశాఖ పట్నం

### వనమహోత్సవం

కోటారట్ల సమితిలోని అన్ని గ్రామాలలో పొలంగట్లమీద, చెరువు కట్టంమీద కొద్దిరి చెట్లు నాటి వన మహోత్సవం జరిపారు.

## శ్రీకాకుళం

### యువజన క్లబ్ మహిళా మండలి

సంతకవిటిలో జూన్ మూడవ తేదీన ఒక యువజనక్లబ్‌ను నాలుగవ తేదీన ఒక మహిళా మండలిని ప్రారంభించారు. మహిళా మండలిలో కుట్టుపని, చేతిపనులు నేర్పుతారు.

## హైదరాబాద్

### లంబాడీ గృహాల కాలనీ

తాండూరు సమితిలోని కందేనేపల్లి గ్రామంలో లంబాడీ గృహాల కాలనీకి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరిశ్రమల మంత్రి ప్రారంభోత్సవం జరిపారు. ఆరు వేల మంది లంబాడీలకై ఇటువంటి కాలనీలను పద్నాలుగింటిని నెలకొల్పడానికి తాండూరు పంచాయతీ సమితి నిర్ణయించింది. వాటిలో ఇదే మొదటిది. ఈ కాలనీలకు రూ. 1,64,000.00 ల ప్రభుత్వ సహాయం లభిస్తుంది.



# మెట్రిక్ కొలతల ప్రకారం కొనండి

1962 అక్టోబరు 1వ తేదీనుండి పొడవు, వెడల్పుల కొలతలకి మీటరును ఒక ప్రమాణముగా విధిగా వాడి తీరాలి.

గజము, అడుగు, అంగుళం ప్రమాణాలు చట్ట సమ్మతము కానివి అవుతాయి.

బట్టల తానులమీద అప్పుడే మీటర్ల గుర్తులు వేయబడినాయి. వాటి ధర కూడా 'మీటరు ఇంత' అని వేయబడింది.

> ఒక మీటరు అంటే ఒక గజము పైన 3⅜ అంగుళాలు. ఒక గజం బట్ట ధర రూ. 1.00 న.పై అయితే, అదే రకం ఒక మీటరు బట్ట ధర 1 రూపాయి 9 నయాపైసలు అవుతుంది.



**మెట్రిక్ పద్ధతి అనగా సౌలభ్యము మరియు సారూప్యము**

భారత ప్రభుత్వముచే జారీ చేయబడినది

DA [illegible]

# ముఖ్యవార్తలు

## రాష్ట్రంలో

**జూలై 23:** హైదరాబాద్‌లోని బాలల ఆరోగ్య సంస్థ, పేడియాట్రిక్ కేంద్రాన్ని కేంద్ర ఆరోగ్యమంత్రి ప్రారంభించారు.

**జూలై 26:** రాష్ట్ర న్యాయ, సమాచార శాఖలమంత్రి హైదరాబాద్‌లో యాత్రికుల ఆతిధ్య పథకాన్ని లాంఛన ప్రాయంగా ప్రారంభించారు.

**జూలై 27:** హైదరాబాద్‌లో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ నూతన భవనాలకు రాష్ట్రపతి ప్రారంభోత్సవం చేశారు.

ఆంధ్రప్రదేశ్‌లో ఒక వ్యవసాయ విశ్వ విద్యాలయాన్ని రాజేంద్రనగర్ వద్ద నెలకొల్పాలన్న బిల్లును గెజెట్‌లో ప్రచురించారు.

**జూలై 27:** తగిన ప్రమాణాలు లేని మందులను నిరోధించే ఒక తీవ్ర ఉద్యమం రాష్ట్రంలో ప్రారంభమైంది.

**ఆగస్టు 1:** ఆంధ్రప్రదేశ్ కౌలుదారీ చట్టాన్ని శాసన మండలి సంయుక్త నిర్ణాయక సంఘానికి పంపింది.

**ఆగస్టు 2:** హైదరాబాద్‌లో రెండురోజులపాటు జరిగిన పార్లమెంటు సభ్యుల సమావేశంలో ముఖ్యమంత్రి రాష్ట్రావసరాలను గురించి వివరించారు.

**ఆగస్టు 3:** హైదరాబాద్‌లో లఘుపరిశ్రమల విస్తరణ శిక్షణ కేంద్రాన్ని ముఖ్యమంత్రి ప్రారంభించారు.

**ఆగస్టు 10:** అన్ని రాష్ట్రాల ఎన్నికల ముఖ్యాధికారుల (చీఫ్ఎలక్టరల్ ఆఫీసర్లు) మూడురోజుల సమావేశం హైదరాబాద్‌లో ప్రారంభమైంది.

## భారతదేశంలో

**జూలై 30:** విదేశీ మారక ద్రవ్యంలో తీవ్రమైన కొరత ఏర్పడినందున న్యూస్ ప్రింట్ కేటాయింపుకు సంబంధించిన కోతను భారతప్రభుత్వం ప్రకటించింది.

ఆగస్టు 3: సమాజాభివృద్ధి, పంచాయతీరాజ్ శాఖలరాష్ట్రమంత్రుల వార్షిక సమావేశాన్ని ప్రధానమంత్రి న్యూఢిల్లీలో ప్రారంభించారు.

ఆగస్టు 5: మద్రాసు రాష్ట్రంలో నైవేలీ థర్మల్ విద్యుత్ కేంద్రం మొదటి యూనిట్‌ను భారత రాష్ట్రపతి ప్రారంభించారు.

ఆగసు 6: రాష్ట్ర కార్మికశాఖా మంత్రుల సమావేశం న్యూఢిల్లీలో జరిగింది.

ఆగస్టు 7: మద్రాసు హైకోర్టు శత వార్షికోత్సవాలకు రాష్ట్రపతి ప్రారంభోత్సరం జరిపారు.

ఆగస్టు 9: విదేశీ మారక ద్రవ్యం కొరతవల్ల ప్రభుత్వం చిన్నకార్లు ఉత్పత్తి చేసే పథకాన్ని విరమించుకుంది.

ఆగస్టు 13: బొగ్గుపని పరిశ్రమలో కార్మికులకై కేంద్ర ప్రభుత్వం ఒక వేతన నిర్ణాయక సంఘాన్ని ఏర్పాటు చేసింది.

## విదేశాలలో

జూలై 31: భారత దేశానికి 1070 మిలియన్ డాలర్ల సహాయాన్నివ్వడానికి 'ఎయిడ్ ఇండియా క్లబ్', ప్రపంచ బ్యాంకులు అంగీకరించాయి.

ఆగస్టు 1: మలయేసియా సమాఖ్య నిర్మాణానికి బ్రిటన్, మలయాలు ఒక ఒప్పందానికి వచ్చాయి.

ఆగస్టు 2: ప్రెసిడెంట్ క్వామే ఎన్‌క్రుమాను హత్య చేయడానికి చేసిన ఒక ప్రయత్నం విఫలమైంది.

ఆగస్టు 6: సరిహద్దు వివాదం గురించి చర్చలను పునః ప్రారంభించాలని చైనా ప్రతిపాదించింది.

ఆగస్టు 11: రష్యా మూడవ అంతరిక్ష యాత్రికుడిని విశ్వాంతరాళంలోకి పంపింది.

ఆగస్టు 16: పశ్చిమ న్యూగినీ పై అధికారాన్ని హేగ్‌నుంచి జకార్తాకు దశల వారీగా దత్తంచేసే లాంఛన ప్రాయమైన ఒప్పందంపై నెదర్ లాండ్స్, ఇండోనీషియాలు సంతకాలుచేశాయి.

ఆగస్టు 15: రష్యా అంతరిక్షంలోకి పంపిన ఇద్దరు రోదసీ యాత్రికులు కజక్‌స్థాన్‌లోని దక్షిణ కారగండా కాస్మోడ్రోమ్ సమీపంలో భూమిమీదకు దిగారు.



# సహకార పద్ధతిని సంపూర్ణ ధన సహాయ పథకం

శ్రీ సయ్యద్ ఆబిద్ హుస్సేన్ రజ్వీ

రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా డిప్యూటీ గవర్నరు, 1959 ఏప్రిల్‌లో ఆంధ్రప్రదేశ్‌లో పర్యటించిన సందర్భంలో సహకార సంఘాల ద్వారా అభివృద్ధిపరిచేందుకై ఒక మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టు–మూసీ–ని ఎన్నిక చేయవచ్చనీ, స్వల్ప కాలిక, దీర్ఘకాలిక ఋణాల క్రింద వ్యవసాయదార్లకు పూర్తి ఆర్థిక సహాయం చేయవచ్చని సూచించారు. దీర్ఘకాలిక పెట్టుబడులకై ప్రాజెక్టు పేరిట ప్రత్యేక డిబెంచర్లను జారీ చేయవచ్చని కూడా ఆయన సూచించారు. ఈ పథకం విజయవంతం కావడానికి రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా వారు తగు విధంగా సహాయపడగలరని కూడా ఆయన రాష్ట్ర ప్రభుత్వానికి హామీ ఇచ్చారు. మొదట్లో ఈ పథకాన్ని ప్రయోగాత్మకంగా అమలుపరచవచ్చనీ, ఫలితాలు ప్రోత్సాహకరంగా వుంటే తరువాత దీనిని ఇతర నీటి పారుదల ప్రాజెక్టులకు కూడా వర్తింపజేయవచ్చని రిజర్వు బ్యాంకు సూచించింది.

సహకార సంఘాల అడీషనల్ రిజిస్ట్రారు ప్రాజెక్టు ప్రాంతంలో పర్యటించి, స్థానిక రెవెన్యూ సహకార శాఖల అధికార్లతోనూ, వ్యవసాయదార్లతోనూ రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా తలపెట్టిన విధంగా సంపూర్ణ ధన సహాయ పథకాన్ని గురించి చర్చలు జరిపారు. ఈ పథకం అమలుకు సంబంధించి ఆయన కొన్ని సూచనలు చేస్తూ ఇది విజయవంతమవుతుందని తమ ఆశాభావం ప్రకటించారు. సమగ్రంగా పరిశీలనలు జరిపి, పథకం వివరాలను సిద్ధంచేసే నిమిత్తం 1959 నవంబరులో రిజర్వు బ్యాంకు వారు కూడా ఇద్దరు అధికార్లను పంపించారు.

రిజర్వు బ్యాంకు అసిస్టెంటు ఛీఫ్ ఆఫీసరు, గ్రామీణ పరపతి వ్యవహారాల అధికారి; ఆంధ్రప్రదేశ్ సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు కార్యదర్శి, భూమి తనఖా బ్యాంకుల వ్యవహారాలు చూసే సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారు, నల్గొండ సహకార సంఘాల డిప్యూటీ రిజిస్ట్రారుతో కలిసి దాదాపు నెల రోజుల పాటు ప్రాజెక్టు ప్రాంతాలలో విస్తృతంగా పర్యటించారు. స్థానికాధికార్లనూ, చాలా మంది వ్యవసాయదార్లను వారు కలుసుకున్నారు. ఆ ప్రాంతాలలో అమలులోనున్న వివిధ శాసనాలనూ, సెటిల్మెంటు, రెవెన్యూ రికార్డులను కూడా వారు పరిశీలించారు. అక్కడి వారిని ఎదుర్కొంటున్న సమస్యలను అవగహన చేసుకోడంలో వారు చాలా శ్రద్ధ తీసుకున్నారు. ఆచరణీయమైనవీ, ఉపయుక్తమైనవి అయిన సూచనలను చేయడమే కాకుండా వారు సమగ్ర పథకాన్ని కూడా సిద్ధం చేశారు.

రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా 1960 అక్టోబరు 17 వ తేదీన బెంగుళూరులో ఏర్పాటు చేసిన సమావేశంలో ఈ పథకాన్ని చర్చించి దానికి తుది స్వరూపమిచ్చారు. దీని ముఖ్యాంశాలు స్థూలంగా ఇవి:

## పథకాన్ని గురించిన సంక్షిప్త వివరణ:

### పథకం అమలుపరచబడే ప్రదేశం:

మూసీ, నల్గొండ జిల్లాలోని ఒక మధ్యతరహా నీటి పారుదల ప్రాజెక్టు. 42 గ్రామాలలోని సుమారు 40,000 ఎకరాలకు ఈ ప్రాజెక్టు నీరు లభిస్తుంది. ఈ విస్తీర్ణంలో 8,000 ఎకరాలను ఇది

వరకే సేద్య యోగ్యం చేయడం జరిగింది. మిగతా 32,000 ఎకరాల విషయంలో, హైద్రాబాదు సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు ద్వారా దీర్ఘకాలిక ఆర్థిక సహాయం లభింపజేయడానికి ప్రతిపాదించబడింది. మూడు సంవత్సరాల దశలవారీ కార్యక్రమం ఇది.

ఏజెన్సీ : ఈ కార్యక్రమాన్ని హైద్రాబాదు సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు, సూర్యాపేట, నల్గొండ, మిర్యాలగూడెంలలోని ప్రాథమిక భూమి తనఖా సహకార సంఘాల సహకారంతో చేపట్టుతుంది. పైన పేర్కొన్న మూడు ప్రాథమిక భూమి తనఖా సహకార సంఘాల క్రింద, ఈ ప్రాజెక్టు దిగువన సాగయ్యే భూములు ఈ విధంగా వుంటాయి:

| సంఘం పేరు | పథకం వర్తించు గ్రామాల సంఖ్య | పథకం వర్తించు ప్రాజెక్టు క్రింది భూమి విస్తీర్ణం |
|---|---|---|
| (1) | (2) | (3) |
| | | ఎకరాలు గుంటలు |
| ప్రాథమిక భూమి తనఖా సహకార సంఘం, | | |
| సూర్యాపేట | 23 | 16,863-04 |
| ,, ,, నల్గొండ | 11 | 8,247-31 |
| ,, ,, మిర్యాలగూడెం | 8 | 7,296-06 |
| | 42 | 32,406-39 |

ఆర్థికాంశం : ఆర్థికావసరాలకు సంబంధించి దిగువ అంచనాలు వేశారు: 32,000 ఎకరాలు × 300–రూ. 96,00,000.

ఖుష్కీ భూములను తరీ భూముల క్రింద మార్చడానికి రైతులకు ఒక ఎకరానికి రూ. 250 లు మొదలు రూ. 350 వరకు అవసరమవుతుంది కాబట్టి సగటున రూ. 300 ల చొప్పుననికరం చేశారు.

కొంతమంది వ్యవసాయదార్లు ఋణాలు పొందడానికి అర్హులు కాకపోవచ్చు కాబట్టీ, మరి కొంత మంది స్వంత వనరుల నుంచే పని చేపట్టవచ్చు కాబట్టి మొత్తం అర్థికావసరాలను, సంవత్సరానికి రూ. 25,00,000 ల చొప్పున రూ. 75,00,000 లకు లెక్కకట్టారు.

హైద్రాబాదు సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు దీర్ఘకాలిక ఋణాలు ఇచ్చే నిమిత్తం, ప్రత్యేక అభివృద్ధి డిబెంచర్లను జారీ చేయడం ద్వారా రూ. 75,00,000 లు సేకరించవలసి వుంది. వీటిని రెండు సెట్ల క్రింద ఒకదానిని 50 శాతం మొత్తానికి 8 సంవత్సరాలకూ, రెండవదాన్ని మిగతా 50 శాతం మొత్తానికి 15 సంవత్సరాలకూ జారీ చేయవలసి వుంది. 15 సంవత్సరాల డిబెంచర్లకు నూటికి నూరు వంతులు, 8 సంవత్సరాల డిబెంచర్లకు నూటికి 50 వంతులు అంటే మొత్తంమీద నూటికి 75 వంతుల చొప్పున ఇవ్వడం ద్వారా రిజర్వు బ్యాంక్ ఆఫ్ ఇండియా సహాయం చేస్తుంది. మామూలు ప్రకారం, రాష్ట్ర ప్రభుత్వం ఈ డిబెంచర్లకు హామీ వుండాలి.

దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వడానికై ఈలోగా కేంద్ర భూమి తనఖా బ్యాంకుకు కావల్సిన మొత్తాన్ని ప్రభుత్వ హామీపై స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా నుంచి పొందవలసి వుంది.

## హామీ

సేద్యయోగ్యం చేయని భూమికి ప్రస్తుత మార్కెటు ధర ఎకరానికి రూ. 1,000 లకు నిర్ధారణ చేయబడింది. సగటున రూ. 600/–ల చొప్పున భూమి విలువను మదింపుచేయడానికి ప్రతిపాదించబడింది (తరీ భూములపై శిస్తుకంటే సుమారు 50 వంతులు అంటే ఎకరానికి రూ. 12–86) మార్కెటు విలువలో 50 శాతం చొప్పున ఎకరానికి ఎక్కువలో ఎక్కువ రూ. 300 ల ప్రకారం ఋణం లభింపజేయడానికి ప్రతిపాదించారు. భూమిని సేద్యయోగ్యం చేయడానికి అయ్యే ఖర్చులూ, ఎద్దులు కొనుక్కోడానికి అవసరమయ్యే డబ్బు కలిపి ఎకరానికి సుమారు రూ. 300/– లకు అంచనా వేశారు. తెలంగాణాలో పశువుల కొనుగోలుకై సాధారణంగా మధ్యకాలిక ఋణాలు ఇస్తారు. ప్రాథమిక భూమి తనఖా సహకార సంఘాలు వీటిని ఇస్తున్నాయి.

## భూస్వామ్యం

ఈ పథకం క్రింద చేసిన ఋణాలకు, భూస్వామ్యం విషయంలోగల లోపాల మూలంగా సంభవించే నష్టంలో 50 శాతం మేరకు రాష్ట్ర ప్రభుత్వం హామీ ఇవ్వవలసి వుంటుంది. కేంద్ర భూమి తనఖా బ్యాంకు, రెవెన్యూ రిజిష్టర్లలోని

హక్కుల రికార్డు ప్రాతిపదికపై వ్యవహరించవలసి వుంటుంది. భూస్వామ్యాన్ని గురించి తెలుసుకోడానికి మామూలు విధానాన్ని పాటించవలసి వుంటుంది కూడా.

## సిబ్బంది

ఈ పథకం నిర్వహణకు ముగ్గురు సహకార శాఖ సబ్ రిజిస్ట్రార్లు, ఆరుగురు సూపర్‌వైజర్లు అవసరం కావచ్చని అంచనా వేశారు. ఈ సిబ్బందికి అయ్యే ఖర్చు అంతటినీ భరించవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వాన్ని కోరడం జరిగింది,

## ఋణాల చెల్లింపు

ఋణం తీసుకున్నవారు మొదటి రెండు సంవత్సరాల వరకు వడ్డీని మాత్రమే చెల్లించవలసి వుంటుంది. తరువాత ఋణం, వడ్డీ మొత్తాలకు గాను పన్నెండు సంవత్సరాల వరకు సమాన కిస్తులను చెల్లించవలసి వస్తుంది. ఈ ఋణాన్ని 14 సంవత్సరాలలో తిరిగి చెల్లించి వేయాలి.

మొదటి రెండు సంవత్సరాల వరకు వడ్డీని మాత్రమే స్వీకరించడానికి కారణం, ప్రారంభదశలో సేద్యపు ఖర్చు సాధారణంగా అధికంగా వుండటమే. అంతేగాక దిగుబడికూడా తక్కువగానే వుంటుంది.

## అమలు

రిజిస్ట్రారుతో, రిజర్వుబ్యాంకుతో సంప్రదించిన మీదట, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం 1961 మే 27వ తేదీన మూసీ నీటిపారుదలప్రాజెక్టు సంపూర్ణ ధన సహాయ పథకాన్ని మంజూరు చేసింది.

ప్రభుత్వం మంజూరుచేసిన ఈ పథకంలోని ప్రధానాంశాలు ఇవి :

మూసీ ప్రాజెక్టు ప్రాంతంలో, ఖాస్రా రికార్డుల ఆధారంగా వ్యవసాయదార్లకు మంజూరు చేసిన ఋణాలపై భూస్వామ్యం విషయంలో ఏర్పడిన లోపాల మూలంగా సంభవించిన నష్టంలో 50 శాతానికి హామీ వుండడానికి ప్రభుత్వం ఆమోదించింది. మిగతా 50 శాతం నష్టాన్ని హైదరాబాదు సహకార కేంద్రభూమి తనఖా బ్యాంకు భరించ వలసివుంటుంది.

పెట్టుబడి ధనం విషయంలోనూ, వడ్డీ విషయంలోనూ మూసీ ప్రాజెక్టు ప్రాంతంలో వ్యవసాయదార్లకు దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వడానికై, సహకార కేంద్రభూమి తనఖా బ్యాంకు, మూడు సంవత్సరాల వరకు ఏటా రూ. 25 లక్షల మేరకు జారీ చేసే ప్రత్యేక డిబెంచర్లకు హామీ వుండడానికి ప్రభుత్వం అంగీకరించింది.

దిగువ సిబ్బందిని మంజూరు చేసింది :—

(1) సహకారశాఖ సబ్ రిజిస్ట్రార్లు—ముగ్గురు.

(2) సూపర్‌వైజర్లు—ఆరుగురు.

సిబ్బంది ఖర్చును మొదటి సంవత్సరంలో పూర్తిగా ప్రభుత్వమే భరించడానికీ, రెండవ సంవత్సరం నుంచి భారతప్రభుత్వం అనుసరించే విధంగా క్రమేణా తగ్గింపు పద్ధతితో ప్రభుత్వం, సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకులు భరించడానికి ఆమోదించబడింది.

మూసీ ప్రాజెక్టు ప్రాంతంలో వ్యవసాయదార్లకు, వాస్తవంగా వారి అవసరాలకు వినియోగించుకోవడానికై ఎకరానికి రూ. 300 లకు మించకుండా దీర్ఘకాలిక ఋణాలు ఇవ్వడానికి ఆమోదించబడింది.

ఈ పథకానికి, ప్రకాశికా సంఘం (కొత్తఢిల్లీ) సలహాదారు శ్రీ బి. పి. పటేల్, ఐ. సి. ఎస్. నల్గొండ జిల్లా, సూర్యాపేటలో 1961 జూలై 15వ తేదీన జరిగిన ఒక బహిరంగ సభలో ప్రారంభోత్సవం చేశారు. ఈ పథకాన్ని గురించి రైతాంగానికి సమగ్రంగా వివరించి, వారి నుంచి ఉపయుక్తమైన సూచనలు తీసుకోవడం, వాటిని చర్చించడం జరిగింది.

ఇప్పటి వరకు, రెవెన్యూ శాఖ, మూసీ ప్రాజెక్టు ప్రత్యేక రెవెన్యూ అధికారి ద్వారా, రైతులకు, భూములను సాగులాయకు చేసుకునేందుకై ఎకరానికి రూ. 150 ల చొప్పున ఋణాలు ఇస్తున్నది. ప్రత్యేక రెవెన్యూ అధికారి, ప్రత్యేక అభివృద్ధి ఋణాల క్రింద రూ. 16,47,928ల మొత్తం పంపిణీ చేశారు. ఒకే విధమైన పని ద్వంద్వంగా జరగకుండా వుండటానికీ, సహకార సంస్థలకు సంపూర్ణ ధన సహాయ పథకాన్ని అమలు పరిచే అవకాశం కలగడానికి వీలుగా ప్రత్యేక అభివృద్ధి ఋణాలను మంజూరు చేసే కార్యక్రమాన్ని విరమించ వలసిందిగా, రిజిస్ట్రారు సూచన మేరకు రెవెన్యూ బోర్డు, నల్గొండ కలెక్టరును ఆదేశించింది.

అవసరమైన సిబ్బందిని నియమించడం ద్వారా, ప్రాథమిక సర్వే తదితర చర్యలు గైకొనడం ద్వారా ప్రారంభ పనులను పూర్తి చేశారు. ఋణాల కొరకు దరఖాస్తులు పెట్టడానికి ప్రోత్సహించే పని 1961 సెప్టెంబరులో ఆరంభమైంది.

1962 మార్చి 31వ తేదీ వరకు ఆరు నెలల స్వల్పకాలంలో జరిగిన అభివృద్ధిని వెల్లడించు వివరాలు ప్రక్క పట్టికలో పొందుపరచ బడినాయి :—

## 31—12—1961 నాటికి జరిగిన అభివృద్ధి

| సంఘం పేరు (1) | ఋణం మంజూరీకై సిఫార్సు చేయబడిన దరఖాస్తుల సంఖ్య (2) | మొత్తం (3) | పంపిణీ చేసిన ఋణాల సంఖ్య (4) | | పథకం వర్తింప జేయబడిన గ్రామాల సంఖ్య (5) | ఋణం పొందిన వ్యవసాయ దార్ల సంఖ్య (6) | పథకం వర్తింప జేయబడిన విస్తీర్ణం (7) |
|---|---|---|---|---|---|---|---|
| ప్రా.భూ.త. స. సం. | | రూ. | సం. | మొత్తం | | | ఎ. గుం. |
| సూర్యాపేట | 171 | 3,62,765 | 10 | 2,21,185 | 5 | 103 | 737_12 |
| నల్గొండ | 142 | 3,72,605 | 68 | 1,71,495 | 3 | 68 | 571_26 |
| మిర్యాలగూడెం | 76 | 1,43,620 | 27 | 36,230 | 2 | 27 | 120_31 |
| మొత్తం | 389 | 8,78,990 | 198 | 4,28,910 | 10 | 198 | 1429_29 |

## 31—3—1962 నాటికి జరిగిన అభివృద్ధి

| సంఘం పేరు (1) | (2) | (3) | (4) | | (5) | (6) | (7) |
|---|---|---|---|---|---|---|---|
| సూర్యాపేట | 374 | 8,79,550 | 319 | 7,55,520 | 19 | 319 | 2668_16 |
| నల్గొండ | 304 | 8,28,170 | 276 | 7,31,970 | 8 | 276 | 2462_27 |
| మిర్యాలగూడెం | 157 | 3,28,560 | 130 | 2,52,835 | 3 | 130 | 842_32 |
| మొత్తం | 835 | 20,36,280 | 725 | 17,40,325 | 30 | 725 | 5973_35 |

రెండవ త్రైమాసిక కాలంలో ఖర్చును సహకార కేంద్రభూమి తనఖా బ్యాంకు, సంఘాలు 50:50 నిష్పత్తిలో భరించాయి. ఈ విధంగా ఆరు నెలల కాలంలో మొత్తం 42 గ్రామాలలోనూ 30 గ్రామాలలో ఈ పథకాన్ని అమలు పరచడం ద్వారా 4621 మంది వ్యవసాయ దార్లలోనూ 725 మందికి దీనిని వర్తింపజేయడం, 5973.35 ఎకరాల విస్తీర్ణాన్ని ఈ పరిధిలోకి తేవడం జరిగింది.

ఋణం కొరకు దరఖాస్తు స్వీకరించింది మొదలు ఋణం పంపిణీ చేసే వరకు భూమి తనఖా బ్యాంకులకు కనీసం మూడు నెలలు పట్టింది. కాని ఋణం కొరకు పెట్టుకున్న దరఖాస్తులపై అంతిమంగా చర్య తీసుకోవడం ముగియడానికి సగటున సుమారు $4\frac{1}{2}$ నెలలు పట్టింది. దిగువ పేర్కొన్న వివరాలు ఈ పరిస్థితిని వెల్లడిస్తాయి :—

| దరఖాస్తు చేసిన తేదీ లగాయతు ఒక నెల లోపుగా పంపిణీ చేయబడిన ఋణాలు | | దరఖాస్తు చేసిన రెండు నెలల లోపుగా పంపిణీ చేయబడిన ఋణాలు | | దరఖాస్తు చేసిన మూడు నెలల లోపుగా పంపిణీ చేయబడిన ఋణాలు | | దరఖాస్తు చేసిన మూడు నెలల తరువాత పంపిణీ చేయబడిన ఋణాలు | |
|---|---|---|---|---|---|---|---|
| సం. | మొత్తం | సం. | మొత్తం | సం. | మొత్తం | సం. | మొత్తం |
| 206 | 4,11,370 | 172 | 4,29,010 | 174 | 4,53,340 | 173 | 4,26,605 |

ఒక నెల లోపుగా అంతిమంగా పరిష్కరించబడిన దరఖాస్తుల శాతం 27. కాగా రెండు నెలలలోపుగా పరిష్కరించబడిన వాటి శాతం 22.

అయితే 1962 ఫిబ్రవరిలో సాధారణ ఎన్నికలు జరిగినందు వల్ల, ఋణాలకు పెట్టుకున్న దరఖాస్తులను త్వరితంగా పరిష్కరించడానికి అనేక ఏర్పాట్లు చేశారు హక్కుల రికార్డులు. రెవెన్యూ రికార్డుల నుంచి ఋణాల కొరకు స్వీకరించిన అన్ని దరఖాస్తుల విషయంలోను భాగాలను ఎత్తి తీసుకోడానికి సిబ్బందిని కోరడం జరిగింది. ఈ పథకం క్రింద పనిచేస్తున్న సహకార శాఖ సబ్ రిజిస్ట్రార్లను, నెలకు దాదాపు 50 దరఖాస్తుల విషయంలో దర్యాప్తులు జరపడానికి, క్షేత్రాలకు వెళ్ళి తనిఖీ చేయడానికి ఆదేశించడం కూడా జరిగింది.

ఋణాలకొరకు ఇచ్చిన దరఖాస్తులను ఎక్కడికక్కడే పరిశీలించే నిమిత్తం, హైదారాబాదు సహకార కేంద్ర భూమి తనఖా బ్యాంకు సలహాదారు, బ్యాంకు తాలూకు లీగల్ అసిస్టెంట్లను కొందరిని పంపడానికి ఏర్పాట్లు చేశారు. దరఖాస్తులను పరిశీలించడంలోనూ, ఒకవేళ ఋణాలకు సంబంధించిన ఫైళ్ళలో స్వల్పమైన లోపాలు ఏమైనా వుంటే అక్కడికక్కడే వాటిని సరుబాటు చేయడంలోను ఆలస్యం జరుగకుండా వుండేందుకై ఈ ఏర్పాటు చేయబడింది. ఎట్టి ఆలస్యం చేయకుండా కార్యవర్గ సమావేశాలను కూడా బ్యాంకు ఏర్పాటు చేసింది.

### భూమిని సేద్యయోగ్యం చేయడానికి జరిగిన పనుల తనిఖీ

ఋణాలను సక్రమంగా వినియోగించడం పట్ల, సహకార శాఖ, రిజర్వు బ్యాంకులు అత్యంత శ్రద్ధ చూపుతాయి. ఋణాలను రెండు వాయిదాలలో పంపిణీ చేస్తారు. తమకు సంబంధించిన సహకార సంఘం గ్రూపు మేనేజింగ్ కమిటీ సభ్యుని నుంచి పని అభివృద్ధినిగురించిన నివేదికను పొందిన మీదటనే రెండవవాయిదా డబ్బును చెల్లిస్తారు. గ్రూపు మేనేజింగ్ కమిటీ సభ్యులు గ్రామాలకు వెళ్ళి, భూమిని సేద్యయోగ్యం చేయడానికి వ్యవసాయ దార్లు తీసుకున్న చర్యలను పరిశీలించి నివేదిక సమర్పించవలసి వుంటుంది. ఇంతేగాక, ఈ పథకం క్రింద పనిచేస్తున్న సహకార శాఖ సబ్ రిజిస్ట్రార్లు కనీసం 50 శాతం కేసులను తనిఖీ చేసి, భూమిని సేద్యయోగ్యం చేయడానికి జరిగే పనులపై నివేదిక అందజేయవలసి వుంటుంది కూడా.

మొత్తం 725 ఋణాలు మంజూరు చేయబడగా ఇప్పటి వరకు 124 కేసుల విషయంలో సహకార సంఘాల రిజిస్ట్రార్లు పనులను పరిశీలించారు.

తాము పరిశీలించిన అన్ని కేసుల విషయంలోనూ, భూములను సేద్యయోగ్యం చేసే పనులు ముగిశాయనీ లేదా చురుగ్గా కొనసాగుతున్నాయని వారు నివేదించారు. వ్యవసాయదార్లు దరఖాస్తు చేసిన వెంటనే, ఋణం లభించగలదనే విశ్వాసంతో తమ భూములను అభివృద్ధి పరుచుకునే పనిలో నిమగ్నమైన పెక్కు సందర్భాలను వారు ఉదహరించారు.

మూసీ ప్రాజెక్టు సంపూర్ణ ధన సహాయ పథకం రైతాంగంలో చాలా ప్రచారం పొందింది. ఋణాల కొరకు విరివిగా అభ్యర్థనలు వస్తున్నాయి. ఈ పథకం వ్యవసాయ దార్లకు మేలు కలిగించడమే గాకుండా దీనిని అమలు పరుస్తున్నట్టి మూడు ప్రాథమిక భూమి తనఖా సహకార సంఘాల లావాదేవీలకు మంచి ప్రోత్సాహాన్ని చేకూర్చింది.

1961 అక్టోబరు నుంచి 1962 మార్చి వరకు ఆరు నెలల స్వల్ప కాలంలోనే ఈ సంఘాలు ప్రశంసార్హమైన అభివృద్ధిని కనబరిచాయి. దిగువ ఇచ్చిన అంకెలు ఈ విషయాన్ని వెల్లడిస్తాయి:

| వివరాలు | ప్రా. భూ. త. స. సం., సూర్యాపేట | | ప్రా. భూ. త. స. సం., నల్గొండ | | ప్రా. భూ. త. స. సం., మిర్యాలగూడెం | |
|---|---|---|---|---|---|---|
| | 31–10–61 నాటికి | 31–3–62 నాటికి | 31–10–61 నాటికి | 31–3–62 నాటికి | 31–10–61 నాటికి | 31–3–62 నాటికి |
| 1. చెల్లించిన వాటాధనం "ఏ" "బి" తరగతులు | రూ. 38,984 | రూ. 50,011 | రూ. 26,908 | రూ. 41,307 | రూ. 6,860 | రూ. 20,682 |
| 2. చెల్లించవలసివున్న ఋణాలు–కేం. స. భూ. త. బ్యాం. | 4,10,517 | 10,42,794 | 3,81,991 | 15,25,305 | 52,480 | 3,44,512 |
| 3. సభ్యులు చెల్లించవలసివున్న ఋణాలు | 4,18,704 | 10,48,869 | 3,89,768 | 11,12,949 | 52,480 | 3,45,875 |
| 4. మొత్తం లాభాలు | 850 | 2,360 | 2,097 | 4,855 | 158 | 1,502 |

సహకార ప్రాతిపదికపై ప్రాజెక్టు ప్రాంతంలో రైతాంగానికి ఆర్థిక సహాయం చేసే ఈ తొలి పథకాన్ని ప్రారంభించి, దానిని విజయవంతంగా అమలు పరిచి తద్వారా ఈ రంగంలో దేశానికే మార్గదర్శియైన ఘనత ఆంధ్ర ప్రదేశ్‌కు దక్కింది.



( ఇంగ్లీషు మూలానికి అనువాదం )

# “గొప్ప ఉపాధ్యాయుడు”

[భారత రాష్ట్రపతి డాక్టర్ యస్. రాధాకృష్ణన్ జన్మదినమైన 1962 సెప్టెంబరు 5వ తేదీన ఉపాధ్యాయుల దినోత్సవం జరిపారు. విద్యా రంగం గురించి, ఉపాధ్యాయుని పాత్ర గురించి ఆ మహామనీషి వెలువరించిన కొన్ని అమూల్యాభిప్రాయాలను ఈ క్రింద పొందుపరుస్తున్నాము ]

మన యువకులకు మనం కల్పిస్తున్న విద్యావిధానం మనకు ఉపాధ్యాయులుగా వుండే స్త్రీ, పురుషులను బట్టి వుంటుంది. బ్రహ్మాండమైన భవనాలు, సాధనసంపత్తి ఉపాధ్యాయునితో సరితూగ లేవు. ఉపాధ్యాయ వృత్తిలో దేశంలో ప్రజ్ఞాధురంధరులైన వారిని చేర్చడానికి ప్రతి ప్రయత్నం చేయాలి. ఈ దేశం విజ్ఞాన వికాస పథంలో పాల్గొనాలంటే విశ్వ విద్యాలయాలు దేశంలో మేధావులైన వారిని ఆచార్య స్థానాలలో నియమించుకోవాలి.

* * * *

జ్ఞానం విజ్ఞాన సహితమ్–జ్ఞాన, విజ్ఞానాలను, వ్యక్తిత్వాన్ని సరి సమానంగా పెంపొందించడానికే ఏ విద్యావిధానమైనా ఉద్దేశింపబడాలి. అది మేధస్సుకు శిక్షణ ఇవ్వడమేగాక మానవ హృదయంలో దయను, క్షమను పెంపొందించాలి.

* * * *

విద్యయొక్క ప్రాముఖ్యత ఒక్క విజ్ఞానం. నేర్పు మాత్రమే కాదు, ఆ విద్య మనం ఇతరులతో ఎలా జీవించాలో కూడా మనకుతెలపాలి. సహకార బుద్ధితో, పరస్పరం సహాయం చేసుకుంటూ జీవించడానికి మనం సుశిక్షితులం కావాలి. మనం విజ్ఞానంతో సాధించిన ఫలితాల కన్నా నైతిక గుణాలు అమూల్యమైనవి.

* * * *

మానవజాతి చరిత్రలోని ఒక విప్లవాత్మకమైన దశలో మనం జీవిస్తున్నాం. ప్రపంచంలోని ఇతర ప్రాంతాలలో పెక్కు శతాబ్దాలపాటు వ్యాపించిన ఈ విప్లవాత్మక శక్తులు మన దేశంలో చాలా కొద్ది కాలంలోని గుమిగూడినాయి. మనం రాజకీయ, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక క్లిష్ట పరిస్థితుల నెదుర్కొంటున్నాం. సాంఘిక ఆర్థిక పరిస్థితుల నెదుర్కొని సేవ చేయడానికి సుశిక్షితులయ్యే యువకులకు అందుకు విద్యే సాధనం.

* * * *

విద్యాలయంఅంటే పెక్కురు ఉపాధ్యాయులు, విద్యార్థులతో కూడుకొన్న ఒక పెద్ద సంస్థ. ఈ ఇరువురి మధ్య సంబంధాలు పవిత్రంగా వుండాలి. మన యువ లోకానికి మనం కల్పిస్తున్న విద్యా విధానం ఉపాధ్యాయులైన స్త్రీ, పురుషులను బట్టి నిర్ణయింపబడి వుంటుంది.

* * * *

మనం జాతీయ విద్యను గురించి మాట్లాడుతున్నామంటే దాని అర్థం భౌతిక, రసాయనిక శాస్త్రాలు, ఇంజనీరింగ్, టెక్నాలజీ వంటి విషయాలు దేశ సరిహద్దులతో పాటు మార్పు చెందాలని కాదు. దాని అర్థం–దేశ సాంప్రదాయాలు ఆచారాల విలువల వైపు యువకుల మనస్సులను మార్చాలి. భారతదేశం ఒక సజీవమైన శక్తియే గాని భౌగోళికంగా ఏ అడ్డంకీ దానికి లేదు.

* * * *

మానవునిలోని పాశవిక ప్రవృత్తిని నిర్మూలించి,అంతర్గత అవరోధాలైన ఆటవిక తత్వం, తిరుగుబాటు మనః ప్రవృత్తి, ఆధ్యాత్మిక జ్ఞానశూన్యతా, కర్తవ్యం పట్ల వైముఖ్యము, మొదలైన దుర్గుణాలను పారద్రోలి, ఆయుధ ధారణ కన్నా–శాంతి సాధనే ప్రధానాశయమూ, భయోత్పాతం కలిగించడంద్వారా శాంతి స్థాపన చెయ్యడం మానవాళి నైతిక సూత్రాలకే విరుద్ధమూ అన్న సత్యాన్ని విస్మరించి బలప్రయోగం ద్వారా సమస్యా పరిష్కారానికి పూనుకొనే వైఖరిని తొలగించి విశ్వ సమాజాన్ని తీర్చిదిద్దడమే విశ్వ విద్యాలయాల మహత్కర్తవ్యం.

* * * *

యూరపులో ఆయా కాలాలలో ప్రభవించిన రాజకీయ, ఆర్థిక, పారిశ్రామిక ఉద్యమాలు భారతదేశంలో ఆయా కాలల్లో ప్రభవించినవి. దేశం యొక్క భవిష్యదభివృద్ధి శతాబ్దాలపాటు చేయవలసిన వాటిని కొన్ని దశాబ్దాలలో సాధించడం మీద ఆధారపడి వుంటుంది.

* * * *

విద్య నభ్యసించక పోయినా దయాహృదయంగల యువతీ

యువకులను బాధపడుతున్న మానవాళికి సేవచేయడానికి పంపితే తప్ప మన విశ్వ విద్యాలయాలు నిజమైన విశ్వవిద్యాలయాలు కాలేవు. ఇది లేకపోతే విశ్వవిద్యాలయ విద్య అసంపూర్తిగానే నిలిచిపోతుంది.

*　　*　　*　　*

లక్షలాది ప్రజలను గుమిగూడ్చి వారిని దేశానికి గర్వకారణమైన గొప్పవారిగా చేసి, వారిని భవిష్యత్తుపట్ల విశ్వాసం గలవారినిగా రూపొందించే నైతిక విప్లవాలు పెక్కు మనకు కావాలి. సత్ గ్రంథాలు మానసిక, నైతిక దృక్పథాలలో మార్పును తీసుకురాగలవు.

*　　*　　*　　*

పటిష్ఠమైన గంభీర భావాలుగల రాజనీతిజ్ఞతకు రాజకీయాలు సోపానం. దానిని పొందడానికి పండితులు, విశ్వ విద్యాలయాలు సహాయం చేయాలి.

*　　*　　*　　*

ఏ సాహిత్యమైనా సాహిత్యోద్దేశాని కనుగుణంగా వుండాలంటే అది కొన్ని నిబంధనలు గల విశేషాలతో, సామాన్య ప్రజానీకపు మానసిక ప్రవృత్తిని చిత్రించి విశ్వమానవునికి అవసరమైన గుణాలను బోధించాలి. అలాగయితేనే జాతీయ సాహిత్యం దాని విశిష్టతను నిలుపుకోవడమే గాక విశ్వ సాహిత్యంలో అంతర్భాగంగా కూడా స్థానాన్ని సంపాదించుకో గలదు.

---

# ఉపాధ్యాయుడు: జాతి నిర్మాత

"స్క్రిపేటర్"

దేశంలోని యువకులను, వారి భవిష్యత్తును తీర్చిదిద్దే మహాయాగంలో ఉపాధ్యాయుని పాత్రను గురించి అట్టే చెప్పనవసరంలేదు. ఒక దేశంయొక్క భవిష్యత్తు ఆ యువకులమీద ఆధారపడి వుంటుంది. ఆ యువకులను భావిపౌరులుగా తీర్చి దిద్దవలసిన మహత్తరమైన బాధ్యత ఉపాధ్యాయునిది గనక విశాల దృక్పథంతో చూస్తే ఉపాధ్యాయుడు ఒక దేశ నిర్మాతగా పరిగణింప బడుతున్నాడు. ఈ పవిత్రోద్దేశాన్ని, దాని ప్రాముఖ్యతను విజ్ఞులైన మన పూర్వీకులు ఏనాడో గుర్తించారు. వివిధ మానవుని జీవిత దశలలో ప్రథమమైందీ, ముఖ్యమైందీ గురుకులం. గురుకులంలో వున్న దశ జీవితంలో అతిముఖ్యమైంది. ఆ దశలో మానవుడు సకల శాస్త్ర పారంగతుడైన గురువువద్ద విద్య నభ్యసిస్తాడు. ఆ తరువాత జీవితంలోని మరొక దశలో అడుగిడి నప్పటికీ గురువు అతని జీవితంలో ఒక స్థానాన్ని ఆక్రమిస్తాడు, ఆయనవద్ద అభ్యసించిన విద్య ఎంతో ఉపయోగిస్తుంది. వీరిరువురి మధ్య వుండే సంబంధాలు ఎంతటి మహత్తరమైనవంటే ప్రజలు గురువును దైవంగా ఆరాధిస్తారు.

## విదేశీ ప్రభావం

పాతనీరు పోయి దాని స్థానంలో కొత్తనీరు వచ్చినట్లే పాత పద్ధతులు పోయి కొత్త మార్పులు వస్తుంటాయి. 150 సంవత్సరాల విదేశీ పాలనవల్ల భారత దేశపు సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవిత రంగాలపై పశ్చిమ రాజ్యాల విద్యా ప్రభావం పడింది. ఆ ప్రభావం మనదేశంలో పటిష్టంగా వ్రేళ్ళు పాకిపోయినందున మనకు స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ కూడా విద్యా విషయకంగా ఆ విదేశీ ప్రభావాన్ని తప్పించుకోలేక పోతున్నాం. ఆంగ్లేయుల అంతటి ప్రభావానికి కారణం—వారు తమ మిషనరీల ద్వారాను, ఇంకా అనేక మంది ఉపాధ్యాయుల ద్వారాను ఆ విద్యా విధానానికి పటిష్ఠమైన శంఖుస్థాపన చేయడమే! ఇందుకే అంకితమైన క్రైస్తవ మిషనరీలు ఈ విషయంలో ఎంతో కృషి చేశాయి.

ఆంగ్లేయులు విద్యా విధానాన్ని క్రమ బద్ధంగా రూపొందించడమే గాక ప్రజల ప్రవర్తనను విశిష్టంగా తీర్చి దిద్దారు. నేడు దేశంలోని అగ్ర నాయకులు కొందరు ఎప్పుడన్నా తమ గతంలోకి దృష్టిని సారిస్తే ఉపాధ్యాయులు వారిని తీర్చి దిద్దడానికి, వారిని కార్యోన్ముఖులుగా ఆ మార్గంవైపు మళ్ళించడానికి వహించిన పాత్ర వారి మనసుల్లో మెదులుతుందనడం అందరికీ తెలిసిన విషయం. ఆనాటి ఉపాధ్యాయుల సదాచారానికి ఇదొక నివాళి!

## జాతీయ విద్య

ఇది విజ్ఞాన శాస్త్రయుగం. మానవుని నిత్య కార్యకలాపాలకు సంబంధించిన ప్రతిశాఖ విజయవంతంగా తన విధులను నిర్వర్తించడానికి అవసరమైన ఐక్యతను, సహకారాన్ని, సాంఘిక సంబంధాలలోకి విజ్ఞాన శాస్త్రయుగం మానవుడిని తీసుకువచ్చింది. లేకుంటే ఆధునిక జీవన విధానం అతిక్లిష్టమై సాఫీగా నడవదు. ఇది జాతీయ విద్యాభివృద్ధికి అత్యవసరంగా సరిపోతుంది. భవిష్యత్తులో దీని అభివృద్ధి ఉపాధ్యాయుల స్వయం సృజనాత్మక శక్తి, వారి శక్తి సామర్థ్యాలమీద, పరిజ్ఞానంమీద ఆధారపడి వుంటుంది. సజీవమైన జాతీయ విద్యావిధానం యొక్క విశిష్టత ఏమంటే అది జాతీయ జీవనానికి అవసరమైన శక్తులవైపు మార్గాన్ని చూపించి, జాతీయ అవసరాలకు, ఆశయాలకు బాధ్యత వహిస్తుంది. ఈ విధానం ప్రకారం కృషి చేయడానికి స్వాతంత్ర్యం లభించిన తర్వాత విద్యావిధానంలో ఎంతో విప్లవం వచ్చింది.

## మారుతున్న పవనాలు

ప్రచండమైన మార్పుదలకల పవనాలు అంతటా వీస్తున్నాయి. మానవ జీవితానికి సంబంధించిన ఏ రంగమైనా కూడా

దీనికి గురికాకుండా వుండడంలేదు. అలాగే విద్యారంగంలో అంతు లేని మార్పులువస్తున్నాయి. భాషా రాష్ట్రాల ఏర్పాటు, విశ్వవిద్యాలయ స్థాయిలో బోధనా భాష, ఇవన్నీగాక హిందీని జాతీయ భాషగా చేయాలనడం వల్ల—సక్రమమైన ఆలోచన, కార్య నిర్వాహణ తగ్గినందున—దేశంలో ఒక రకమైన వాతావరణం ఏర్పడింది. ఇక్కడకూడా దేశం అంతాఉపాధ్యాయుని వంక, ఆయన చూపించే సక్రమమైనమార్గంవైపు, ఆయన నిస్వార్థమైన మహత్తరాశయాల వంక ఆశగా దృష్టి మరల్చుతుంది.

ప్రతి దేశంలోని సామాన్య స్త్రీ, పురుషుల జీవితగమనాన్ని, వారి ఆలోచనను, ప్రవర్తనను తీర్చిదిద్దడానికి కొన్ని విశిష్టమయిన విలువలున్నవి. ఈ విలువలు వ్యక్తిగత లేక జాతీయ శ్రేయస్సును స్వార్థంలోకి దించితే అప్పుడు తిరిగి అంతు లేని వివాదాలు, కలహాలు తలఎత్తుతవి. ఆ విధంగా స్వార్థం కోసం యత్నించేవారిని ఉపాధ్యాయుడు ఎప్పుడూ వెన్నాడుతూ దేనివల్లనైతే మానవజాతి స్వీయాభిప్రాయాన్ని, ఆనందాన్ని పొందుతుందో అటువంటి శాంతి యుతమయిన సంస్కృతీ విషయాల ప్రాముఖ్యతను గురించి నాటి చెప్పాలి. అలా వెంటాడే ప్రయత్నాల్లో నిజమయిన జ్ఞానాన్ని వ్యాపింప చేయడం, సక్రమమయిన విద్య అనేవి విశిష్ట స్థానాన్ని ఆక్రమిస్తాయి. ఇందుకు ముఖ్య కారణం—చుట్టుముట్టినశక్తులనర్థం చేసికొని, వాటిని స్వాధీనంలో వుంచుకోడానికి అవసరమయిన శక్తి. ఆశక్తియే జ్ఞానం. ఇందువల్లనే ఉపాధ్యాయుడు ఆత్మను, దైవాన్ని కాంచగలుగుతాడు. విద్యాభ్యాసనకు ఉపాధ్యాయుడిని ఒక సాధనంగా, సంస్కృతీ ఒరవడిని పరిరక్షించి, భవిష్యత్‌ను ఆనంద దాయకంగా పెంపొందించుకోడానికి గత ప్రాభవాన్ని వినియోగించుకోడానికి మానవ జాతి రూపొందించుకుంది.

## క్రమంగా క్షీణింపు

సంఘంలో ఉపాధ్యాయుని స్థితి క్రమక్రమంగా క్షీణించడానికి గల కారణాలను వివరించడం అంత కష్టం కాదు. పూర్వకాలంలో విద్య ప్రజల విశ్వాసాన్ని, భక్తిని చూరగొన్నది. ఇందుకు కారణం ఆనాటి విద్య మతంతోను, జాతీయ సంస్కృతితోను ముడివడి వుండడం. అంతేగాక ఆ విద్యావేత్తలు మహా ప్రాముఖ్యం గల ఆధ్యాత్మిక కార్యకలాపాలలో నిమగ్నులై వుండేవారు. ఆంగ్ల విద్య ప్రవేశించడంతో ఈ సంబంధం సడలిపోయి విచ్ఛిన్నమయి కేవలం ప్రభుత్వోద్యోగం సంపాదించడానికి విద్య ఒక సాధనం అనే అభిప్రాయం వ్యాపించింది. దీనికి తోడు ఉపాధ్యాయులు కూడా "ఎక్కువ లాభం, తక్కువ పని" అనే వర్తక సిద్ధాంతానికి లోనవడం వల్ల మహత్తరమయిన ఆ సృజనాత్మక కార్యకలాపం కేవలం సామాన్య వ్యాపార స్థాయికి దిగజారింది. ఇవేగాక ఇంకా ఎన్నో కారణాలు విద్యకు, ఉపాధ్యాయుడికి ఉన్న స్థాయిని, ప్రతిష్ఠను తగ్గించాయి.

అయితే దీనికి ఒకటే మార్గం వుంది. సంఘాన్ని పునరుద్ధరించడానికి, అందులో చైతన్యం తీసుకురావడానికి, తామే మూల కారకులమని వారు భావించాలి. విద్యాబోధన ఒక మహత్తరమయిన వృత్తి అనే విషయాన్ని మనం విస్మరించరాదు. మానవ జాతి చరిత్రలో నిలిచిపోయిన—బుద్ధుడు, కన్ఫూషియస్, సోక్రటీస్, ఏసుక్రీస్తు, మహమ్మద్, గాంధీజీలు—నిజంగా చెప్పాలంటే మానవ జాతి మహోపాధ్యాయులు. వారు తమ ప్రజల జీవిత విధానపు విలువలను ధైర్యంతో సమైక్యంతో రూపొందించి ఆనందప్రదమయిన ఉన్నతజీవిత దృక్పథాన్ని వారిలో ప్రచారంచేశారు. మానవ జీవిత విధానాన్ని మరింత సక్రమంగా రూపొందించి, సత్ సాంఘిక వ్యవస్థను నెలకొల్పాలనే మహత్తరాశయంతో కృషి చేస్తే మన ఉపాధ్యాయులు కూడా భవిష్యత్ భవన శిల్పులు కావచ్చు.



# అభివృద్ధి పథకాలు

(లోకనాథన్ నివేదిక)

1961–71 వరకూ పది సంవత్సరాలలో రూ. 1,733 కోట్ల ఖర్చుతో ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి పథకాలను, న్యూఢిల్లీలోని అప్లయిడ్ ఎకానమిక్స్ రీసర్చి జాతీయ కౌన్సిల్ డైరెక్టరు జనరల్ డాక్టర్ పి. యస్. లోకనాథన్, రాష్ట్ర టెక్నో ఎకనామిక్ రిపోర్టులో సిఫారసు చేశారు. యిందులో రూ. 1,035 కోట్లను రాష్ట్ర ప్రభుత్వం పెట్టుబడి పెట్టాలి. అయితే రూ. 384 కోట్ల మేరకు రాష్ట్ర ప్రభుత్వం లభింపజేయ కల్గుతుంది. అదనపు పన్నుల ప్రయత్నం, కేంద్ర ప్రభుత్వ సహాయం ఆశించాలి.

పది సంవత్సరాల కార్యక్రమం పెట్టుబడి దిగువ విధంగా ఉంది:

(1) వ్యవసాయం, పశు, మత్స్యపోషణ, అడవులు: రూ. 628.2 కోట్లు. (2) గనులు. రూ. 35.8 కోట్లు (3) పరిశ్రమలు: రూ. 289 కోట్లు (4) విద్యుచ్ఛక్తి రూ. 200.00 కోట్లు (5) రవాణా: రూ. 329.5 కోట్లు. (6) గృహవసతి, ప్రజారోగ్యం, విద్య: రూ. 250.5 కోట్లు: మొత్తం 1,733 కోట్లు. ఒక్క వ్యవసాయరంగంలోనే రూ. 600–00 కోట్లు పెట్టుబడి పెట్టడం ద్వారా 60 శాతం అదనపు ఉత్పత్తిని ఆశించవచ్చని సూచించడం జరిగింది. భారీ పరిశ్రమలలో రూ. 215 కోట్ల పెట్టుబడిద్వారా 220 శాతం ఉత్పత్తినీ, చిన్నతరహా పరిశ్రమలలో రూ. 74 కోట్ల పెట్టుబడిద్వారా 58 శాతం ఉత్పత్తినీ, రవాణా, యితర సర్వీసులలో రూ. 580 కోట్ల పెట్టుబడి ద్వారా 70 శాతం అభివృద్ధిని సాధించవచ్చు.

రాష్ట్ర తలసరి సగటు ఆదాయాన్ని కనీసం అఖిలభారత స్థాయికి తీసుకరావడమే, పది సంవత్సరాలకు నిర్దేశించబడిన దూరదృష్టిగల యీ ప్రణాళికల ముఖ్య ఉద్దేశ్యమై ఉండాలి. యీ ప్రణాళికలను 1971 వరకు అమలు పరిస్తే 1956లో 768 కోట్లు ఉన్న రాష్ట్ర ఆదాయం 1596 కోట్లకు పెరుగుతుందని ఆశిస్తున్నారు. సంవత్సరానికి 5.5 శాతం చొప్పున యీ పెరుగుదల ఉంటుంది. 1971 వరకు తలసరి ఆదాయం రూ. 380.00 వరకు పెరుగుతుంది. యిదే కాలంలో అఖిలభారత అంచనా రూ. 396.00. యీ విధంగా సూచించిన కార్యక్రమాన్ని అమలు పరిస్తే 1956–71 సంవత్సరాల కాలంలో రాష్ట్ర ఆదాయం రెండింతలు కాగలదు. తత్ఫలితంగా రాష్ట్ర తలసరి సగటు ఆదాయం, దేశం మొత్తం సగటు ఆదాయాల మధ్యగల వ్యత్యాసం తగ్గుతుంది.

అభివృద్ధికై చేసిన ముఖ్యమైన సిఫారసులు యివి:

## వ్యవసాయం

1961–71 సంవత్సరాల కాలంలో రాష్ట్ర ఆర్థికాభివృద్ధిలో వ్యవసాయ రంగం ముఖ్యపాత్ర వహించవలసి ఉంటుంది. యితోధిక విలువగల పారిశ్రామిక, వ్యాపార పంటలసేద్యానికి ప్రాధాన్యమిస్తూ భవిష్యత్తులో వ్యవసాయరంగంలో ముఖ్యమైన మార్పులను ప్రవేశ పెట్టాలి. భూమి, నీరు, పెట్టుబడి, కార్మికశక్తి మొదలగు వ్యవసాయ వనరులను గరిష్ఠ పరిమితిలో వినియోగించాలి. దీనికొరకు క్రొత్త ప్రాజెక్టుల క్రింద ఉన్న ఆయకట్టులలో, నీటి పారుదల అవసరమయ్యే మెట్ట పంటలను గరిష్ఠ పరిమితిలో ఉత్పత్తి చేయాలి. ఖరీఫ్, రాబి మెట్ట పంటలకు నీటి సరఫరా చేయాలి. యిదివరకే నీటిపారుదల సౌకర్యం ఉన్న డెల్టా భూముల్లోనూ, చెరువుల క్రింద సాగవుతున్న ప్రాంతాల్లోనూ వరితోపాటు వంతుల వారిగా చెరుకు ఉత్పత్తిని ప్రవేశ పెట్టాలి.

పంటల మార్పిడికి సౌకర్యాన్ని కలిగించే విధంగా నీటి పారుదల విధానాలను సవరించాలి. మెట్ట ప్రాంతాల్లో యెక్కువ భూగర్భ జలసౌకర్యాలు ఉన్నా విద్యుచ్ఛక్తి సహాయంతో లిఫ్ట్ ఇరిగేషన్ పద్ధతిని ప్రోత్సహిం

చాలి. అధిక రాబడి దృష్ట్యా భూమి అభివృద్ధి, మేలురకం విత్తనాల వాడకం, క్రిమిసంహారక చర్యలను, మొదలగు వాటిని కూడా ప్రోత్సహించాలి. క్రొత్త ప్రాజెక్టు ప్రాంతాల్లో నీటిపారుదల అవసరమయ్యే మెట్టపంటల సేద్యానికి తగు విధానాలను కనుగొని వాటిని గురించి వ్యవసాయదారులలో ప్రచారం చేయాలి. భూగర్భ మురుగు నీటి పారుదల విధానాలను అభివృద్ధి పరచాలి.

మెట్టభూములలో సగటు ఉత్పత్తి స్థాయి పెరగడానికి వీలుగా భూసార సంరక్షణ, చర్యలను, యెరువులు వేసే పనులను సమిష్టిగా నిర్వహించాలి. జపానువరిసాగు విధానాలను ప్రవేశపెట్టినవిధంగానే అన్ని ముఖ్యపంటలకుకూడా తీవ్రతర సేద్యపు విధానాలను రూపొందించి, ప్రోత్సహించాలి. అట్టి కార్యక్రమాలను అమలు పర్చడంలో అభివృద్ధిచెందే ప్రాంతాల్లో పెట్టుబడి, కార్మికశక్తి కొరతలను యెదుర్కొనాల్సివస్తుంది. అభివృద్ధిచెందిన ప్రాంతాలు, అధిక జనాభాగల ప్రాంతాలలోని వ్యవసాయకుటుంబాలు క్రొత్త ప్రాజెక్టు ప్రాంతాలకు వలసపోవడాన్ని భారీయెత్తున ప్రోత్సహించాలి. యీ విధానాన్ని అమలుపరచడానికి వీలుగా రాష్ట్రవలస సంస్థను యేర్పాటు చేయాలి. భూసారం తగ్గుదలను అరికట్టడానికై భారీయెత్తున యెరువులను సరఫరా చేయడం, పచ్చి యెరువు పంటల పెంపకాన్ని అభివృద్ధి చేయడం యెంతో అవసరం. 1961–71 సంవత్సరాల కాలంలో వ్యవసాయాభివృద్ధికై తలపెట్టబడిన కార్యక్రమాల అమలుకు దాదాపు రూ. 600 కోట్లు అవసరం. యీ పెట్టుబడిలో చాలాభాగం నీటిపారుదల అభివృద్ధికే ఖర్చుచేయడం జరుగుతుంది. వ్యవసాయ దారులకు కావలసిన పెట్టుబడి, చలామణి ధనాన్ని చాలా వరకు సహకార సంఘాలు సరఫరా చేయాలి. ప్రాథమిక సహకార సంఘాలు, వ్యవసాయదారులకు యితోధిక పరపతి సౌకర్యాలను కల్గించే విధంగా ప్రస్తుతం ఉన్న సహకార సంఘాలను పునర్వ్యవస్థీకరించి, పటిష్ఠం చేయాలి. పరపతి విధానాలను మాధ్యమిక, దీర్ఘకాలిక రుణాలకు వర్తింపజేయాలి. పరపతి, మార్కెటింగు సంస్థలకు సంబంధం ఉండాలి.

రాష్ట్రంలోని ముఖ్యమైన పంటలకు కనిష్ఠ ధరలను నిర్ణయించి, పంటల భీమా పథకాలను రాష్ట్రంలో ప్రవేశ పెట్టాలి.

## పశుపోషణ

రాష్ట్రంలోని పశుసంపదను అభివృద్ధిచేసి, పటిష్టంచేయాలి. ఉత్తమ పోషణ, శాస్త్రీయ పద్ధతిలో పెంపకం, తగిన పశువైద్య సౌకర్యాల ద్వారా పశువుల ఉత్పత్తి శక్తిని పెంపొందించాలి. జనుము, పిల్లిపెసర, మొదలగు పశుగ్రాసపంటలను ప్రోత్సహించి పశుగ్రాసాన్ని అధికం చేసేందుకు తక్షణం చర్యలు తీసుకోవాలి. బార్సీం, లూసిరిన్ వంటి క్రొత్తపంటలను పండించాలి.

వరిగడ్డిపై కాస్టిక్‌సోడానుగానీ, సాధారణ ఉప్పునీరునుగానీ, వేయడాన్ని ప్రోత్సహించాలి.

పశుపోషణకై రాష్ట్రం మొత్తానికి ఒకే విధానాన్ని రూపొందించాలి. పశువైద్యంలో రెండు సంవత్సరాలకోర్సుని ప్రవేశపెట్టి పశు వైద్య సిబ్బందిని యెక్కువ చేయాలి. ప్రస్తుతం తక్కువగా ఉన్న సగటు తలసరి పాల వాడకాన్ని యెక్కువ చేయాలి. పాల క్షేత్రాల కార్యక్రమాలను విస్తృతపరచి రాష్ట్రంలోని పాల ఉత్పత్తి శక్తిని పెంచాలి. 500 మణుగుల పాలను ఉత్పత్తిచేసే తొమ్మిది పాల క్షేత్రాలను, 300 మణుగుల పాలను ఉత్పత్తిచేసే 5 పాల క్షేత్రాలను ప్రధాన నగరాలలో నెలకొల్పాలని సూచించారు. స్థానిక గొర్రెలను అభివృద్ధి పరచాలి. మేకలను పెంచడాన్ని ప్రోత్సహించరాదు. కోస్తా ఆంధ్రలో నవీన పద్ధతిన పందుల పరిశ్రమను అభివృద్ధి చేయాలి. గ్రామీణ ప్రాంతాల్లో కోళ్ల పెంపకాన్ని ఉపవృత్తిగా అభివృద్ధిచేయాలి.

## మత్స్య పరిశ్రమ

1961–71 సంవత్సరాలలో రాష్ట్రంలో మత్స్య పరిశ్రమకు గల అన్ని వనరులను వినియోగించుకొని యీ పరిశ్రమను అభివృద్ధి చేయాలి. సముద్రతీరంలో మత్స్య పరిశ్రమాభివృద్ధికి యంత్రాలను ఉపయోగించాలి. యింతేగాక యీ యంత్రాల మరమ్మతులు వగైరాలకు కూడా యేర్పాట్లు చేయాలి. చిన్న రేవులలో మత్స్య పరిశ్రమలను యేర్పాటు చేయాలి. 1971వ సంవత్సరం నాటికి 8 నుంచి 10 వరకు మత్స్య పరిశ్రమ సమీకృత కేంద్రాలను నెలకొల్పి, వాటికి 1000 చిన్న యాంత్రిక నావలను సరఫరా చేయాలి. కృష్ణా, గోదావరి నదుల ముఖద్వారాలలో, చెరువులలో నవీన పద్ధతులలో చేపల ఉత్పత్తిని అధికం చేయాలి. నైలాన్ వలలను విస్తృతంగా వాడాలి. ఉప్పు చేపల పరిశ్రమను కూడా అభివృద్ధి పరచాలి. ఉప్పు చేపల స్థాయిని ప్రమాణీకరించడానికి మోడల్ క్షేత్రాలను నెలకొల్పాలి. నదీ జలాలలో చేపలు పట్టడాన్ని క్రమబద్ధం చేయాలి, పెద్దతరహా చేపలను రిజర్వాయర్లలో పెంచాలి. 1961–71 సంవత్సరాలలో కనీసం

50,000 యెకరాలు గల రిజర్వాయర్లలో యీ చేపలను పెంపకాన్ని చేపట్టాలి. వీటిని పరిరక్షించడానికి చిన్న యూనిట్లను యేర్పాటు చేయాలి. మత్స్య పరిశ్రమాభివృద్ధిలో సాంకేతికంగా యెంతో కృషి చేయాల్సిఉంది. 1971 వరకు కనీసం 50,000 యెకరాలలో మత్స్య పరిశ్రమను విస్తృత పర్చడానికి మత్స్య శాఖ కృషిచేయాలి. మత్స్య బీజోత్పత్తికి ప్రాధాన్యం యివ్వాలి. కనీసం పది బీజ క్షేత్రాలనైనా నెలకొల్పాలి. యీ అభివృద్ధి కార్యక్రమాలను అమలు పరిస్తే 1961–71 వరకు రాష్ట్రంలో చేపల ఉత్పత్తి 100,000 టన్నుల వరకు పెరుగుతుంది. వీటికై శీతల గిడ్డంగుల సౌకర్యాలను విస్తృత పర్చాల్సి ఉంటుంది. వచ్చే పదేండ్లలో అదనంగా 17 ఐస్ ఫ్యాక్టరీలను నెలకొల్పాల్సి ఉంటుంది. మత్స్య పరిశ్రమ గల గ్రామాలకు రవాణా సౌకర్యాలను యెక్కువ చేయాలి. చేపల రవాణాకై అదనంగా 60 మోటారులు అవసరమవుతాయి. ప్రధాన రైల్వే మార్గాలలో రెఫ్రిజిరేటరు వ్యాగనులను సరఫరా చేయాలి. చేపల మార్కెటింగును ప్రోత్సహించటానికి రాష్ట్ర స్థాయిలో చేపల మార్కెటింగ్ కమిటీని యేర్పాటు చేయాలి. జాలర్ల సహకార సంఘాలను యేర్పాటు చేయాలి. జాలర్లలో సహకార ఉద్యమాన్ని విస్తృతం చేయాలి. యీ కార్యక్రమాలను అమలు పరచడానికి సాంకేతిక సిబ్బందిని యితర సిబ్బందిని పటిష్టం చేయాలి.

## అడవులు

రాష్ట్రంలో అడవుల అభివృద్ధి చాలా మందకొడిగా ఉంది. టేకు, రోజ్‌ఉడ్, జీడిమామిడి, నీలగిరి తైలం (యూకలిప్టస్) చింత, కుంకుడు, సరుగు, వెదురు తదితర వృక్షాలను పెద్ద యెత్తున పెంచడానికి సంబంధించిన సూచనలు రిపోర్టులో చాలాఉన్నాయి. కృత్రిమ పద్ధతిలో టేకుచెట్లను పెంచే అడవులలో సాధ్యమైనంత త్వరలో మార్పులు తీసుకొనిరావాలి. ప్రస్తుతం ఉన్నవాటి స్థానంలో నవీన పద్ధతిలో టేకుచెట్లను పెంచాలి. కృత్రిమ విధానాలలో టేకు చెట్లను నాటేందుకు అనువైన అడవులను జాగ్రత్తగా యెన్నుకోవాలి. టేకు చెట్లను పెంచే చాలా ప్రాంతాల్లో రోజ్‌వుడ్‌ను కూడా వేయవచ్చు. ప్రతి టేకు క్షేత్రం చుట్టూ 6 వరసలలో రోజ్‌వుడ్ చెట్లను వేయాలి. టేకుచెట్లకు పనికిరాని యితర ప్రాంతాల్లో లారెల్‌వుడ్ వంటి యితర కలప వృక్షాలను పెంచాలి. అడవులను పెంచని ప్రాంతాలలో, త్వరగా పెరిగే చెట్లను నాటడానికి యితోధిక శ్రద్ధ వహించాలి. హార్డ్‌ఉడ్ కలపను విస్తృతంగా పెంచి కలప పరిశ్రమను అభివృద్ధి చేయాలి. పూర్వపు జాగీర్దారీ, యెస్టేట్ ప్రాంతాల్లో జీడిమామిడి, యూకలిప్టస్, పశు గ్రాసం మొదలైన వాటి పెంపకానికి సంబంధించిన బోగట్టాను సేకరించి అనువైన భూములలో వాటి పెంపకానికి తగిన పథకాలను తయారు చేయాలి. కుంకుడు, చింత వంటి వాటిని చిన్న తరహా అడవులలో పెంచాలి. ప్రత్యేకంగా ఆంధ్ర ప్రదేశ్ కోస్తా ప్రాంతాల్లో యూకలిప్టస్, జీడిమామిడి, సరుగు వంటి వాటిని ప్రణాళికాబద్ధంగాపెంచడానికి పథకాలను రూపొందించాలి. ప్రతి డివిజన్‌లోను ప్రతి సంవత్సరం 100 యెకరాలలో చింతను పెంచేందుకు అవకాశాలు ఉన్నాయి. ప్రతి డివిజన్‌లో ప్రతి సంవత్సరం 200 యెకరాలలో కుంకుడు చెట్లను పెంచేటందుకు కూడా అవకాశాలు ఉన్నాయి. జీడిమామిడి పెంపకాన్ని అభివృద్ధి చేయాలి. తూర్పు డివిజన్‌లోని ఉత్తర, దక్షిణ కడప, చిత్తూరు ప్రాంతాల్లో రక్తచందనం చెట్లను విస్తృతంగా పెంచాలి. రాష్ట్రంలోని అడవులలో ఓషధులు లభించే అవకాశాలను సర్వేచేసి మూలికల వాణిజ్యాన్ని అభివృద్ధి చేయాలి. విశాఖపట్నం, తూర్పు గోదావరి జిల్లాలలో కాఫీతోటలను పెంచి పెంపొందించాలి. ప్రస్తుతపు పోడు(PODU) ప్రాంతాల్లో పైనాపిల్ మొక్కలనుపెంచాలి. ఏజన్సీ ప్రాంతాలలో ప్రయోగాత్మకంగా మిరియాల మొక్కలను నాటడాన్ని చేపట్టాలి. వివిధ జిల్లాలలో ఉన్న ప్రభుత్వ భూఖండాలను గురించి ఆరాతీయడానికి, ప్రతి జిల్లాలోను విస్తృత ప్రాతిపదికపై సర్వే జరిపి అలాంటి భూములలో చెట్లను నాటాలి. నాగార్జున, తుంగభద్ర, కడం ప్రాజెక్టుల ప్రాంతాలలో నీటి పారుదలతో కలపను సేద్యం చేయడాన్ని అభివృద్ధి పరచాలి.

## ఖనిజాలు

రాష్ట్రంలో లభించే ఖనిజాలు చాలావరకు పరిశ్రమల అభివృద్ధికి తగినవి గానీ, సరిపోయేవి గానీ కానందున వీటిని అభివృద్ధిపరచి ఎగుమతి చేయాలి. మూడవ ప్రణాళిక ఆఖరు వరకు ఆస్బెస్టాస్‌ను సంవత్సరానికి 2500 టన్నుల వరకు ఉత్పత్తి చేయాలి. యిందులో 6000 మందికి ఉపాధి లభించగలదని ఆశించబడుతున్నది. ప్రస్తుతం ముగ్గురాయి త్రవ్వకం క్రమబద్ధంగా జరగడంలేదు. సాధ్యమైనచోట్ల భూగర్భ గనుల త్రవ్వకాలను చేపట్టాలి.

రాష్ట్రంలో విరివిగా లభించే బంకమన్నును ప్రభుత్వం పూర్తిగా వినియోగించాలి. మట్టిపాత్రలు, యిటుక, పెంకు, మురుగునీటిపారుదలకై పైపులు వగైరాల తయారీకి యీ మట్టి

చాలా ఉపయోగమైంది. బంకమన్నును పరిశుద్ధిచేసే మూడు ఫ్యాక్టరీలను నెలకొల్పాలి. శానిటరీ పరికరాల తయారీకి బంకమన్ను యెంతో అనువైనది. అధికావసరాలను ఆదుకోవడానికి వీలుగా రాష్ట్రంలోని బొగ్గు గనులను విస్తృత పరచాలి. బొగ్గును సెమీకోక్‌గా మార్చాలి. అల్ప శీతోష్ణ కార్బొనైజేషన్ పద్ధతిలో తారు పదార్థాలను తయారు చేయాలి. గ్రాఫైటును కనీసం 80 నుండి 90 శాతం కార్బన్‌గా శుద్ధిచేయడానికి రాష్ట్రంలో చిన్న ఫ్యాక్టరీని నెలకొల్పాలి. రాష్ట్రంలో విస్తారంగా లభించే సున్నపురాయిని వినియోగించడానికి, రెండు సిమెంటు ఫ్యాక్టరీలను నెలకొల్పాలని సిఫారసుచేశారు. రాష్ట్రంలో లభించే మాంగనీసు తక్కువ నాణ్యం గలది. విదేశీ మచ్చుకు సరితూగేందుకు వీలుగా, మాంగనీసు నుండి భాస్వరము (ఫాస్ఫొరస్) ను తీసే పద్ధతులను అభివృద్ధిపరిచేందుకు రాష్ట్ర ప్రభుత్వం సాధ్యమైన సహాయాన్ని చేయాలి. అభ్రకం ఎగుమతిని ప్రోత్సహించాలి. అవసరమైతే విదేశీయుల సహకారంతో గూడూరులో ఉన్న కర్మాగారాన్ని తిరిగి ప్రారంభించాలి.

## పరిశ్రమలు

లభ్యమయ్యే ముడి సరుకులు, ఇంకా ఇతర సౌకర్యాలను బట్టి 1961–71 లో రాష్ట్రంలో భారీ పరిశ్రమల అభివృద్ధికి 215 కోట్ల రూపాయల కార్యక్రమాన్ని సూచించారు. సిఫార్సు చేసిన పరిశ్రమల పూర్తి జాబితా, వాటికి కావలసిన అవసరాలు 32 వ పట్టికలో తెలుపబడినవి.

వ్యవసాయం మీద ఆధారపడిన పరిశ్రమల క్రింద చేసిన ప్రాధానమైన సిఫార్సులు:– రోజుకు మొత్తం 20వేల టన్నుల చెరుకును పిండేశక్తిగల కొత్త చక్కెర ఫ్యాక్టరీలు, వార్షికంగా 63 మిలియను పౌనుల నూలు ఉత్పత్తిచేసే నూలు యంత్రాలు, రోజుకు 50 టన్నుల గానుగ పిండిని తయారుచేసే 30 గానుగపిండి యంత్రాలు, సంవత్సరానికి 50 వేల పొన్న పళ్ల డబ్బాలను ఉత్పత్తి చేసే కొత్త యంత్రాగారాలు.

చేపలమీద ఆధారపడిన పరిశ్రమల ప్రాధానమైన సిఫార్సులు:– సంవత్సరానికి 25 నుంచి 30 వేల టన్నులవరకు చేపలను శుద్ధి చేసే అదనపుశక్తి, వార్షికంగా వెయ్యినుంచి రెండువేల టన్నుల వరకు రొయ్యలను ఘనీభవింపచేసే కొత్త యూనిట్లు, ఏటా నాలుగువందలనుంచి ఆరొందల టన్నుల వరకు డబ్బాలలో నిల్వ చేసే రెండు యూనిట్లు, ప్రతియేటా 80 వేల నుంచి లక్ష పౌనుల వరకు క్రూడాయిల్‌ను ఉత్పత్తిచేసే ఒక షార్క్‌లీవర్ ఆయిల్ కర్మాగారం, ప్రతి యేటా పదినుంచి 12వేల టన్నుల వరకు చేపల ఆహారాన్ని ఉత్పత్తిచేసే రెండు ఉత్పత్తి కర్మాగారాలు.

అడవులమీద ఆధారపడిన పరిశ్రమల విషయంలో చేసిన సిఫార్సులు:– రోజుకు 450 టన్నుల చొప్పున ఉత్పత్తిచేసే కాగితం గుజ్జు, కాగితం మిల్లులు ఆరు, ప్రతి రోజూ 80 టన్నుల నుత్పత్తి చేసే చిన్న అట్టల ఉత్పత్తి కర్మాగారాలు 5, ప్రతిరోజూ రెండొందల టన్నుల చొప్పున కలపపని, రంపపుమిల్లుల కంపోజిట్ యూనిట్లు 6.

గనులమీద ఆధారపడిన పరిశ్రమల విషయంలో చేసిన సిఫార్సులు:– వార్షికంగా 12 వందల టన్నుల బేరియంకెమికల్స్‌ను ఉత్పత్తిచేసే కొత్త యూనిట్లు, ఏటా మూడువేల టన్నులచొప్పున ఉత్పత్తిచేసే రాతి సామగ్రి సంబంధమైన ఆరు ఫ్యాక్టరీలు, ఏటా మూడువేల టన్నుల చొప్పున ఉత్పత్తిచేసే మట్టిని కాల్చే ఒక కర్మాగారం, రోజూ పదివేల ఇటుకలనుత్పత్తిచేసే ఒక ఆధునిక ఇటుకల ఫ్యాక్టరీ, రోజుకు 16 వందల టన్నుల బొగ్గు తయారు చేసే ఒక అల్ప ఉష్ణోగ్రత కార్బొనైజేషన్ కార్మాగారం, రోజుకు రెండు లక్షల టన్నుల సిమెంటునుత్పత్తి చేసే రెండు సిమెంటు కర్మాగారాలు, రోజుకు వెయ్యి పౌనులచొప్పున ఉత్పత్తి చేసే ఒక డిస్టెంపర్ ఫ్యాక్టరీ, ప్రతియేటా 16,500 టన్నుల చొప్పున ఉత్పత్తి చేసే ఒక షీట్‌గ్లాస్ ఫ్యాక్టరీ, తాజ్‌గ్లాస్ కర్మాగారం పునరుద్ధరణ.

ఇంజనీరింగ్ పరిశ్రమ విషయంలో చేసిన సిఫార్సులు:– సంవత్సరానికి 20వేల టన్నుల చొప్పున ప్రత్యేకమైన గట్టి ఉక్కును తయారుచేసే ఒక యూనిట్టు, లక్షటన్నుల శక్తిగల ఒక దుక్క ఇనుము కర్మాగారం, నిర్మాణాలకు పనికి వచ్చే సామగ్రిని సంవత్సరానికి 5 వేల టన్నుల చొప్పున తయారుచేసే ఒక ఉక్కు కర్మాగారం. మూడువేలటన్నుల శక్తిగల తీగెలతో తాళ్ళు అల్లే కర్మాగారం ఒకటి, సంవత్సరానికి 85 మిలియను అడుగుల ఉత్పాదకశక్తిగల వెల్డింగ్ ఎలక్ట్రోడ్‌ల కర్మాగారం ఒకటి, వార్షికంగా ఆరువేల టిల్లర్ల ఉత్పాదన శక్తిగల విద్యుత్ టిల్లర్ కర్మాగారం ఒకటి, సంవత్సరానికి 12 వందల యూనిట్ల బాయిలర్లు ఇటుకఆములు మొదలైన వాటిని తయారుచేసే యంత్రాగారం ఒకటి, 6,500 శక్తిగల ఒక కిరోసిన్, పెట్రోల్

కర్మాగారం, ఏటా ఆరు మిలియన్ల గజాల విఐఆర్ వైర్లను, 12 మిలియన్ల గజాల సిటియస్ కేబిల్సును తయారుచేసే యంత్రాగారం ఒకటి, సంవత్సరానికి 20 వేల అశ్వశక్తిగల విద్యుత్ మోటార్లు తయారు చేసే కర్మాగారం, ఏటా వెయ్యి పంపకం ట్రాన్స్‌ఫార్మలను తయారు చేసే కర్మాగారం ఒకటి, జనపనార మిల్లు యంత్రాగారం, బొగ్గుగనుల సాధనాలనుత్పత్తి చేసే యంత్రాగారం. విద్యుత్‌తో నడిచేపంపులను ఏటా ఐదువేల చొప్పున తయారుచేసే ఒక కర్మాగారం, రైస్ మిల్లులు, ఫ్లోర్ మిల్లులు, ఆయిల్ మిల్లుల యంత్రాలను, యంత్ర పరికరాలను, సైకిల్ భాగాలను తయారుచేసే యూనిట్లను విస్తరింపచేయడం భారీ విద్యుత్పరికరాలు, మెరైన్ డీసెల్ ఇంజన్లు ఇతర భారీ పరిశ్రమలు.

ప్రాథమిక రసాయనికాలు, వాటి ఉత్పత్తుల మీద ఆధారపడిన పరిశ్రమలకు సంబంధించిన సిఫార్సులు:- నాలుగు రసాయనిక ఎరువుల కర్మాగారాలు-ఇందులో రెండు సంవత్సరానికి 70 నుంచి 80 వేల టన్నుల నైట్రోజన్‌ను ఉత్పత్తి చేస్తాయి. మూడవ దానిలో 50 వేల టన్నుల సూపర్ ఫాస్ఫేట్ ఉత్పత్తి చేస్తారు. నాలుగవ కర్మాగారంలో భాస్వర సంబంధమైన రసాయనిక ఎరవులను సంవత్సరానికి 15 వేల టన్నుల చొప్పున ఉత్పత్తి చేస్తారు. ఏటా 50 వేల టన్నుల ఉత్పాదన శక్తి గల ఒక సల్ఫ్యూరి కామ్లపు కర్మాగారం, 6,600 టన్నుల ఉత్పాదన శక్తిగల బట్టల సోడా యంత్రాగారం, ఇంకా సింథటిక్ ఔషధాల కర్మాగారం, కార్బన్ బ్లాక్, కాల్షియంకార్బైడ్, సైలీషియన్ కార్బైట్, ఆల్కహాలునుంచి రసాయనిక పదార్థాలను ఉత్పత్తిచేసే ఇతర పరిశ్రమలు కూడావున్నాయి.

1961–71 కాలంలో రాష్ట్రంలో లఘు పరిశ్రమల అభివృద్ధికి 74 కోట్ల రూపాయల పెట్టుబడి కార్యక్రమాన్ని సిద్ధం చేశారు.

లఘు పరిశ్రమల భవిష్యదభివృద్ధి ముఖ్యంగా వ్యవసాయోత్పత్తుల పెరుగుదల వినిమయ వస్తువులకై అధికమవుతున్న ప్రాంతీయ డిమాండును బట్టి వుంటుంది. నూనె ఉత్పత్తి విషయంలో 1.1 మిలియను టన్నుల వేరుసెనగ అదనపు ఉత్పత్తిని సాధించడానికి, ప్రత్తి విషయంలో ప్రత్తి పరమాణాన్ని రెండు లక్షల టన్నుల బేళ్ళ వరకు పెంచడానికి, బియ్యాన్ని మరలకు తరలించే విషయంలో వాటి పరిమితిని ఒక మిలియను టన్నులకు అధికం చేయడం అదనంగా తలపెట్ట బడింది. వ్యవసాయపు ముడి పదార్థాలన్నిటిని రాష్ట్రంలోని ప్రాథమిక యూనిట్లలోనే బాగు చేయించి, తద్వారా ప్రస్తుతం రాష్ట్రంలో వున్న ఆయా యూనిట్ల శక్తినధికం చేయడానికి, రాష్ట్రంలోపలే అధికాదాయాన్ని రాబట్టడానికి ప్రభుత్వం అవసరమైన చర్యలన్నిటినీ తీసుకోవాలి.

## రాష్ట్ర ప్రభుత్వ పాత్ర

రాష్ట్రం పారిశ్రామికాభివృద్ధి విషయంలో రాష్ట్ర ప్రభుత్వం ముఖ్యమైన పాత్ర వహించాలి. రాష్ట్ర ప్రభుత్వం ఆయా విధానాలను నిర్ణయించే విషయంలోనూ, ముందు దేనికి ప్రాముఖ్యత ఇవ్వాలనే విషయంలోనూ ఈ క్రింది విషయాలను దృష్టిలో పెట్టుకోవాలి.

(అ) అనవసరపు జాప్యాన్ని నిరోధించడానికి ఆయా ఏజన్సీలకు సంబంధించిన పారిశ్రామిక విధానాలు, కార్యక్రమాల మధ్య సమన్వయాన్ని పెంపొందించడం, (ఆ) నిర్దిష్టమైన పారిశ్రామిక నిర్ణయాలు తీసుకోడానికి తగిన గణాంకముల కార్యక్రమాన్ని పెంపొందించడం, (ఇ) అన్ని రకాల వాణిజ్య సంస్థలు సక్రమంగా వుండే పారిశ్రామిక వాతావరణాన్ని సృష్టించడానికి తగిన నిర్వహణ విధానాన్ని పెంపొందించడం, (ఈ) పారిశ్రామికాభివృద్ధి సాధనకు తగినటువంటి ఆర్థిక, సాంకేతిక పరిశోధనను విస్తృతం చేసి సమన్వయంచేసే కార్యక్రమాన్ని సిద్ధం చేయడం.

సంస్థలకు సాధ్యంకాని పనులను చేపట్టడానికి రాష్ట్ర ప్రభుత్వం కృషి చేయాలి. అంతేగాక స్వయం సహాయం చేసుకునే సంస్థలకు సహాయం చేయాలి ప్రభుత్వం. అర్హత, శక్తిలేని సంస్థలకు ప్రభుత్వం సహాయం చేయకూడదు. రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చే ఏ సహాయం కూడా శాశ్వత ప్రాదిపదికమీద ఆధారపడి వుండకూడదు. రాష్ట్ర ప్రభుత్వం (అ) రాష్ట్రంలో గల వనరుల పారిశ్రామికావకాశాలకు సంబంధించిన సమాచారాన్ని అవి కావలసిన వారికి లభించేట్టు చూడాలి. (ఆ) వివిధ సాంకేతిక ఉద్యోగులకు ద్రవ్య సహాయం చేసి అవసరమైన సుశిక్షితులైన ఉద్యోగులు కావడానికి అవసరమైన విద్యా సౌకర్యాలను కల్పించాలి, (ఇ) రాష్ట్రంలోను, ఇతర రాష్ట్రాలలోనూ వున్న రాష్ట్ర పరిశ్రమల ఉత్పత్తుల మార్కెటింగ్ అవకాశాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించి ప్రచురించడం, (ఈ) పెట్టుబడి సంఘం ఒకదాన్ని నిర్వహించడం (ఉ) రాష్ట్ర ప్రభుత్వం తమకు కావలసిన వాటిని నాణ్యమైన ప్రమాణాలుగల వాటినే తీసుకోవాలి. ప్రైవేట్ రంగంలో గణుతికెక్కిన నాణ్యమైన వాటికి బహుమతులివ్వాలి.

(ఊ) ముందు కావలసిన సౌకర్యాలు సకాలంలో అందేట్లు హామీ ఇవ్వాలి. (ఋ) యాజమాన్యానికి సంబంధించిన శిక్షణ కార్యక్రమాలను పెంపొందించాలి.

## విద్యుచ్ఛక్తి

పారిశ్రామిక రంగంలోనూ, ఇంకా ఇతర రంగాలలోనూ తలపెట్టిన అభివృద్ధికై విద్యుచ్ఛక్తి 1965-66 నాటికి ఐదు వందల మిలియన్ల వాట్లు, 1970-71 నాటికి వెయ్యి మిలియన్ల వాట్లు కావాలి. ఇందుకై 1965-66, 1970-71 నాటికి వరుసగా ఆరు వందలు, 1550 మిలియన్ల వాట్ల విద్యుదుత్పాదక యంత్రాలను నెలకొల్పాలి. ఈ అవసరాలకై ఈ క్రింది సిఫార్సులు చేశారు.

(1) జలవిద్యుచ్ఛక్తి కేంద్రాలలో శక్తిని ఆరు వందల మిలియన్ల వాట్ల వరకు పెంచడం. ఇందులో ఎగువసీలేరు ప్రాజెక్టు మొదటి రెండు దశల వల్ల 240 మిలియన్ల వాట్ల శక్తి లభిస్తుంది. మిగతా మొత్తం శ్రీశైలం, నాగార్జున సాగర్ హైడెల్ ప్రాజెక్టుల నుంచి లభిస్తుంది. ఎగువసీలేరు ప్రాజెక్టు నిర్మాణ స్థల విషయంలో దాన్ని ఎక్కడ నిర్మించాలనే నిర్ణయాన్ని-ఆంధ్రప్రదేశ్ ఒరిస్సాలు ఒక ఒప్పందానికి వచ్చి-వీలైనంత త్వరలో ప్రకటించాలి. లేకుంటే రెండు రాష్ట్రాల అభివృద్ధి కూడా కుంటుపడుతుంది.

(2) థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రాల శక్తిని 4 వందల మిలియన్ల వాట్ల వరకు పెంచాలి. దీన్ని ముఖ్యంగా సింగరేణి ప్రాంతంలోని పైథేడ్ స్టేషన్ల నుంచి పొందవచ్చు. తృతీయ ప్రణాళిక కాలంలో నెల్లూరు వద్ద 30 మిలియన్ల వాట్లు, రామగుండం వద్ద 60 మిలియన్ల వాట్లు ఉత్పత్తి చేసే కేంద్రాలను విస్తరింప చేయాలని తలపెట్టారు. మిగతా 300 మిలియన్ల వాట్లు ఉత్పత్తి చేసే కేంద్రాన్ని కొత్తగూడెంవద్ద నెలకొల్పవచ్చు. ఇందులో 120 మిలియన్ల వాట్ల ఉత్పత్తి చేసే కేంద్రాన్ని అప్పుడే తృతీయ ప్రణాళికలో తలపెట్టారు.

(3) ఎగువసీలేరు - కొత్తగూడెం - నాగార్జునసాగర్ - శ్రీశైలం - కడపలను కలుపుతూ 220 కెవిల ట్రాన్స్‌మిషన్ లైన్లను పూర్తిచేయాలి. ఇది రాష్ట్రంలోని మూడు విద్యుత్కేంద్రాలలో విద్యుచ్ఛక్తి మార్పిడికి తోడ్పడటమే గాక నాలుగు దక్షిణాది రాష్ట్రాల మధ్య (ఆంధ్ర ప్రదేశ్, కేరళ, మద్రాసు, మైసూరు) అంతర్‌రాష్ట్రీయ విద్యుచ్ఛక్తి మారకానికి తోడ్పడుతుంది.

## రవాణా సౌకర్యాలు

రవాణా సౌకర్యాల ఆర్థిక స్థితులలో తలపెట్టిన అభివృద్ధిలో ఏర్పడిన అభిఘాతాన్ని తొలగించటానికి వచ్చే పదేళ్ళలో 1,802 మైళ్ళ జాతీయ రహదారులు, 13,650 మైళ్ళ పక్కా-రోడ్లు, 35, 27 ల మైళ్ళ కచ్చా రోడ్లను నిర్మించాలని సిఫార్సు చేశారు. ప్రస్తుతం వున్న ట్రక్కుల సంఖ్యను రెట్టింపు చేయాలి. 2,400 అదనపు బస్సులు కావాలి. నాలుగు కొత్త రైల్వే లైనులు సిఫార్సు చేయబడినవి. హైద్రాబాద్ - ఒంగోలు లైను నిర్మాణానికి అధిక ప్రాముఖ్యత ఇవ్వాలి. విజయవాడ, ఖాజీపేట, గుంటూరు, రాజమండ్రి మధ్య లైనులను రెట్టింపు చేసి విజయవాడ - మచిలీపట్నం లైనును బ్రాడ్‌గేజిగా మార్చాలి. ఎగువ కృష్ణానది ప్రాంతంలో పడవల సౌకర్యాలను విస్తృతం చేయాలి. ఏలూరు, మచిలీపట్నం కాలువల త్రవ్వకాన్ని, పవర్ క్రాఫ్ట్‌ను ప్రవేశపెట్టే విషయాన్ని ఆలోచించాలి. విశాఖపట్నం రేవు బెర్తుల శక్తిని పెంపొందించి సరుకులను దింపడం మొదలైన కార్యక్రమాలకు యంత్రాలను ప్రవేశపెట్టాలి.

## మానవశక్తి

1961-71 సంవత్సరాల కాలంలో కార్మికుల సంఖ్య 2.4 మిలియన్లకు పెరగగలదని అంచనా. ఇందులో వ్యవసాయేతర వృత్తులలో 1.5 మిలియనుల మందికి ఉద్యోగావకాశాలు కలుగుతాయి. మిగతా మొత్తానికి వ్యవసాయంలో పని కల్పించాల్సి ఉంటుంది. యిప్పుడు ప్రతిపాదించిన అభివృద్ధి కార్యక్రమాలలో సాంకేతిక సిబ్బందికి నిపుణతగల పనివారలకు అవసరమైన శిక్షణ సౌకర్యాలను అధికం చేయాలని సిఫారసు చేశారు. యీ కాలంలో 11000 మంది ఇంజనీర్లు (డిప్లొమా పొందిన వారితోసహా), పరిశ్రమలకై 59000 మంది నిపుణతగలవారు, నిపుణతలేని పనివారలు 88000 మంది ఉపాధ్యాయులు కావల్సిఉంటుందని అంచనావేశారు.

## ఆర్థికాంశాలు

నీటి వనరుల ప్రాజెక్టులపై చేసిన పెట్టుబడి ఖర్చులో కనీసం సగం మొత్తాన్నయినా, 20 మొదలు 25 సంవత్సరాలలో సులభ వాయిదాల ద్వారా రాబట్టడానికై బీహారులో మాదిరిగా

శాసనం చేయాలి. ఇక మీదట, అత్యవసరమైన నీటి పారుదల పథకాల విషయంలో మినహా, ఇతర ప్రాజెక్టుల స్థాపన విషయంలో, ఆయా ప్రాంతాలకు చెందిన భూయజమానుల నుంచి, వారు ప్రాజెక్టు నిర్మాణంపట్ల సుముఖంగా వున్నట్లూ, ప్రాజెక్టుకు అయ్యే ఖర్చులో కొంత మొత్తాన్ని భరించడానికి వారు సిద్ధంగా వున్నట్లు నిర్ధారణ చేసుకునే నిమిత్తం, అభిప్రాయాలు సేకరించ వచ్చు. పట్టణ ప్రాంతాలలో ఆస్తులపై అభివృద్ధి పన్నులు విధించే విషయాన్ని పరిశీలించవచ్చు. "ప్రత్యేక పన్నుల" విధానాన్ని అవలంబించడానికి స్థానిక సంస్థలను ప్రోత్సహించ వచ్చు. అద్యతన భావిలో అదనపు పన్నుల విధింపుకు అవకాశం పరిమితంగా వుంటుంది. మెట్టభూములపై భూమిశిస్తు ప్రాతిపదిక రేటు తక్కువగా వుంది. కాబట్టి ఇటీవల విధించబడిన సర్‌ఛార్జిని, రాష్ట్రంలో భూమిశిస్తులో భాగంగా శాశ్వతంగా కొనసాగించాలి. సర్‌చార్జి రేటును గరిష్ట ప్రమాణంలో 50 శాతం పైన పెంచ వచ్చు. వ్యవసాయేతరమైన భూములపై పన్ను విధింపు విధానాన్ని మార్చి తగు విధంగా పెంచాలి. మొదటి మూడు గ్రేడుల భూములకు నీటి తీరువను నిర్బంధంగా వర్తింప చేయడానికై భూమిశిస్తు సంస్కరణల సంఘం వారు చేసిన సిఫార్సులను రాష్ట్రప్రభుత్వం ఆమోదించ వచ్చు. పరిపాలనా విషయంలో జరిగే ఖర్చు పెరిగిపోకుండా చూడవలసిన అవసరం ఎంతైనా వుంది.



# రచయితలు

1. డాక్టర్ నీలం సంజీవరెడ్డి, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
2. శ్రీ ఏ. సోమసుందర్, పిఠాపురం, తూర్పుగోదావరి జిల్లా
3. "ఉదయభాను", హైదరాబాదు.
4. శ్రీ అరవింద (తెలుగుసేత: శ్రీ బి. యస్. రాఘవ, కర్నూలు)
5. పద్మశ్రీ శ్రీ సి. నరసింహం, ప్రణాళికా స్థానిక పరిపాలన శాఖల కార్యదర్శి, హైదరాబాద్
6. శ్రీ ద్వివేదుల సోమనాథశాస్త్రి, పులిగడ్డవారి వీధి కొత్తపేట, విజయనగరం
7. శ్రీ సుప్రసన్న, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు
8. శ్రీ ముద్దంశెట్టి హనుమంతరావు, 3/డి 2 యూనిటు-1, ఓల్డ్ సెటిల్మెంట్, ఖరగ్‌పూర్
9. శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయం హైదరాబాదు-7
10. శ్రీ బి. వి. సుబ్బారెడ్డి, ఆంధ్రప్రదేశ్ శాసన సభాధ్యక్షులు, హైదరాబాద్.
11. శ్రీ పి. వి నరసింహారావు, ఆంధ్రప్రదేశ్ న్యాయ, సమాచారశాఖల మంత్రి హైదరాబాద్.
12. శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య, ఆంధ్రప్రదేశ్ శాసనసభా ప్రతిపక్ష నాయకులు హైదరాబాద్.
13. శ్రీ సయ్యద్ అబిద్ హుస్సేన్ రజ్వీ, డిప్యూటీ రిజిస్ట్రార్ భూమితనఖా బ్యాంకులు (తెలంగాణా) హైదరాబాదు
14. "స్ప్రెక్టేటర్", హైదరాబాదు.

# పార్లమెంటు సభ్యులకు రాష్ట్రావసరాల గురించి నివేదన



"ఎన్ని అడ్డంకులొచ్చినా కూడా మనం శ్రీశైలం ప్రాజెక్టును నిర్మిస్తాం. లేకుంటే ప్రజాభిప్రాయానికి మనం సమాధానం చెప్పుకోవాల్సి వుంటుంది. మన ఉపేక్షను మనల్ని ఈ తరం వారే గాక ముందుతరాల వారుకూడా గర్హిస్తారు. మనం ఎప్పటికీ కూడా నిందింపబడతాం" అని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ యన్. సంజీవరెడ్డి హైదరాబాద్‌లో ఆగస్టు 2,3 తేదీలలో జరిగిన పార్లమెంటు సభ్యుల సమావేశంలో ఆంధ్రప్రదేశ్ సమస్యలను పార్లమెంటు సభ్యులకు వివరిస్తూ అన్నారు.

పార్లమెంటు సభ్యులు ప్రస్తుత రాష్ట్ర పరిస్థితిని పార్లమెంటుకు సక్రమంగా నివేదించడానికి వీలుగా వారికి అభివృద్ధి రంగంలో రాష్ట్రం ఎదుర్కొంటున్న సమస్యలకు సంబంధించిన సమాచారాన్ని, అధికారుల దృష్టిని తెలపడానికి వీలుగా ఈ సమావేశం ఏర్పాటు చేయబడింది. రెండు రోజులపాటు జరిగిన ఈ సమావేశానికి పార్లమెంటు సభ్యులు, రాష్ట్రమంత్రులు, ముఖ్య కార్యదర్శి, ఇతర అధికారులు హాజరయ్యారు. భారత ప్రభుత్వ రక్షణశాఖ స్టేట్‌మంత్రి శ్రీ కొత్త రఘు రామయ్య కూడా ఈ సమావేశానికి హాజరయ్యారు.

## థర్మల్ కేంద్రాలు

ముఖ్యమంత్రి ప్రప్రథమంలో రాష్ట్రంలో ఏర్పడిన విద్యుచ్ఛక్తి కొరతను ప్రస్తావించి, ఈ సందర్భంలో కొత్తగూడెం, రామగుండం థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రాల ప్రాముఖ్యతను గురించి తెలిపారు. తగినంత బొగ్గు దొరికినట్లయితే ఈ థర్మల్ స్టేషన్ల విషయం చూడ్డానికి రాష్ట్రం నిర్ణయించిందని ముఖ్యమంత్రి అన్నారు. ప్రపంచబ్యాంకు, కేంద్ర ప్రభుత్వాల సహాయాన్ని కోరటం జరిగిందని, ప్రస్తుతానికి 1,20,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే కొత్తగూడెం థర్మల్ స్టేషన్ స్థాపన విషయంలో సంప్రదింపులు జరుగుతున్నాయని ఈ ప్రాజెక్టుకు ఈ సంవత్సరాంతంలోగా ఆమోదం లభిస్తుందని ముఖ్యమంత్రి వెల్లడించారు.

శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు విషయం ముఖ్యమంత్రి ప్రస్తావించి రాష్ట్ర ప్రణాళికనుంచి దాన్ని తొలగించరాదని అన్నారు. రాష్ట్రానికి భారీ విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు ఒక్కటి కూడా లేదన్న విషయాన్ని ఈ సందర్భంలో ఆయన సూచించారు. తుంగభద్ర ప్రాజెక్టు ఆంధ్ర, మైసూరు, రాష్ట్రాలకు సంయుక్తమైంది. మాచ్‌కండ్ ప్రాజెక్టు ఆంధ్ర–ఒరిస్సాలది. ఇకపోతే శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు రాష్ట్ర ప్రభుత్వానికి సంబంధించింది. అందువల్ల రాష్ట్రంలో అధికమవుతున్న విద్యుచ్ఛక్తి అవసరాల దృష్ట్యా శ్రీశైలం ప్రాజెక్టు అతి ముఖ్యమైంది అని ముఖ్యమంత్రి అభిభాషించారు.

మాచ్‌ఖండ్ ప్రాజెక్టు విశాఖపట్నం, శ్రీకాకుళం, తూర్పు గోదావరి జిల్లాల వరకే సరిపోతుందని కాని శ్రీశైలం జల విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు వల్ల మొత్తం రాయలసీమ, తెలంగాణా ప్రాంతాలకు సౌకర్యం కలుగొతుందని ఈ విషయంలో రాష్ట్ర పరిస్థితిని తాము ప్రధాన మంత్రికీ, రాష్ట్రపతికీ నివేదించినట్లు ముఖ్యమంత్రి వెల్లడించారు.

ఆయన తమ ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఎగువసీలేరు ప్రాజెక్టును సత్వరం చేపట్టకపోతే రాంష్ట్రంలో విద్యుచ్ఛక్తి పరిస్థితి మరింత అధ్వాన్నం కాగలదని అన్నారు. అయినప్ప

టికి ఈ సాధక బాధకాలను అభివృద్ధి అయిన వివిధ పథకాలతో సరిపెట్టుకోవాలి. మరొక రెండేళ్ళలో ఈ ప్రాజెక్టు పూర్తి అవుతుంది. ఏది ఏమైనా ఈ బాలిమేల స్థలాన్ని గనక ఈ ప్రాజెక్టుకు నిర్ణయిస్తే దాని నిర్మాణం కనీసం ఐదారేళ్ళు పడుతుంది.

## జాతీయ ప్రాజెక్టు

ఆ తరువాత ముఖ్యమంత్రి భారీ, మధ్యరకం, చిన్నరకం పథకాలను ప్రస్తావించారు. నాగార్జున సాగర్ ప్రాజెక్టు ఒక్క ఆంధ్రప్రదేశ్‌నే గాక, యావద్భారత దేశాన్ని కూడా సంపద్విలసితం చేయగల జాతీయ ప్రాజెక్టు అనీ, కనుక కేంద్ర ప్రభుత్వం దీన్ని చేపట్టడం సముచితమైన విషయం కాగలదనీ, దానికి రాష్ట్ర ప్రణాళిక మంచికాక వేరే కేటాయింపును కేటాయించాలనీ ముఖ్యమంత్రి ఉద్ఘాటించారు. తక్కువ ఆదాయం గల రాష్ట్ర ప్రభుత్వానికి ఈ ప్రాజెక్టువల్ల అధిక వ్యయమవుతున్నదని అందువల్ల ఇతర సంక్షేమ కార్యక్రమాలవైపు ఎక్కువ శ్రద్ధ వహించడానికి వీలుండదని ఆయన అన్నారు. శ్రీశైలం, నల్గొండ, ఖమ్మం, నిజామాబాద్ వంటి జిల్లా కేంద్రాలలో ఆస్పత్రులు లేవని ఈ సందర్భంలో ముఖ్య మంత్రి ఉదహరించారు. కనుక నాగార్జున సాగర్ ప్రాజెక్టును భిలాయ్, రూర్కెలాలవలె జాతీయ ప్రాజెక్టుగా పరిగణించాలని కోరుతూ ఈ విషయాన్ని పార్లమెంటులో ఒత్తిడి తీసుకు రావలసిందని ఆయన పార్లమెంటు సభ్యులకు విజ్ఞప్తి చేశారు.

రాష్ట్రంలోని రోడ్ల హీనస్థితిని ప్రస్తావిస్తూ, ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కువ మైళ్ళ పొడవుగల రోడ్లున్నాయనీ, కాని వాటి నిర్మాణానికీ, మరమ్మతులకు, నిర్వహణకు చేస్తున్న కెటాయింపులు చాలకుండా వున్నాయని ముఖ్యమంత్రి వివరీకరించారు. తృతీయ ప్రణాళికలో ఈ పద్దు క్రింద ఐదుకోట్ల రూపాయలు కేటాయించారు. "ఈ మొత్తం కేటాయింపు రోడ్లపై మట్టి పోయడానికి చాలదు. ఇంకా వాటిని తారు చేయడానికి అసలే చాలదు" అన్నారాయన.

## కేంద్ర పరిశ్రమలు

రాష్ట్రంలో కేంద్రం ఆధ్వర్యాన ఇంకా పరిశ్రమలు నెలకొల్పవలసిన అవసరాన్ని గురించి కూడా ముఖ్యమంత్రి పార్లమెంటు సభ్యుల దృష్టికి తెచ్చారు. ఆంధ్రప్రదేశ్ అభ్యర్థనలను తోసిపుచ్చివేసి మరొకవైపు మద్రాసు రాష్ట్రానికి పెక్కు పరిశ్రమలు కేటాయించిన విషయం ఆయన ప్రస్తావించారు. ముఖ్యంగా ఈ విషయాన్ని పార్లమెంటు సభ్యులు కేంద్రానికి తెలిపి "ఆంధ్రప్రదేశ్‌కు దాని వాటాదానికి వచ్చేట్లు కృషి చేయాలి" అని విజ్ఞప్తి చేశారు. "ఢిల్లీ అనాలోచితంగా ఏ నిర్ణయమూ చేయదు. మన కోరికలు కూడా అనాలోచిత మైనవి, అనవసరమైనవీ కావు" అన్నారు ముఖ్యమంత్రి.

అదనపు రైల్వే లైనులకై చేసిన ప్రయత్నాల విషయం ముఖ్యమంత్రి ప్రస్తావించి "అది మరొక బాధాకరమైనకథ" అన్నారు. ఈ విషయంలో కూడా పార్లమెంటు సభ్యులు తాము చేయగలిగినంతా చేయాలన్నారు.

## కేంద్ర మంత్రి సలహా

భారత ప్రభుత్వ రక్షణ శాఖ స్టేట్ మంత్రి శ్రీ కొత్త రఘురామయ్య ఈ సమావేశంలో ప్రసంగిస్తూ తామూ, కేంద్రంలో గల తమ మిత్రులూ కూడా ఆంధ్రప్రదేశ్‌కు, అన్ని రంగాలలో దాని సత్వర అభివృద్ధికి చేయగలిగినంత సహాయం చేయగలమని హామీ ఇచ్చారు. పార్లమెంటు సభ్యులు తమ అవసరాలను విస్మరించలేదని ప్రజలు తెలుసుకునేందుకై జిల్లాల స్థాయిలో ఇటువంటి సమావేశాలు జరపాలని ఆయన సూచించారు.

రక్షణశాఖ పరిశ్రమల విషయం ఆయన ప్రస్తావించి "సరియైన స్థలం, ముడి సరుకు లభ్యం కావడం, సాంకేతిక నిపుణత, జాతీయ రక్షణ" వల్ల క్లిష్ట పరిస్థితుల నెదుర్కొనవలసి వస్తున్నదన్నారు. మద్రాసులో టాంకుల కర్మాగారాన్ని నెలకొల్పడానికి గల కారణం—మద్రాసు ప్రభుత్వం విద్యుచ్ఛక్తిని సాంకేతిక నిపుణులను ఇవ్వడమేగాక సరియైన స్థలాన్ని కూడా ఇవ్వడమేనని ఆయన వివరీకరించారు.

## రెండవ రోజు సమావేశం

ఆగస్టు 3వ తేదీన రెండవ రోజు సభలో ముఖ్య మంత్రి నాగార్జునసాగర్ భవిష్యత్తు విషయమై ప్రసంగిస్తూ రాష్ట్ర ప్రణాళికా పరిధినుంచి దీనిని తీసివేయ డానికి ప్రయత్నించడమే ప్రభుత్వ దృక్పథమని పునరుద్ఘాటించారు. దీనివల్ల మిగిలే రు. 50 కోట్లను జాతీయ నిర్మాణ కార్యక్రమాలను నిర్వహించే ఇతర శాఖ అవసరాలను ఆదుకోవడానికి ప్రభుత్వం ఉపయోగించే వీలు కలుగుతుందని ఆయన అన్నారు. ఈ భారాన్ని తక్కువ చేయడానికి కేంద్ర ప్రభుత్వం మార్గాలను అన్వేషించాలి.

కేంద్ర ప్రభుత్వం యీ ప్రాజెక్టుకు పూర్తి ఆర్థిక సహాయం అయినా చేయాలి, లేదా ప్రాజెక్టు నిర్మాణం పూర్తిఅయిన తర్వాత వసూలు చేసే పద్ధతిలో నిధులను సమకూర్చాలి. ఈ సందర్భంలో వరద నిరోధక పథకాలను గురించి ప్రసంగిస్తూ ఈ పథకాలను కూడా రాష్ట్ర ప్రణాళికా పరిధినుండి తొలగించాలని ముఖ్యమంత్రి అభిభాషించారు. కేంద్రం నుంచి తగిన సహాయం లభించనిదే రాష్ట్ర ప్రభుత్వం యీ పథకాలను అమలుపరచలేదు. రాష్ట్ర స్థాయిలో ప్రణాళికా సంఘాలను నియమించాలనే సూచనను ఆయన త్రోసి పుచ్చారు. యీ సంఘం అవసరం అంతగా లేదని ఆయన అన్నారు.

ప్రతి శాఖకూ 'ప్రణాళికా విభాగాలను నెలకొల్పాలని ప్రణాళికా సంఘాలను స్థాపించాలని' శ్రీ రామేశ్వర్‌రావు (మహబూబు నగర్) సూచించారు. విద్య గురించి మాట్లాడుతూ, సాంకేతిక విద్య, పాలిటెక్నికులకు ఎక్కువ ప్రాధాన్యం యివ్వాలని ఆయన అన్నారు. రాష్ట్ర అవసరాలను క్షుణంగా వివరించడానికి వీలుగా బడ్జెటు సమావేశానికి ముందు సభ్యులంతా కలుసుకోవాలని శ్రీ అక్బర్ అలీఖాన్ అభిప్రాయ పడ్డారు. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు ప్రసంగిస్తూ, రాష్ట్రప్రభుత్వం వ్యవసాయంపైకన్నా పరిశ్రమలపై యెక్కువ శ్రద్ధ చూపాలని అన్నారు. జిల్లాల వారిగా పారిశ్రామిక పథకాలను తయారు చేయాలని ఆయన సూచించారు.

## కాఫీతోటల పెంపకం

వరద నిరోధక పథకాలను, రాష్ట్రప్రణాళిక పరిధినుంచి తొలగించడానికై ముఖ్యమంత్రి చేసిన విజ్ఞప్తితో ఏకీభవిస్తూ, కేంద్రప్రభుత్వం తాలూకు ప్రాంతీయ కార్యాలయాలను హైద్రాబాదులో నెలకొల్పవలసిన అవసరాన్ని గురించి డా. కె. ఎల్. రావు వక్కాణించారు. కేంద్ర ప్రభుత్వానికి సమర్పించిన కాఫీ తోటల పథకం విషయంలో పార్లమెంటు సభ్యులు గట్టిగా ప్రయత్నించాలనీ, రాష్ట్రప్రభుత్వం చేసే ప్రయత్నాలకు స్వలాభాపేక్షపరులవల్ల హాని కలుగవచ్చనీ శ్రీ తెన్నేటి విశ్వనాథం అన్నారు.

శ్రీమతి విమలాదేవి, శ్రీ జి. లచ్చన్న, శ్రీ వెంకటసుబ్బయ్య, శ్రీమతి అమ్మన్న రాజా గారలుకూడా చర్చలో పాల్గొని, నాగార్జునసాగర్ ప్రాజెక్టు, వరద నిరోధక పథకాల విషయంలో చేయబడిన విజ్ఞప్తులను సమర్థించారు. మంత్రులు, పార్లమెంటు సభ్యులమధ్య సమన్వయం చక్కగా వుండాలనికూడా వీరు సూచించారు. విద్యామంత్రి, ఆర్థిక మంత్రికూడా ప్రసంగించారు. వివిధ ఉపసంఘాల సమావేశకర్తల పేర్లను ఆర్థికమంత్రి ప్రకటించారు. ఈ ఉప సంఘాలు ప్రతి సమస్యను సాకల్యంగా పరిశీలిస్తాయి.

## ఉపసంఘాలు

(అ) విద్యుచ్ఛక్తి, నీటివనరులు: డా. కె. ఎల్. రావు; (ఆ) పరిశ్రమలు: శ్రీ రామేశ్వరరావు; (ఇ) విద్య, ఆరోగ్యం: శ్రీ అక్బర్ అలీఖాన్; (ఈ) క్షామనివారణ: శ్రీ ఈశ్వరరెడ్డి; (ఉ) రవాణాసౌకర్యాలు: శ్రీమతి అమ్మన్న రాజా; (ఊ) ఆర్థికాంశాలు: శ్రీ హెచ్. సి. హెడా.

రెండు రోజులపాటు జరిగిన చర్చను ముగిస్తూ ముఖ్యమంత్రి, తన ఆహ్వానాన్ని మన్నించి సమావేశంలో పాల్గొన్నందుకు సభ్యులకు కృతజ్ఞతలు తెలిపారు.



# గ్రంథసమీక్ష

## ఉత్తర మేఘము

మూల్యం:- రెండు రూపాయలు. రచయిత; కవి సుధాకర భళ్లమూడి నరసింహమూర్తి బి. ఏ.; ప్రతులకు రచయిత పేర ఎస్. ఇ. రైల్వే ఎం. హెచ్. హైస్కూలు, ఖుర్దారోడ్డు, పూరి జిల్లా (ఒరిస్సా) అని వ్రాయాలి.

కాళిదాసు మేఘ సందేశ కావ్యాన్ని పలువురు అనువదించారు. ఎందరు దీన్ని అనువదించినా అది ఇంకా అనేక వర్ధిష్ణువుల ఆకర్షిస్తూనే ఉంటుంది. మహాకవుల రచనల్లో ఉండే ప్రత్యేకత అట్టిది. ఐతే అనువాదాల్లో కేవలం మూలానుసరణమే ఉండక భాషాంతరీకరించిన వారి ప్రతిభావ్యుత్పత్తులు అందు కాన్పిస్తూ ఉంటవి. వారి ముద్ర ఆయా రచనలపై ప్రస్ఫుటంగా కాన్పిస్తుంది.

ఉత్తర మేఘమనే ఈ కావ్యంలో యక్షుడు శాపావసానమున రామగిరి వాసుల వీడ్కోలు గైకొని అలకాపురి చేరుకొనుట, మేఘుడు తన కెరిగించిన మార్గాన వెళ్లుతూ వింతలగనుట, కుబేర సన్నిధానానమునకు వెడలి, సముచితంగా సంభావి పబడి, ప్రియురాలిని చేరుకొనుట దీనిలో వర్ణింపబడినవి. శ్రీ నరసింహమూర్తిగారు దీనిలో యక్షునికి పరీక్షనొక దానిని సృష్టించారు. ఇంద్రియలోలత్వంవలన కలిగే అనర్థాలు, నిగ్రహత్వంవల్ల కలిగే ప్రయోజనాలు, స్వధర్మాచరణానురక్తి, స్వామిభక్తి అనుచరులపట్ల ప్రవర్తించవలసిన విధానము, దంపతుల అనురాగము మొదలగు అంశాల కడురమ్యంగా వర్ణించారు.

ఈ రచన కేవలం భాషాంతరీకరణంకాదు, కవితలో రసపుష్టి, వర్ణనా చాతురి కాన్పిస్తుంది. సహజంగా నడచిన వీరి సరళమగు కవితాధారకు రెండు మచ్చుతునకలు ఇవి:-

"భర్తృభగినీ సమాగమభావకలన
భారతి భగీరథిని గోరిచేరఁదలఁచి
తమిని స్రోతస్
స్వరూపముదాల్చెనేమొ
యనఁగఁజాలు సర
స్వతిస్గని యెనచట,
కనుఁగొనె జహ్నుకర్ణపుటగహ్వర సంజనితన్, సురాంగనా
ఘనకుచకుంభసమ్మిళితక్రమసుగంధఁకు రంగనాభసం
గను, భవసాగరోత్తరణ, గాంచనకంజ విహారభృంగసం
ఘను, నపవర్గదాయినిని, గౌరిసపత్నిని, జాహ్నవీధునిన్."

## నివేదన
### (తిరుపతి వేంకటేశ్వరశతకం)

రచయిత: కోటగిరి విశ్వనాధరావు. మూల్యము:- 50 న. పై. ప్రతులకు రచయిత పేర గంపలగూడెం, కృష్ణా జిల్లా అని వ్రాయాలి.

పుణ్యమూర్తి, సకల కల్యాణ గుణావహుండగు భగవంతుని భక్తిభావంతో భిన్నరీతులకొలచే వారు, కొలచినవారు ఉన్నారు. భగవంతుని లీలల కీర్తిస్తూ ఎందరో శతకాల వ్రాశారు. ఇట్టి శతకాలవల్ల ఇహానికి పరానికి బనికివచ్చేలా లోకజ్ఞానపు రీతులు గుప్పించబడినాయి. ఆంధ్రవాఙ్మయంలో శతకాలు అనేకం ఉన్నాయి.

శ్రీ కోటగిరి విశ్వనాధరావుగారి నివేదన వాస్తవంగా వారి ఒక్కరి నివేదన మాత్రమేకాదు. ఏ మాత్రం ఆస్తిక్య భావం కల వారినైనా వారి హృదయాన్ని కదిపి ఒకమారు భక్తిభావంతో ఆత్మ సంశోధనను చేయిస్తుంది. ఈ శతకం చదివిన వారిని ఈ శతకాన్ని చదివేప్పుడు కంకర రాళ్లపై బండినడచినటులగాక కవితలో సరళమగు ధారకాన్పిస్తుంది. గుణగ్రహణ పారీణులగు విద్వద్రసజ్ఞులకై ఇవి:-

"చిన్నతనంబునుండియును జేసిన పుణ్యములేదు, సాధనం
బన్నదినాస్తియో! నమసితామల భక్తులగాధలేనినే
విన్నదిలేదు, జీవితము వేసరివేదన కాకరంబుగా
నిన్నిదినాలకున్ విరిసెనీకృప తిరుపతి వేంకటేశ్వరా!

జీవితమార్గమియ్యది విచిత్రతరాను భవాలసంపుటం
బావిధమైన జీవితమునందు విషాద సుఖంబులెన్నగా
భావనచేయుచుండెదము
ప్రబ్బినయజ్ఞతచే, నిజంబుగా
జీవరహస్యమేర్పడ వచింపగ
శక్యమే? వేంకటేశ్వరా"

—శ్రీ సి. హెచ్. ఆచార్య.

# ఆంధ్ర సేవకులు

గ్రంథకర్త: శ్రీ జాస్తి వేంకట నరసయ్య. ప్రచురణ: భారతీ సమితి, పామర్రు, కృష్ణా. పుటలు: 86+4–వెల: రూ. 1/-

దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు; కవయిత్రి, దేశభక్తురాలు శ్రీమతి మాగంటి అన్నపూర్ణ; ప్రజాధురంధరుడు, అనన్య సాహసోపేతుడు, అఖండ త్యాగమూర్తి, అసామాన్య రామభక్తుడు, ఆంధ్రరత్న శ్రీ దుగ్గిరాల గోపాలకృష్ణయ్య; కలియుగ భీముడు, మహావదాన్యుడు శ్రీ కోడి రామమూర్తి; కవి, పండితుడు, విమర్శకుడు, మహావక్త పరిశోధకుడు, సాహితీవేత్త, మేధావి, దేశభక్తుడు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారల జీవితచరిత్రలీ పుస్తకములో పొందుపరచబడినాయి. నిజానికి వీరు ఆంధ్రమాత అనుంగుబిడ్డలుగానే గాక జాతిరత్నాలుగా వెలుగొందినవారు.

పండితులు, విద్వత్కవులు, "జాతీయ మధురకవి" బిరుదాంచితులు అయిన శ్రీ జాస్తి వేంకట నరసయ్యగారు ఈ పుస్తకాన్ని ప్రకటించడంద్వారా ఆ మహామహులకు తమ భక్త్యంజలులు ఘటించడమే గాకుండా ఆంధ్ర పాఠకలోకానికి, ప్రత్యేకించి యువతరానికి ఎనలేని సేవచేసిన వారయ్యారు కూడా. ఈ జీవిత చరిత్రలన్నీ స్ఫూర్తి ప్రదాయినులు. శైలిగ్రాంధికమే కాబట్టి దీనిని మాధ్యమిక తరగతులలో దేనికైనా ఉపవాచకంగా పెట్టవచ్చు. జాతీయ గీతాన్నీ, ఇతర దేశభక్తి గీతాలనూ, వీరిపై ప్రముఖులు వ్రాసినపద్యాలను ఇందులో చేర్చడం సమంజసంగా వుంది. శ్రీరామలింగారెడ్డిగారి చిత్రంతోపాటు ఇతరుల చిత్రాలనుకూడా వేసివుంటే బాగుండేది. ద్వితీయ ముద్రణలో ఈ లోటు తీరుస్తారని ఆశించవచ్చు. అందరూ ముఖ్యంగా చిరుతప్రాయులు అవశ్యం పఠించదగిన పుస్తకమిది.

—శ్రీ ఏ. జనార్దనరావు

---

# స్వీకారం

**శ్రీ శఠకోపచరితమ్.**
రచయిత: శ్రీ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు,
వెల: 1–00
ప్రాప్తిస్థానం: శ్రీ గోదా గ్రంథమాల, శ్రీమన్నారయణపురము, ఉల్లిపాలెం పోస్టు, దివితాలూకా, కృష్ణాజిల్లా,

**రచన (మాసపత్రిక) ఎడిటర్: "మసూనా"**
ప్రచురణ: ఉత్తరాంధ్ర గ్రంథమాల
(రచయితల ప్రచురణ సంస్థ)
విడిప్రతివెల: 0–25 న. పై. సంవత్సరంచందా 3–00
దొరకుచోటు: 22–1–43, అగ్రహారంవీధి, విశాఖపట్నం.

**శ్రీ లక్ష్మీనృసింహసుగీత.**
రచయిత: శ్రీ విశ్వామిత్రయోగి
వెల: 0–50 న. పై.
ప్రాప్తిస్థానం. కొండా వీరయ్య అండ్ సన్స్, మహంకాళి వీధి, సికింద్రాబాదు, (ఆం. ప్ర.)

**కుమార ప్రబోధము.**
రచన: శ్రీ మునగపాటి విశ్వనాధశాస్త్రి
వెల: 0–19 న. పై.
ప్రతులకు: వేంకట్రామా అండ్ కో, తెనాలి.

# "ఆంధ్ర ప్రదేశ్"

## (తెలుగు, ఇంగ్లీషు, ఉర్దు, హిందీ) మాసపత్రిక ప్రకటన రేట్లు.

---

దిగువ రేట్లననుసరించి 'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికలో ప్రకటనలు స్వీకరించబడగలవు:

| వివరాలు | నాలుగు సంచికలలో | | | ఒక సంచికలో మాత్రమే | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 300 | 150 | 100 | 100 | 55 | 30 |
| వెనుకఅట్ట పేజీ (4) | 400 | — | — | 150 | — | — |
| అట్ట 2, 3 పేజీలు | 350 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కంట్రాక్టు ప్రకటనలకు 20 శతి రిబేటు ఇవ్వబడును.

### నిబంధనలు

1. మెకానికల్ వివరాలు: $10\frac{3}{4}'' \times 8\frac{1}{2}''$ డెమ్మీ.
2. ముందు అట్ట టైటిల్ పేజీకై ప్రకటనలు స్వీకరించబడవు.
3. పావుపేజీకి తక్కువగాఉన్న ప్రకటనలు స్వీకరించబడవు.
4. వచ్చే సంచికలో ప్రచురించడానికి వీలుగా స్థలం వివరాలు, డబ్బుతోసహా ప్రకటన సమాచారాన్ని ప్రతినెల 8 వ తేదీలోపుగా యీ కార్యాలయానికి పంపాలి. క్రాస్‌చేయని డిమాండ్ డ్రాఫ్ట్‌ద్వారాగానీ, మనియార్డరుద్వారాగానీ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సమాచార, ప్రజాసంబంధముల శాఖ డైరెక్టరు హైదరాబాదుపేర డబ్బునుపంపాలి.
5. బ్లాకుల విషయంలో అన్ని విధాలైన శ్రద్ధ తీసుకోబడుతుంది. అయితే మిషనుపై బ్లాకులు పగిలిన యెడల యీ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన విధం, స్థలం వివరాలను, ఒక సంచికలోనా (భాషనుతెల్పాలి) లేక 4 సంచికలలో ప్రకటించాలా అనే విషయాలను స్పష్టంగా పేర్కొనాలి.
7. చెల్లింపు, యితర ప్రత్యుత్తరాలను దిగువ వారితో జరుపాలి:—

డైరెక్టర్,
సమాచార ప్రజాసంబంధాల శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్—1

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

## విస్తీర్ణం, సివిల్ డివిజన్లు (1961 జనాభా లెక్కలు)

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనాభా | ... | 359.8 లక్షలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 189 |
| పట్టణాలు, నగరాలు | | 223 |
| జనసాంద్రత (చదరపు మైలుకు) | | 340 మంది |

## పంచవార్షిక పశుగణన – 1961

(వేలలో)

| | | |
|---|---|---|
| పశువులు | ... | 123,45 |
| గేదెలు | ... | 69,49 |
| గొర్రెలు | ... | 83,63 |
| మేకలు | ... | 42,47 |
| గుర్రాలు | ... | 71 |
| ఇతర జంతువులు | ... | 6,76 |

## సమాజాభివృద్ధి కార్యక్రమం

| వివరాలు:– | 1959–60 | 1960–61 | 1961-62 |
|---|---|---|---|
| బ్లాకులు ... | 282 | 326 | 378 |
| సగటున వేయిగ్రామాలకుగల బ్లాకులు ... | 10.66 | 16 | 17 |
| సగటున పదిలక్షల జనాభాకు గల బ్లాకులు | 7.72 | 16 | 16 |
| బ్లాకులక్రింద వున్న గ్రామాలు ... | 178,87 | 20,901 | 245 02 |
| బ్లాకు ప్రాంతాల్లో నివసించే ప్రజలు | 187,31 | 205,73 | 235,65 |

## ఖనిజోత్పత్తి

| | 1959–60 | 1960–61 |
|---|---|---|
| | టన్నులు | టన్నులు |
| బొగ్గు ... | 2296,000 | 2596,000 |
| ముడిఇనుము ... | 203,000 | 233,000 |
| మాంగనీస్ ... | 16,000 | 24,000 |
| అభ్రకం ... | 3,000 | 3,000 |
| సున్నపురాయి ... | 776,000 | 1,036,000 |

